# ప్రేమ బంధం

(ఏలూరు దినపత్రిక రత్నగర్భనుండి వెలువడిన డైలీ సీరియల్)

రచన

**డా॥ వాసా ప్రభావతి**

హైదరాబాదు

ప్రచురణ

**వాసా ప్రచురణలు**

మలక్ పేట - హైదరాబాదు

PREMA BANDHAM
by
Vasa Prabhavati

మొదటి ముద్రణ
April - 1993

వెల : 36/-

ముఖచిత్రం - శీలా వీర్రాజుగారు

కవరుపేజి
బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్ - చిక్కడపల్లి—హైదరాబాదు.

ప్రతులకు

వి. వి. మాధవి
వాసానిలయం
11/2,RT మునిసిపల్ కాలనీ
మలక్‌పేట్ - హైదరాబాదు-500036.

విశాలాంధ్రా బుక్ హౌస్
జ్ఞానభవన్
ట్యాంక్‌స్ట్రీట్, కోఠి హైదరాబాదు.

నవోదయ బుక్ హౌస్
సుల్తాన్‌బజార్ - హైదరాబాదు.

ముద్రణ :
శబరి ప్రింటర్స్
లింగంపల్లి - హైదరాబాదు
ఫోన్ : 246645

# ప్రేమ బంధం

"రోడ్డు క్రాస్ చెయ్యడానికి ఇంత బయమైతే ఎలాగండీ రండి నాతో''

రోడ్డు దాటడానికి కుస్తీ పడుతున్న కార్తీక త్రుళ్ళిపడి తలెత్తి చూసింది. ఎవరో అపరిచిత వ్యక్తి.

"రండి నాతో" చిరునవ్వుతో మళ్ళీ అన్నాడు. ఒకసారి చూస్తే మళ్ళీ చూడాలన్న చిరునవ్వు, వింతకాంతిలో అతని చిలిపి చూపులు మరింత ఆకర్షణీయంగా వున్నాయి. అతను అడుగు ముందుకు వేసాడు.

అతని వెనకే మంత్రముగ్ధలా కార్తీక అడుగు వేసింది. రోడ్డు దాటి ఇవతలకు వచ్చారు ఇద్దరూ, "చదువేకాదు కాస్త ఇలాటివి కూడా నేర్చుకోవాలి" ఆమె కళ్ళలోకి చిలిపిగా చూస్తూ పనైపోయినట్టు ముందుకు వెళ్ళిపోయాడు. 'థ్యాంక్స్' అని అనాలనుకున్న మాటలు కార్తీక నోటిలో నుంచి బయటకు రాలేదు. అతను దూరంగా వెళ్ళిపోయాడు. కనుచూపుమేర కనబడేటంతవరకు అతన్ని చూస్తూ నిలబడింది. అది నడిరోడ్డనే విషయం క్షణకాలం మరిచిపోయింది.

"ఏడకి ఎల్లాలమ్మా" అంటున్న రిక్షా వాళ్ళ పిలుపులకు ఈ లోకంలోకి వచ్చింది కార్తీక. "ఎంత సేపు నిలబడ్డానో" అనుకుని కాస్త కంగారు పడింది. వెంటనే ఒక రిక్షా పిలిచి అడిగినంతా ఇస్తానని అందులో కూర్చుంది. రిక్షా గంగా పోతోంది. అంతకంటే గంగా ఆమె ఆలోచనలు సాగుతున్నాయి. కనీసం 'థ్యాంక్స్' అని అనవలసింది అనుకుంది. ఎందుకో సిగ్గుతో ఆమె ముఖం ఎరుపెక్కింది. అతని తలపులతో ఆమె మనస్సు ఉరకలు వేసింది. "అతను రమ్మంటే అతని వెంట తనెలా బయలుదేరినట్టు! అసలు నాకు సిగ్గు-దు" అంతలో, తనను తాను నిందించుకుంది. ఇంతలో రిక్షా అతను "ఏడ ఆపమన్నారు?" అన్నాడు ఆమె చెప్పిన గల్లోకి తీసుకొచ్చి" ఆ మాటలకు ఉలిక్కిపడి తలెత్తింది కార్తీక. కాస్త ఇటు అటు చూసింది. "అయ్యో ఇల్లు దాటి వచ్చేసాము. అ దిగో ఆ పచ్చ గేటు దగ్గర ఆపు" అంది కంగారుగా.

అతను ఒక్కసారి ఆమె మొహం సి చూసి రిక్షా వెనక్కి తిప్పి ఆమె వేలితో చూపించిన పచ్చ గేటు దగ్గర సుకొచ్చి ఆపాడు ్ఞాను. కార్తీక రిక్షా దిగి పర్సు తెరిచి ఒక అర్ధ రూపాయి అతని లో ఎక్కువ పెట్టింది. ముఖం చేటంత చేసుకుని అతను రిక్షా ుకుని కదిలాడు.

కార్తీక గేటు సుకొని లోపలికి నడిచింది. "కార్తీ! ఇంత ఆలస్య మయిందేమ్మా" తల్లి శ్యామసుందరీదేవి గుమ్మంలోనే ఎదురై అడిగింది.

"కార్లేదుగా రిక్షాలో వచ్చాను" పుస్తకాలు టేబులుమీద పసి సోఫాలో చతికిలబడింది కార్తీక.

"నీకెన్నిసార్లు చెప్పానమ్మా ! ఆ రిక్షాలో రావద్దని ఆటో చేసు

నుని రా పోయావా?" కూతురు అలసటకు కారణం రిక్షాలో రావటం అనుకుంది.

"ఆటో ఒక్క- కనబడ దు. అందుకని రిక్షా ఎక్కి కూర్చున్నాను." ఋంగమూతి పెట్టింది.

"సరే- ఏదో విధంగా ఇల్లు చేరుకున్నావుగా. వెళ్ళి కాస్త ముఖం కడుక్కురా! నీకిష్టమని బ లు వేశాడు సర్వయ్య" అంటూ వంటింటి వైపు నడిచింది ఆవిడ.

"మా అమ చాలా మంచిది" ఒక్క ఉదుటున సోఫాలోంచి -చి తల్లి భుజాలు పట్టి ఊపి వదిలింది. వెంట- పరుగులాంటి నడకతో బాత్‌రూం వైపు వెళ్ళింది. చన్నీళ్ళతో ముఖం కడుక్కుంది. పక్క- ఉన్న తువ్వాలుతో తుడుచుకుంటూ అద్దంలో ముఖం చూసుకుంది. ఎందుకో ఇందాకటి సంఘటన గుర్తుకొచ్చింది. తల్లికి చెప్పాలి. మనసు తొందర పెట్టింది. పౌడరు రాసుకుని ఎ గని తిలకంతో గబగబా బొట్టు పెట్టుకుంది. అక్కడనుంచి డైనింగ్ హాల్లోకి వచ్చింది. కుర్చీలాక్కుని తల్లి పక్క- కూర్చుంది.

"బ్బ లు సర్వయా! బ్జ లు" చిన్న పిల్లలా అల్లరి మొదలు పెట్టింది.

"అమా పట్టుకొస్తున్నా" అంటూ రెండు ప్లేట్లతో బ్బ లు పట్టుకొచ్చి పెట్టాడు.

అరటికాయతో చేసిన పొడుగాటి బజ్జీలు చూడగా- కార్తీకకు నోరూరింది. -వ నా చూడకుండా చేత్తో తీసి నోట్లో పెట్టింది.

"అమో! -డి వేడి" అంటూ మ ళ ప్లేట్లో పెట్టేసింది.

"అ ం తొందరమా! దిగా ఉన్నాయిగా కాస్త చూసుకోవాలి! అన్నింటికి తొంద నా" త కాస్త మందలింపుగా అంది.

"అమ్మా! అమా ! ఈరోజు బలే ఫార్సయింది" దాచుకో-క అంది.

ఏమిటో చెప్పమన్నట్టు తల్లి ఆమె వైపు చూసింది. కాస్త గొంతుక సవరించుకుంది కార్తీక. "అమ్మా; అమా ! నేను రోడ్డు దాట డానికి భయపడి ముందుకు వెనక్కి వెడుతుంటే" చెప్పడం ఆపి తల్లి ని చూసింది.

"ఏమయిందో తర్వాత చెప్పవేం" ఆదుర్దాగా అంది.

"ఏముంది కానీ ఒక సినిమా హీరోలా ఒక తను వచ్చి నా పక్క నిలబడ్డాడు" మళ్ళీ ఆపింది.

"నిలబడి ఏం చేసాడో చెప్పకుండా ఆపుతావేం" ఆలస్యాన్ని భరించలేనట్టుగా అడిగింది.

'రండి నే దాటిస్తా" అంటూ నన్ను దగ్గరుండి దాటించాడమ్మా అంది చిలిపిగా

"అదేమిటి దగ్గరుండి దాటించడమేమిటి? నువ్వేక్కడో విచిత్రం మనిషిలా ఉన్నావమ్మా"

"విచిత్రానికేముందమ్మా , నాతో రండి అన్నాడు, అతని వెనకే చా అంతే"

"నయమే ఎవరో రాజకుమారుడొచ్చి ఎత్తుకుపోయాడన్నావు కాదు" ఆవిడ కాస్త చిరుకోపం తెచ్చుకుంది.

"అదేమిటమ్మా , నువ్వుండగా నన్నెవ్వరు ఎత్తుకెడతాడు, ఒక వేళ ఎవరైనా ఎత్తు డతానంటే మా అమ్మ నడిగి మరీ ఎత్తుకెళ్ళమని చెబుతాలే" అంది కొంటెగా నవ్వుతూ.

ఆ మాటలకి ఆవిడ కూడా పకపకా నవ్వింది ఇద్దరి ప్లేట్లు ఖాళీలవడం వాడికి తెలియలేదు. ఇంతలో సర్వయ్య రెండు కప్పులతో

చూసింది ఎనిమిది అయింది. "బాబోయ్ కా- టైం అయింది. అంటూ బా రూమ్‌లోకి పరుగెత్తింది. స్నానం అదీ చేసి తిరిగి వచ్చింది బట్టలు సికోడానికి రువా తెరిచింది కాస్త స్పెషల్‌గా వెళ్ళాలనుకుంది. అలా అనుకోగా- ఆమెకు నవ్వొచ్చింది. అంతరాత "నిన్నటి అబ్బాయికోస మేగా" అన్నట్లు అనిపించింది. "అవును నిజమే" సమాధానమిచ్చింది. "కనబడకుంటే" అంతరాత పశ్న.

"నిన్న కనబడినట్లే కనబడవచ్చుగా" సమాధానం త బయిం చింది.

అలమారాలోని చీరలన్నీ సి చూసింది. మ్‌కలర్ చైనాసిల్కు విత్ ష్ ర సుకుంది. గబగబా కట్టుకుంది. ఆ హడావిడిలో రెండు సార్లు కుచ్చిళ్ళు జారిపోయాయి. సమిట చెంగుకు ముందుగా పిన్ను పెట్టుకుంది. తర్వాత ర కుచ్చిళ్ళు పెట్టుకుంది. వాటికి కూడా జార కుండా పిన్ను పెట్టింది తులకి మాచింగ్ గాజులు మాంచిగ్ కలర్ బొట్టు పెట్టుకుంది. మెడలో సన్నని గొలుసు సుకుంది. మరోసారి అద్దం దగ్గర నిలబడి చూసుకుంది. ఏదో సంతృప్తి. పుస్తకాలు సికుని గబగబా హాలులోకి వచ్చింది.

"అ మిటమా, టిఫిన్ తినవా ఏం?" మసుందరీ వి మాటలు వినబడగా, ఆక- స్తోందనిపించింది. గబ గబా డైనింగ్ బులు దగ్గరకెళ్ళి కుర్చీ లాక్కు కూర్చుంది. సర య ఉప్మా ప్లేటు ఆమెకు దగ్గరగా జరిపాడు. ఏమీ మాట్లాడకుండా, ఉప్మా తిని పాలు తాగి తిరిగి హాలులోకి వచ్చింది.

తిపేరు నుంచి తిరిగొచ్చిన కారు గుమా నికి ఎదురుగా ఆగివుంది. కారును చూడగా, ఎక్కడి ని నిరుత్సాహం ముంచుకొచ్చింది. కా క్రీకను చూడగానే డ్రైవరు డోరు తెరచి పట్టుకున్నాడు. తల్లి అక్కడ లేకుంటే అతని ... ... ... ... ... కోపం ...

వంటిది. జైలు గదిలోకి వెడుతున్నట్టే ఎక్కి కూర్చుంది.

"కా ! కాలేజీ వదలగానే ఇంటికొచ్చేసెయ్యి" అంది తల్లి గుమ్మం దగ్గరే నిలబడి.

"ఈ రోజు రాజీ ఇంటికి వస్తానని చెప్పానమ్మా! వాళ్ళ కార్లో వచ్చేస్తాను. కారు పంపించకు" అంది. ఎలాగో అలాగ తప్పించుకుని నిన్నటిచోట ఆగాలని ఆమె కోరిక. ఆ రోడ్డు దగ్గర అతను కనబడతాడనే ఆశ మనస్సులో పీకుతోంది. "సరే నీ యిష్టం చీకటిపడేంతవరకు ఆగకు" తల్లి ఆ మాట అనగానే.

"టా టా" అంటూ చెయ్యి ఊపింది, కారు కదిలింది!

"పిచ్చిపిల్ల, ఏమీ తెలదు ఎలాగో ఏమో, శ్రీకాంత్ ఫారిన్ నుంచి రావాలి తన మనస్సు కుదుటపడాలి". లోపలికి నడిచింది ఆవిడ.

సర్వయ్య ఎదురై "ఈరోజు కూర ఏమిటమ్మా" అన్నాడు.

సుమారు ముప్పయి ఏళ్ళ నుంచి ఆ యింట్లో ఉంటున్నాడు సర్వయ్య. ఇంట్లో ఆత బంధువులు కంటె ఎక్కువగా మసలుకుంటాడు సర్వయ్య అన్ని విషయాలు అతనితో చెబుతుంది ఆవిడ సలహా అడుగుతుంది కూడా.

"ఏదో అమ్మాయి తినేది వండు"

"అలాగేనమ్మ"

"అన్నట్టు సర్వయ్యా!, శ్రీకాంత్ దగ్గరనుంచి ఉత్తరం వచ్చి ఎన్నాళ్ళయిందంటావు"

"మొన్న కదమ్మా! ఉత్తరం వచ్చింది. రెండు మూడు నెలల్లో రావచ్చని రాశారు కదమ్మా!"

"రాగానే పెళ్ళి చేసెయ్యాలి సర్వయ్యా!"

"అవునమ్మా! చేసెయ్యాలి, అమ్మాయిగారు పెద్ద చదువు

లంటారు. అబ్బాయి వచ్చేటప్పటికి ఈమె బిఏ పూర్తి అవుతుంది, వెంటనే పెళ్ళి చేసెయ్యాలి. లేకపోతే ఎమ్.ఎ అంటారు, ఆ తర్వాత ఉద్యోగమంటారు"

"నువ్వు చెప్పింది నిజం సర్వయ్యా! ఈ కాలం అమ్మాయిలు అలాగే అంటారు. అందులో సందేహంలేదు. ముందు పెళ్ళి చేసెయ్యాలి. ఆ తర్వాత వారిద్దరిష్టం ఏమంటావు?

"నిజమేనమ్మా! అలా చెయ్యడం మంచిది" సర్వయ్య వంటగది వైపు నడిచాడు.

ఎంతో ఉత్సాహంగా బయలుదేరిన కార్తీకకు నిరుత్సాహమే ఎదురయింది. తను ఆశించిన వ్యక్తి ఎక్కడా కనబడలేదు. ముందు రోజు కనబడినచోట ఆశగా ఎదురుచూసింది. ఎందరో వచ్చి వెడు తున్నారు కాని అతని జాడమాత్రం లేదు. ఇంకా అక్కడ నిలబడితే చూసినవాళ్ళు ఏమనుకుంటారోనని భయపడి బలవంతంగా కదిలి ఇంటికి బయలుదేరింది.

"ఏమిటమ్మా అలా వున్నావు?" గుమ్మంలోనే ఎదురొచ్చిన తల్లి అడిగింది. కార్తీక ముఖంలో నిరుత్సాహం కొట్టవచ్చినట్లుగా కనబడుతోంది. ఆ కన్య హృదయంలో పడిలేచే భావతరంగాలు ఆ తల్లికి తెలియవు? కాని చమటలు పట్టి వాడిన ఆమె ముఖం, చెదిరిన జుట్టు, నీరసంగా లోపల అడుగుపెట్టిన కూతురు రూపం ఆ తల్లి మనస్సును కలవర పెట్టాయి.

"బాగానే ఉన్నానమ్మా!" కార్తీక సమాధానం ఆ తల్లిని సంతృప్తి పరచదు. కార్తీక సోఫాలో వాలిపోయింది.

"నీ ఫ్రెండింటికి వెడతానన్నావు? వెళ్ళలేదా?

"వెళ్ళలేదమ్మా! ఇంటి వచ్చేసాను?" కార్తీక ముఖాభావంగా సమాధానమిచ్చింది. ఆ నీరసానికి కారణం ఎదురుచూసిన వ్యక్తి కన

బడకపోవడమేనని ఆ తల్లికి ఎలా తెలుస్తుంది?

"వళ్ళు వేడిగా వుందా?" కూతురునుదిట మీద చెయ్యి సి చూసింది. "అయ్యో చల్లగానే వుంది. వెళ్ళి ముఖం కడుక్కు రా? అలసట తగ్గుతుంది."

"ఏంలేదే ఎందుకంత కంగారు?" లేని నవ్వు తెచ్చుకుని అక్కడ నుంచి లేచి గదిలోకి వెళ్ళి బట్టలు మార్చుకుంది. నీళ్ళతో ముఖం కడుక్కోగా, కాస్త ప్రశాంతంగా అనిపించింది. ఆ రాత్రి కార్తీక కంటికి నిద్రలేదు. పదే పదే ఆ వ్యక్తి రూపం కళ్ళముందు కదులుతూ వుంది. ఏదో యని అనుభూతులు కలవర పెడుతూనె ఉన్నాయి.

కార్తీక కొన్నాళ్ళపాటు అతని కోసం ఎదురుచూస్తూ ఉంది. క్రమంగా మళ్ళ అతను కనబడలేదు. క్రమంగా ఆ విషయం అపుల అడుక్కు వెళ్ళిపోయింది. కాలం కదలికలో అతని రూపం మరచి పోయింది. ఒక పక్క పరీక్షలు దగ్గరకొస్తున్నాయి. ఆ చదువు హడా విడితో ఆ విద్యార్థిని హృదయంలో అదొక్కటే నిలిచింది.

ఆ రోజు కాలేజీలో హడావిడిగా వుంది. కార్తీక కాలేజీలో కార్తీక అడుగు పెట్టగా, మాల, కుసుమ అందరు ఆమెను చుట్టుముట్టారు. కార్తీక కాలేజీ డే ప్రోగ్రాములో డ్యాన్సు చేయాలని పట్టుపట్టారు. తల్లికి యిష్టముండదని కార్తీక చెప్పినా వాళ్ళు వదలలేదు. కార్తీక యింటికి వచ్చి ఆమెను అడగడానికి మాల, కుసుమలు ఆమె వెంట యింటికి వచ్చారు.

"అంటే కాలేజీ ప్రోగ్రామ్‌లో కార్తీక డాన్సు చేయాలి అంటే" అంది కుసుమ.

చిన్నప్పుడో చేసేది. ఇప్పుడేం బాగుంటుందమ్మా! అయినా మా శ్రీకాంతుకి యిష్టముండదమ్మా" తల్లి మాటలకి కార్తీక సమాధానం ఇవ్వలేదు.

కుసుమ అందుకుని "ప్రకాం ఇప్పుడు ఇక్కడ - రుగా" అంది.

మ్ మాల మా సిన్సిపాల్‌గారు ప త్యేకంగా పిలిచి ఇప్పుడు అడిగారు అంటే కా మొత్తానికి కార్తీక చేసినట్టు డాన్స్ ఎవ్వరూ చెయ - ర. మాట అందరం చాలా సరదా పడుతున్నాం అంటీ" అంది బతిమా- ధోరణిలో.

ఆ మాటలు ఆవిడకు నచ్చాయి. వెంట "స తే అమా ఈసారికి అలా కానీయండి" అంది.

ముగ్గురూ చాలా సంతోషించారు. కాఫీలు తాగుతూ ఎన్నో విష యాలు మాట్లాడుకున్నారు. సంతోషం అటువంటిది. ఆవిడ అదగ్గా అంగీకరించింది.

"మీ అమ గారు చాలా మంచి " అన్నారు మాలా కుసుమలు. కానీ ఇద్దరి మనస్సుల్లోను ప్రకాంత్ సంగతే మెదులుతోంది. పెళ్ళి కాకుండా- ఇన్ని ఆంక్షలు పెడితే పెళ్ళి అయిన తరువాత కార్తీకను ఇబ్బంది పెడతాడని ఇద్దరి అంతరాత లు ఘోషించాయి.

ఒక వేళ ఆవిడకు ఇష్టం క అతనిమీద పెట్టిందా అ అను మానం కూడా తోపల్ల ఉంది. ఇక ఉండబట్టలేక కుసుమే ఆ సంగతి తీఅది.

"కా . పారిన్‌తో ఉన్న మీ బావ పెత్తనమేమిటే పిచ్చీ" అంతవరకు ఆ విషయం ఆలోచించని కార్తీక కాస్త తడబడింది.

కాసేపు ఆలోచించి "ఏంలేదు మా అమ గారికే ఇష్టంలేక మా బావమీద పెడుతుంది" అంది.

"నేను అలా అనుకున్నాను అంది" మాల.

"ఏదైన మీ అమ గారు ఒప్పుకున్నారు, అం చాలు." అంది కుసుమ.

తరా త వాళ్ళిద్దరూ వెళ్ళిపోయారు.

కార్తీక ఆ విషయమే ఆలోచించడం ప్రారంభించింది. ఒకటి రెండుసార్లు శ్రీకాంత్ కూడా డాన్సు ప్రోగామ్ ఇస్తానంటే వద్దన్నట్టు గుర్తు. అప్పటికి తనింకా ఇంటర్ చదువుతోంది. అదీ స్త్రీల కళాశాలలో అప్పటికి తనింకా భామాకలాపం ర్చుకుంటోంది. ప్రిన్సిపాల్‌గారు పిలిచి ప్రోగామ్ ఇమ ని అడిగారు. తాను స నంది. ఇంటికొచ్చి కొండంత సంతోషంతో తల్లితో చెప్పింది. ఆవిడ కూడా చాలా సంతో షించింది. కాని శ్రీకాంత్ వచ్చి "కాళ్ళు తులు ఎగ సుకుంటూ ఆ డాన్సులేమిటి. అలాటివాళ్ళను గురించి మగపిల్లలు చాలా అసహ ంగా కామెంట్సు పా . చేస్తూంటారు" అన్నాడు.

ఆ మాటలు విని తల్లి ఉలిక్కిపడింది. "ఈ ఒక్కసారికి చెయ్యమా . తర్వాత ఇంక చెయ్యకు" అంది. ఆ సంవత్సరమే శ్రీకాంత్ అమెరికా వెళ్ళిపోయాడు. ఫారిన్ వెళ్ళినవారు చాలా మారతారు అంటారు. బావ మారి ఉంటాడు" అని సమాధానపడింది కార్తీక.

* * *

అనుకున్న ఆరోజు రా. వచ్చింది. కార్తీక సంతోషానికి అవధు లేవు. బహుశా తాను ఇచ్చే ఆఖరి ప్రోగామ్ అదే కావచ్చు. అందు బాగా ప్రాక్టీసు చేస్తోంది. అందరికంటే బాగా చేసి అందరి మెప్పులు పొందాలని ఆమె కోరిక. ప్రోగామ్ చూడటానికి రమ ని తల్లిని బతి మాలింది. 'నేనెందుకమా ' అని తప్పించుకుందావిడ.

కార్తీక ఒక్కర్తే కాలే కి కారులో బయలు రింది. సగందారి లోకి వె ్ళటప్పటికి కారు ట్రబుల్ ఇవ్వడం మొదలుపెట్టింది. ముందుకు వెళ్ళడం కష్టమయింది. డ్రైవర్ మెకానిక్ బాగా తెలిసినవాడే. పావు గంట కారు ఆపుచేసి ఏదో తంటాలుపడ్డాడు. చివరకు మ ్ళ స్టార్టు

అయింది కాని మామూలుగా లేదు. ఏదో విధంగా కాలేజ్ వరకు వచ్చింది కారు దిగింది కార్తీక.

"అమ్మాయిగారూ! కారు మెకానిక్‌కి చూపించాలి. తిరిగి వెళ్ళడం కష్టం" అన్నాడు డ్రైవర్ నెమ్మదిగా.

"సరేలే నువ్వు కారు తీసుకెళ్ళిపో! మళ్ళీ రాకు, నేను ఎవరి కారులోనైనా వచ్చేస్తాను. అమ్మగారితో కంగారుపడవద్దని చెప్పు" అని అతన్ని పంపించేసింది. కారు తీసుకుని అతడు కదిలాడు. ఇంతలో రాజీ, కుసుమ, మాల అందరూ చుట్టుముట్టారు. "మహారాణిగారు! స్వాగతం, తమరు చాలా ఆలస్యం చేశారు. క్షమించరాని నేరం" అంది మాల.

"త్వరగా మేకప్ అవ్వాలి. మేకప్‌మాన్ అరగంట నుంచి ఎదురుచూస్తున్నాడు అంది కుసుమ.

"దేవిగారు ఆలస్యంగా రావడం గొప్పవారి లక్షణం అనుకుంటు న్నట్టున్నారు! మన ముసలి ప్రిన్సిపాల్‌గారు కుప్పిగంతు లేస్తున్నారు. తమరు ముందుగా ఆయనకు కనబడి మేకప్ రూమ్‌లో ప్రవేశం చేయండి" అంది రాజీ.

ఇంతలో కల్చరల్ సెక్రటరీ అక్కడకు వచ్చి "వచ్చావా! కార్తీకా! నా పరువు నిలబెట్టావు! ఇంకా ఆలస్యం చెయ్యకు" అంది.

"క్లాస్ మధ్యదారిలో మా కారు ట్రబుల్ ఇచ్చింది, అంతే" అంది నవ్వుతూ కార్తీక. 'నడు నడు' అంటూ అందరూ కార్తీకను లాక్కుపోయారు.

కల్చరల్ ప్రోగ్రామ్ మొదలయింది. మైక్‌లో "మన కాలేజీ నాట్యరాణి మిస్ కార్తీక భామా కలాపం" అంటూ చెప్పింది సెక్రటరీ కరతాళ ధ్వనులు ఒక్కసారి మిన్నుముట్టాయి. తెరలు తొలగించారు.

"భామనే! సత్యభామనే" అంటూ పాట ప్రారంభమయింది.

అంతకంటె మధురంగా వాయిద్యాలు మోగుతున్నాయి. అంతకటెం మధురంగా వాయిద్యాలు మోగుతున్నాయి. అందరి మనుసులు ఒక్కసారి ఏదో లోకాల్లో సంచరిస్తూ తెరకేసి చూస్తున్నాయి.

కాషాయిరంగు చెమికి పువ్వుల డ్రస్సులో సత్యభామ స్టేజీమీదికి వచ్చింది. ఒక్కసారిగా అందరి కళ్లు జిగేలుమన్నాయి. మరోసారి చప్పట్లు కొట్టారు. లయతాళబద్ధంగా ఆమె శరీర కదలిక అభినయం. హావ భావ ప్రకటన చూసి జనం ముగ్ధులవుతున్నారు. స్వభావ సిద్ధంగా అందంగా ఉన్న కార్తీక మరింత అందంగా కనబడింది.

తగిన పొడవు లావూ ఉన్న కార్తీక స్టేజిమీద ఎంతో అందంగా ఉంది. ఆమె పచ్చని ఒంటిరంగు మేకప్‌లో గులాబి రంగులో మెరిసి పోతోంది. విశాలమైన కళ్ళు అభినయానికి తగినట్టుగా భావ పకటన చేస్తూ మరింత విశాలంగా కనబడుతున్నాయి. సన్నని పొడవైన ముక్కు తెల్లరాళ్ళ నత్తుతో మరింత అందంగా కనబడుతోంది. చిన్న మూతి, పల్చని పెదాలు, సన్నని పలువరుస పాటకు అనుగుణంగా కదులుతున్నాయి. సన్నని నడుముచుట్టూ వున్న మొలనూలు చేతి కంకణాలు, ఆమె అందాన్ని రెట్టింపు చేస్తున్నాయి.

నిజంగా సత్యభామ ఇలాగే ఉండిఉండాలి అనిపిస్తోంది చూస్తున్న జనానికి ఎప్పుడు నాట్యం పూర్తి అయిందో కూడా తెలియ లేదు. కన్నుల పండుగా ఉన్న ఆకారం కదలి లోపలికి వెళ్ళిపోయే టప్పటికి బాహ్య పపంచంలోకి వచ్చారు అందరు. వెంట కరతాల ధ్వనులు చేశారు.

తర్వాత జరిగిన ప్రోగ్రామ్ ఎవరు అంతగా పట్టించుకోలేదు. అందరి మనస్సుల్లోను కార్తీక రూపమే కదలాడుతోంది.

ప్రిన్సిపాల్‌గారు మైక్ ముందుకొచ్చి కార్తీకను వచ్చి బహుమతి సుకోమని చెప్పారు. ముందుకు వచ్చి ముఖ్య అతిథిగారు నిలబడ్డారు.

ఒక్కసారి ఉలిక్కిపడింది-

అ చిలిపి నవ్వు, అ ముఖం, అ తెల్లని దస్తు అతమ చిరునవ్వు నవ్వాడు. ఏమీ తోచని కార్తీక చేతులెత్తి నమస్కరించింది.

ఉంగరం చేతికి పెట్టుకోమ ఆయన ఎంతో అభిమానంతో ఇచ్చారు" అన్నాడు ప్రిన్సిపాల్.

చెయ్యి చారవగా అందిపుచ్చుకుని ఉంగరం తొడగాలను కున్నాడు అభిరామ్. కాని ఎదురుగా ఎంతో మంది. పైగా ఆడపిల్లలు.

"అత. చేతికి పెడితే ఎంతబాగుండునో" అనుకుంటూ. వేలికి ఉంగరం పెట్టుకుని ముందుకు అడుగు సింది కార్తీక.

అభిరామ్ కిందికి వచ్చేశాడు.

జనగణమన పాడగానే జనమంతా కదిలారు.

గ్రీన్ రూములో దస్తు మార్చుకుంటున్న కార్తీకను చుట్టు ముట్టారు.

"ఎవరే హీరో" అని ఒకరు "ఏ ఉంగరం చూడనియ్యి అని ఒకరూ. అందరు తలో విధంగా అడుగుతూ మాలా, కుసుమా, రా చుట్టు ముట్టారు. అప్పటి అలస్యమయిన మేకప్ వాళ్ళు ద్రస్సు, నగలు ... ని తొందర చేశారు. ఉంగరం చూసిన ఒక్కొక్కరే తెగ వేళా కోళాలు చేస్తూ ఇళ్ళకు కదిలారు. బట్ట మార్చుకుంది. మొఖం కడు క్కుని తుడుచుకుంది. అప్పుడు కార్తీకకు కారు లేదన్న సంగతి గుర్తు కొచ్చింది.

ప్రిన్సిపాల్‌గారు, అభిరామ్‌లు రావడం చూసింది, ముఖానికి రంగు బాగా పోలేదు. అలా ఉండగా వారికి కనివడ్డానికి భయపడింది. అయినా తప్పదు. కారు సంగతి అడగాలనుకుంది.

ప్రిన్సిపాల్‌గారె ముందుగా "ఎలా వెళతావమ్మా ! కారు వచ్చిందా" అన్నారు.

"ఈరోజు రిపేరులో ఉందండి" బెదురుగా సమాధానమిచ్చింది.

"అలాగా! అయి నా కారు పంపిస్తాలే" అన్నారాయన.

"నేను దిగబెడతాలెండి" అన్నాడు అభిరామ్.

ప్రిన్సిపాల్‌గారి ఇల్లు కాలేజీ కాంపౌడులో ఉంది. ఆయన ఎక్కడకి వెళ్ళక్కరలేదు. అందు అభిరామ్ తాను దిగబెడతా నన్నాడు.

"అలా చెయమ్మ. ఇంతే మీ ఇల్లెక్కడ" అడిగారు.

"అశోకనగరండి"

"నేనూ అటే వెళ్ళాలి" అన్నాడు అభిరామ్.

"జాగ్రత్తగా వెళ్ళమ్మా! అభిరామ్ జాగ్రత్త" వెళ్ళిపోయారు ప్రిన్సిపాల్‌గారు. ప్యూస్ కార్తీక పూలదండలు, షీల్డు కారులో పెట్టి వచ్చాడు. అభిరామ్ బయటకు వచ్చి ఒక్కసారి వెనక్కి తిరిగి చూసి కారువైపు నడిచాడు.

వెనకాల రాజహంసలా నడిచి వస్తోంది కార్తీక. కారు రాక పోవడం అభిరామ్ రావడం ఇది రెండోసారి. కారు రిపేరురావడం తనకు శుభాన్ని ఇస్తోందనుకుంది. ఆ రోజు సంఘటన గుర్తుకొచ్చింది. అదే ట్లలు గుండె కొత్తగా కొట్టుకోడం ప్రారంభించింది. ఏదో చెప్పలేని బాటు, ఏదో తీయని ఆలోచనలు, వాతావరణమంతా ఏదో కొత్తగా పించింది. వీచేగాలి, కదిలే చెట్లు ఆనందాన్ని కలిగించాయి.

ఇంతలో కారు స్టార్టు చేసిన శబ్దం వస్తోంది. అడుగులో అడుగు వేస్తూ కారు వరకు వచ్చి ఆగింది.

వెనక డోరు తెరుచుకోవాలో ముందు కూర్చోవాలో తెలియక తడబడింది.

అది గమనించిన అతను సన్నగా నవ్వుకున్నాడు.

కారు దిగివచ్చి ముందు డోరు తెరచి పట్టుకున్నాడు మాటలేలేవు మౌనంగా సీట్లో కూర్చుంటూ ఒక్కసారి అతనివైపు చూసింది.

అతని చూపుల్లోని ఆయస్కాంత శక్తిని తట్టుకోలేక సిగ్గుతో మెలికలు తిరిగిపోయి చూపులు మరల్చుకుంది.

డోరు వేసి అతను డ్రైవరు సీటులోకి వచ్చి కూర్చున్నాడు. తిరిగి కారు స్టార్టు చేశాడు.

చల్లని గాలి దూసుకువస్తోంది. తెల్లవి వెన్నెల్లో నగరమంతా మరింత అందంగా కనబడుతోంది.

అతని పక్కనే కూర్చుంటే ఏదో వింత అనుభవం తెలియని అనుభూతి.

"అతను కూడా తనలాగే ఆలోచిస్తున్నాడా తనలాగే అనుభూతి పొందుతున్నాడా" అనుకున్న కార్తీక తల తిప్పి అతనివైపు చూసింది.

కార్తీకలాగే ఆలోచిస్తూ మధురలోకాల్లో విహరిస్తున్న అభిరామ్ తల తిప్పి ఆమె వైపు చూశాడు.

ఇద్దరి చూపులు ఒక్కసారి కలుసుకున్నాయి. విడివడలేనంతగా పెనవేసుకున్నాయి.

ఇద్దరూ చూస్తూ అలాగే ఉండిపోయారు. అలవాటు మూలంగా కారు నడుపుతూ ముందుగా తేరుకున్న అభిరామ్ "డాన్సు ఎన్నాళ్ళ నుంచి నేర్చుకుంటున్నారు" అని అడిగాడు.

"అయిదు సంవత్సరాలు నేర్చున్నాను. ఇప్పుడు మానేశాను."

"డాన్సు ప్రాక్టీసులో వుంటే- రాణిస్తుంది. మానెయ్యకూడదు."

"మా అమ్మగారికి పెద్ద ఇష్టంలేదు. ఈరోజు బతిమాలి చేయవలసి వచ్చింది."

ఆ మాటలు వినిపించుకోనట్టుగానే అభిరామ్ "భరతనాట్యం నేర్చుకోవాలని చాలామందికి ఉంటుంది. కొంత మందికి మాత్రమే అభినయం వంటపడుతుంది. నూటికి ఒకరికి మాత్రమే శరీర సౌందర్యం ఉంటుంది."

ఆ రెండు ఉన్న వాళ్ళు నాట్యాన్ని నేర్చుకుని వదిలెయ్యకూడదు."

అతని కళాభిమానానికి మనస్సులోనే అభినందించింది కార్తీక.

ఒక్కసారి శ్రీకాంత్ గుర్తుకొచ్చారు. అతనితో అభిరామ్‌ను పోల్చుకుంది.

మొదటిసారిగా శ్రీకాంత్ మీద ఏదో చికాకు ఏర్పడింది. అభిరామ్ మీద చెప్పలేని మోజు కలిగింది. హఠాత్తుగా ఇందాకటి సంఘటన గుర్తు కొచ్చి వేలి ఉంగరం కేసి చూసుకుంది. పొంగివచ్చిన ఆనందాన్ని దాచుకోవాలని ప్రయత్నించింది. అయినా ఆ ముఖం కాంతితో వెలిగింది.

అది అభిరామ్ కంట పడింది. ఆమె ప్రత్యేకంగా ఉంగరం చూసుకోవడం నవ్వడం గమనించాడు.

ఆ ఉంగరం ఉన్న చెయ్యిని అందుకుని ముద్దు పెట్టుకోవాలనుకున్నాడు.

కాని ఆమె ఏమనుకుంటుందోనని భయపడి ఆగిపోయాడు.

"ఏమిటి ఆలోచిస్తున్నారు" అడిగాడు.

తల తిప్పి అతని సి చూసింది. అతను గమనించే ఉంటాడు. అనుకునేటప్పటికి సిగ్గు ముంచుకొచ్చింది. లేని ధైర్యం తెచ్చుకొని,

"అబ్బే ఏంలేదు. అశోక్‌నగర్‌కి వచ్చేశాము" అంది తడబడుతూ.

"అలాగా నాకు తె దులెండి" అన్నాడు కొంటెగా.

"ఈ వీధి చివ లెండి మా యిల్లు, ఇక్కడ ఆపేయండి దిగిపోతాను" అంది కంగారుగా.

"పరవాలేదు మీ ఇంటదగ్గ ఆపుతాలెండి" కారు ముందుకు కదిలింది.

ఇంటి ముందుకు తీసుకొచ్చి ఆపాడు ముందుగా అభిరామ్ దిగి ఇటు తిరిగి వచ్చాడు.

డోరు తెరవబోయిన ఆమె చెయ్యి ఆగిపోయింది.

అతను డోరు తెరచి పట్టుకున్నాడు.

దిగుతున్న కార్తీక అతనికి తగిలేటంత దగ్గరగా నుంచున్నాడు.

అతన్ని తాకుతూ కారు దిగవలసి వచ్చింది. శరీరమంతా ఒక్కసారి పూచిన తంగేడులా పులకించింది.

ఉంగరం ఉన్న ఆమె కుడిచేతిని ఒక్కసారి అందుకున్నాడు. నోటి దగ్గరగా సుకొచ్చి చటుక్కున ముద్దు పెట్టుకుని "మ ళ కలుసుకోవాలి" అంటూ చెయ్యి వదిలేశాడు.

ఇద్దరి శరీరాల్లో ఏదో తెలియని గగుర్పాటు కలిగింది.

కార్తీక సీట్లో మరచిపోయిన పూలదండ సి మెడలో వేయబోయి చేతికందించాడు. తర్వాత షీల్డు అందించాడు.

కారు ఆగిన చప్పుడు వినబడగా- వీధి తలుపు తెరిచి బయటకు వచ్చాడు సర్వయ్య.

తలుపులు తెరచిన శబ్దానికి ఇద్దరూ దూరం జరిగారు.

"మ ళ కలుసుకుందాం" అని సమాధానంకోసం ఎదురు చూడకుండా వెళ్ళి డ్రైవింగు సీట్లో కూర్చుని కారు స్టార్టు చేశాడు. 'థాంక్స్' అనాలనుకున్న మాట పైకి రాకుండా కార్తీక ఇంటివైపు నడిచి . టు ‧సుకుని లోపలికి వెళ్ళింది,

లోపలికి అడుగు పెట్టబోయి కారు ఇంకా బయలు రలేదని వెనక్కి తిరిగి చూసింది.

ఆ చూపుల కోసమే ఎదురు చూస్తూనట్టు అతను చిరునవ్వుతో చూసాడు. ఆ చూపుల్లో కోటి సం సాలు. కారు కదిలింది. ఆ చూపుల కోసమే కారు ఆగిందని అప్పుడే తెలుసుకుంది కార్తీక.

అతని మీద చెప్పరాని అభిమానం ఏర్పడింది. అభిరామ్ ఎంత చక్కని పేరో అనుకుంటూ లోపలకు వెళ్ింది.

"ఇంకా నిద్రపోలేదా అమ్మా" అంటూ ఎదురుగా ఉన్న తల్లిని కౌగిలించుకుంది,

గబగబా బహుమానాలన్నీ చూపించింది. ఆ తల్లి సంతోషానికి హద్దులేవు.

"సర్వయ్యా చూశావా: అమ్మాయి బహుమానాలు. ఇవిగో పూల దండలు" అంటూ రెండు చూపించింది.

"అమ్మా! ఎన్ని పూలదండలు -శారో, అన్నీ నా ఫ్రెండ్స్‌కి ఇచ్చేశాను. ఈ రెండు దండలు పట్టుకొచ్చాను" అంది ఋంగమూతి పెట్టి.

అవన్నీ పట్టుకు చూసిన సర్వయ్య "ఈరోజు నీకు దిష్టి సెయ్యాలమ్మా; ఎన్ని కళ్ళు మీమీద పడ్డాయో" అన్నాడు.

"నాకు దిష్టేమిటి సర్వయ్యా" అంది నవ్వుతూ.

ఏదో జ్ఞాపకం వచ్చినవాడిలా సర్వయ్య వంటింట్లోకి వెళ్ళాడు.

"అమ్మా ! అమ్మా ! ఇదిగో ఈ ఉంగరం మా చైర్మన్‌గారి అబ్బాయి పజంటు చేశాడమ్మా " అంది ఆవిడను పట్టుకు ఊపేస్తూ.

"ఆవిడ చెయ్యిపట్టుకు చూసి" చాలా బాగుంది అంది.

ఆ మాటలకు పొంగిపోయిన కార్తీక -లి ఉంగరం ీసి తల్లి చేతిలో పెట్టింది. ఆవిడ అటు ఇటు తిప్పిచూసి "చాలా బరువుంది" 'సర్వయ్యా! ఇదిగో ఈ ఉంగరం నువ్వు చూడలేదు" అంటూ లిచింది.

పరుగెత్తుకుంటూ వచ్చి చూశాడు సర్వయ్య.

"చాలా బాగుందమ్మా: ఆ కార్లో దిగబెట్టిన బాబేనా" అన్నాడు.

కార్తీక ఇటు అటు కాకుండా తలూపింది.

'కార్లో దిగబెట్టిన బాబెవరు?''

"చైర న్ గారి అబ్బాయని చెప్పాను కదమా ! అత ! వాళ్ళ యిల్లు కూడా ఇక్క నటమా ! అందు పిన్సిపాల్ గారు వాళ్ళ కార్లో పంపించారు?"

"పోనీలేమ్మా! ఎలాగో అలాగ యిల్లు చేరుకున్నావు. మీ ప్రిన్సి పాల్ గారు ఎంతైన చాలా మంచివారు! అందుకే నిన్ను అంత జాగ్రత్తగా యింటికి పంపించే ఏర్పాట్లు చేసారు. ఈ రోజుల్లో ఎవరికి కావాలి?"

"అవునమ్మా ! మా పిన్సిపాల్ గారు చాలా మంచివారు." కార్తీక ముఖం దివిటీలా వెలిగింది.

కూతురు ముఖం చూడగానె ఆ తల్లికి పట్టలేని ఆనందం కలి గింది. భర్తలేడు. ఎప్పుడో భార్యను, పిల్లను వదలి పరలోకాలకు వెళ్ళి పోయాడు ఆ ఒక్క పిల్లను పెంచి పెద్ద చేస్తోంది. ఆ పిల్ల సంతోషం కంటె ఆ తల్లికి యింకేం కావాలి?

"ఇవ్వటికే ఆలస్యమయింది. బట్టలు మార్చుకునిరా! భోంచేద్దాం" తల్లి మాటలకు కార్తీక గదిలోకి పరుగెత్తింది.

ఆ రాత్రి కార్తీక కంటికి కునుకు పట్టలేదు. ఏవో యని తలపులు ఉక్కిరి బిక్కిరి చేసాయి. అభిరామ్ చుట్టూ తిరగసాగాయి.

* * *

కార్తీక ఇంటికి వెళ్ళి కాలింగ్ బెల్లు నొక్కారు ఇద్దరూ. కార్తీకే తలుపుతీసి "హాయ్" అంటూ ఇద్దర్ని రెండు చేతులతోను అందుకుంది.

"హాయ్" అంటూనే ముగ్గురు లోపలికి వచ్చి హాల్లో కుర్చీల్లో కూర్చున్నారు.

"ఏమ్మా ఇద్దరు రావడం మానేశారు మీ జట్టు కటీఫ్" బుంగ మూతి పెట్టింది కార్తీక.

"మా తల్లివి కదూ! మా బుజ్జివి కదూ! ఇప్పుడు మాతో సిని మాకు రావాలి" అంది ఉత్తర.

"విశేషం చెప్పదు కనుక రానంటే రాను" కార్తీక మొరాయిం చింది.

"నాకు వుద్యోగం దొరికింది కనక" స్వాతి పలికింది.

"అలాగా చెప్పారుకాదే, అమ్మా! ఇటు రావా రావా ! అంటూ అరిచింది కార్తీక.

"ఏమిటమ్మా!" అంటూ బయటకు వచ్చిన శ్యామసుందరి వీళ్ళి ముగ్గురూ కంటపడ్డారు.

ఆవిడ పలకరించేలోపలే కార్తీక "అమ్మా, అమ్మా, స్వాతికి ఉద్యోగం దొరికిందట" అంది సంతోషంగా.

"ఏమిటి ఉత్తరా! స్వాతికి చదువు మాన్పించి ఉద్యోగంలో ఎందుకు పెట్టావు?" అంది కాస్త మందలింపుగా.

"లేదు ఆంటీ, అ వద్దంటున్నా వెళ్ళి చేరింది. చదువు ముంది, ప్రైవేటుగా చదువుకుంటాను" అంది.

"-నున్నాగా ఉత్తరా! దానిచదువు సంగతి నాకు వదిలెయ్యి"

"ఇప్పటి ఎంతో ఋణపడి ఉన్నాం ఆంటీ, ఇంకా ఎందుకూ. మిమ్మల్ని బామ్మగార్ని చూసేకదా! ఇలా ధైర్యంగా బతుకుతున్నాము" అంది ఉత్తర.

ఇంతలో సర్వయ్య అందరికి కాఫీలు అందించాడు.

"ఇప్పుడే బామ గారి ఇంట్లో కా తాగాం సర్వయ్యా! మ ళ్ళ ఎందుకు?" అంది ఉత్తర.

"కాఫీ ముందమా మాట్లాడుతూంటే- అరిగిపోతుంది." అంటూనే ర్వయ్య వంటింట్లోకి వెళ్ళిపోయాడు.

"బామ గారింట్లో కాఫీ పార్టీయా" అడిగింది కార్తీక.

"అవును ఆవిడ కాఫీ ఇచ్చారు. నిన్ను •సుకుని పిక్చర్ కి వెళ్ళాలి" అంది ఉత్తర.

"ఇప్పటి టైం అయిపోయింది. రేపు వెడుదురుగాని ఈపూట భోజనం ఇక్కడే చేసి వెళ·ండి" అంది శ్యామసుందరి వి.

"రేపు నా పుట్టినరోజు ఉత్తరా! మనం ముగ్గురం సినిమాకు రేపు వెడదాం" అంది కార్తీక సంతోషంతో.

"అలా చెయ్యండి! పల్లీ మీరిక్కడే ఉండిపోవాలి" అంది శ్యామసుందరీదేవి.

"ఊ! అన ం మొట్టికాయలు కావాలా?"

"తల్లీ! మొట్టికాయలు వద్దుగాని 'ఊ' సరేనా" అంది ఉత్తర.

'ఓకే' అంటూ కుర్చీలోంచి లేచి గంతులేసింది కార్తీక."

శ్యామసుందరీదేవి లేచి వంటింటివైపు వెళ్ళింది.

కార్తీక వెళ్ళి టి.వి ఆన్ చేసింది.

స్వాతి లేచి మూలనున్న కారంబోర్డు పట్టుకొచ్చి స్టూలుమీద పెట్టింది.

ముగ్గురు టీవి చూస్తూ ఆట ప్రారంభించారు. ముగ్గురూ కూడా టి.విలో ఏం వస్తుందో చూడ్డమేలేదు. ఆటలో నిమగ్నమయ్యారు.

"భోజనానికి రండమ్మా" పిలిచాడు సర్వయ్య.

వెంటనే ఆట ఆపుచేసి భోజనాలకి బయలుదేరారు. శ్యామ సుందరీదేవి రాత్రి పుల్కాలే తింటుంది. సరదాగా ఆ పిల్లలు ముగ్గురితో పాటు కూర్చుని తానుకూడా తింది.

అప్పటికే రా త్రి తొమ్మి దయింది.

"ఇక వెడతాం ఆంటీ?" అంటూ బయలుదేరారు.

"రేపు మీ భోజనాలు కాఫీలు టిఫిన్లు ఇక్క . పైగా సినిమా కూడా ఇక్కడే అంది కార్తీక.

శ్యామసుందరీ వి కూడా మరీ మరీ చెప్పింది.

"స ఆంటీ"

వీధులో లైట్లు వెలుగుతున్నా ఎందుకో చీకటిగా వున్నట్లు అనిపించింది వాళ్ళకు.

"అక్కా మనింటిముందు ఎవరో నుంచున్నట్టున్నారే" అంది స్వాతి.

"ఎవరూ లేరు ఏదో నీడ" అంటూనే దీర్ఘంగా చూసింది, ఏదో ఆకారం కనబడింది. ఎందుకో కాస్త భయం వేసింది అందరి తలుపులు వేసి వున్నాయి. గట్టిగా అరిస్తే ఎవరో ఒకరు వస్తారన్న ధీమాతో ఇద్దరు ఇంటికి దగ్గరగా వచ్చారు. ఆ ఆకారం మెల్లిగా వచ్చి పక్కకు ఎక్కడికో తప్పుకుంది. "ఎవరైనా దొంగలేమో" అంది ఉత్తర.

"దొంగలైతే భయమా" అంది స్వాతి.

ఇంటి తలుపు తాళం సి లోపలికి వెళ్ళారు. వెంటనే లోపల గడియ పెట్టుకున్నారు.

కాపురముంటున్న దంపతులు బొంబాయి వెళ్ళారు. తండి పోయిన ఆ యింట్లో వంటరిగా ఉండాలంటే ఎందుకో కాస్త భయమేసింది. అంతలో ఎవరో మెట్లు ఎక్కివస్తున్న చప్పుడైంది.

ఇద్దరూ కిటికీ వారగా నుంచున్నారు ఎవరో చూడాలని.

కిటి లోంచి స్పష్టంగా ఇద్దరూ చూశారు. ఒకరు ఉత్తర భర్త. మరొకరు రౌ లా వున్నాడు ఆకారం.

ఇద్దరు వచ్చి గబగబా తలుపుకొట్టారు. భయంతో వాళ్ళు తలుపు తియ్యలేదు.

"తలుపులు స్తారా లేదా" అరిచాడు ఉత్తర భర్త.

అయినా లోపలనుంచి సమాధానం లేదు.

"తలుపులు తియ్యకపో కిటి లు వంచి లోపలకు వస్తాం" ి త్త కంఠం అంది.

ఆ అరుపులకి, తలుపులు బాదుతున్న శబ్దానికి రోడ్డుమీద జనం పోగయ్యారు.

జనాన్ని చూడగా, ఎక్కడలేని ధైర్యం వచ్చింది అక్కాచెల్లెళ్ళకు,

కిటి లోంచి చూస్తూ ఉత్తర "చూశారాండి వీళ్ళు మమ ల్ని ఎలా బాధిస్తున్నారో, చంపేస్తామంటున్నారు. మీరే కాపాడాలండోయ్" అంటూ అరిచింది.

"మిమ్మల్ని చంపేదెవరమ్మా మేమీ వీధిలో ఉండగా" అంటూ యువకులంతా ముందుకువచ్చారు.

తోక ముడిచి పారిపోవాలనుకుంటున్న ఉత్తర భర్తను ఆ రౌ ని పట్టుకొని లకు ఒరిగేవరకు చావకొట్టారు. ఉత్తర స్వాతి తలుపులు •సుకువచ్చారు.

ఉత్తరకు నోటమాట రాలేదు. "చంపకండి! మ ్ ఖూనీ కేసు వస్తుంది. వదిలెయ్యండి." స్వాతి మాటలకు

"అదీ నిజమే" అన్నాడు ఎవరో"

"పొండిరా! పొండి ఈ ఛాయలకి రాకండి ఈసారి చంపి నాదొడ్డిలోనే పాతేస్తా మరి సు రాకుండా" అన్నాడు ఒక యువకుడు

ఇద్దరి బట్టలు చిరిగిపోయాయి. వళ్ళంతా రక్తపు మడుగు అయింది నడవలేక నడుచుకుంటూ ఇద్దరూ ఇంటి దారి పట్టారు.

"ఒ యే భార్య చేత డబ్బులిప్పిస్తానని తన్నులు తినిపించావ్? నా వళ్ళు స్వాధీనం కానీ నీ పని చెబుతా" అంటూ వెళ్ళిపోయాడు ఆ వచ్చిన రౌ

మెళకువ వచ్చిన బామ్మ గారు పరుగెత్తుకుంటూ వచ్చింది. గందరగోళం? ఏమిటో తెలియక సర్వయ్య పరుగెత్తుకొచ్చాడు.

"ఇంక లోపలికి వెళ్ళి తలుపులు వేసుకోండమ్మా? ఏదైనా భయమనిపిస్తే గట్టిగా యండి. పరుగెత్తుకుంటు వస్తాం" అంటూ అందరూ అక్కడ నుంచి కదిలారు.

"బామ్మగార్ని చూసి ఉత్తర వెక్కి వెక్కి ఏడ్చింది సర్వయ్యను పిలిచి వివరంగా అన్నీ చెప్పి శ్యామసుందరీ విని కంగారు పడొద్దని కబురు చేసింది.

"బామ్మ గారూ! ఈ పూట మీరు మా యింట్లో పడుకోండి" అడిగింది స్వాతి.

"సరే అలాగే పడుకుంటా ఉత్తరా! నువ్వు అన్నింటికీ అంత భయపడకూడదమ్మా! కాస్త ధైర్యంగా వుండాలి! చూశావా పిలవకుండా ఎంతమంది పరుగెత్తుకుంటు వచ్చారో? అంది ఓదార్పుగా.

"అక్కా! నాకొక ఆలోచన వచ్చింది! బామ్మ గారూ! మీరు కూడ వినండి. రేపటినుంచి నేను కరాటే నేర్చుకోడానికి వెడతాను. ఉదయం అయిదు గంటలు మొదలు ఎనిమిదంటి వరకూ తెలుగారుట! గ్రౌండుకు వెళ్ళివస్తాను. ఇంటికి వచ్చి స్కూలు వెళ్ళవచ్చు" అంది స్వాతి.

ఉత్తర ఆలోచిస్తూ అలాగే వుండిపోయింది.

బామ్మ గారు "స్వాతీ? నువ్వు చాలా మంచిపని చేస్తున్నావు. ఇంటికి దొంగలు ఎవరైనా వస్తే చితక తన్నవచ్చు" అంది.

"మంచి మాట చెప్పారు బామ్మ గారూ" అంది ఉత్తర.

"థాంక్యూ! అక్కా! థాంక్యూ!" అంది స్వాతి.

మరునాటినుండి కరాటే క్లాసులకు వెళ్ళడానికి నిర్ణయించుకొంది స్వాతి. ఇందాకా వచ్చిన ఆరో లాంటి వాళ్ళని తన్నాలని స్వాతి కోరిక. ఎవరిని కొట్టి గొడవలు తెచ్చుకుంటుందోనని ఉత్తర భయం.

అందు "జాగత్త సుమా స్వా అనవసరంగా రౌల జోలికి వెళ్ళకు. నిదానంగా మసులుకునే మాటుంటేనే ర్చుకో అంది.

"నీకన్నీ భయా అక్కా! చూసుకో నేనెలా ఉంటానో" అంది స్వాతి.

"అన్నీ నేర్చుకుంటుంది ఉత్తరా నువ్వేమీ భయపడకు" ధైర్యం చెప్పింది బామ్మగారు,

ముగ్గురు తలుపులు మరోసారి చూసుకున్ని పడుకున్నారు.

*　　　*　　　*

కారు స్టార్టు చేసిన అభిరామ్ మనస్సు కార్తీకను వెంట తీసుకుని మరీ పోతోంది. అలవాటుగా కారు వెడుతోంది కానీ అతనికి పరిసరాలే తెలియటం లేదు.

ఆమె పక్కన కూర్చుని కారు డ్రైవ్ చేస్తుంటే ఏదో ఇంతకు ముందు తెలియని కొత్త ఆనందం అతని మనస్సులో లియాడింది.

ఇంటికి వెళ్ళగా అభిరాం మంచం మీద పడుకున్నాడు.

కళ్ళు చూస్తున్నా మూసుకున్నా ఎదురుగా తన ప్రియబాంధవి నాట్యం చేస్తూ ఉంది.

ఒక్కసారి తాను ఉంగరం బహూకరిస్తుంటే ఆమె విచితంగా తన కేసి చూసిన దృశ్యం.

మరోసారి తనను తాకుతూ దిగి నిలబడిన దృశ్యం. చివరకు ఆమె మెట్లు ఎక్కి వెనక్కి తిరిగి చూసిన దృశ్యం. అక్కడ ఆగి పోయింది. అతని మనస్సు.

ఆ వ్యక్తి తన సొంతం కావాలి. ఎప్పటికి తన పక్కన కారులో ఉండాలి.

తన ఎదురుగా నాట్య సుందరిగా ప్రత్యక్షమవ్వాలి!

"ఏమి అందమది! అప్సరసలకు దొరకని అందం, ఏమి నాట్యమది? రంభా ఊర్వశులు చెయ్యలేని నాట్యమది.

ఆమె వినయం, ఈ తీయని పలుకు, ఆ హంస నడకా ఎప్పటికి తనవి కావాలి.

ఆ వీధిని, ఆ యింటి పరిసరాలు గుర్తుకొచ్చేటప్పటికి అతనకి ఎందుకో ఒక్క విషయం తలగా గుర్తుకొచ్చింది.

"తనతో చదువుకున్న శ్రీకాంత్ ఆ యింట్లో వున్నట్టు గుర్తు. అతనికి తల్లితండ్రులు లేరు. మేనత్తగారింట్లో చదువుకు వాడు. ఈసారి కార్తీకను అతని విషయం అడగాలి అనుకున్నాడు.

ఇంతలో తల్లి "అభిరామ్ అన్నానికిరా" అంటూ పిలిచింది. లేచి అన్నానికి బయలు · రాడు.

అభిరామ్ తండ్రి జనార్ధన్‌గారు గవర్నమెంటు ఆఫీసుతో చీఫ్ ఇంజనీరుగా చేసి రిటైరు అయ్యారు. అన్నపూర్ణ ఉమెన్స్ కాలేజీ ఫౌండరు చైర్మన్ కూడా ఆయనే. ఆయన భార్య అన్నపూర్ణదేవి గారు భర్తకు అనుకూలంగా నడుచుకునే మనిషి

ఆ దంపతులకు ముగ్గురు సంతానం పెద్ద కొడుకు అభిరామ్. మెడిసిన్ పాసై నాలుగు సంవత్సరాలయింది ప్రస్తుతః ఎమ్.డి. చేస్తున్నాడు.

అది పూర్తయి తప్ప పెళ్ళి చేసుకోనని కూర్చున్నాడు. అసలు మేనరికం పిల్ల చదువటం లేదు. ఎంత సేపు ముస్తాబు చేసుకోవడం సినిమాలు చూడ్డం తోటే సరిపోతుంది.

ఆ పిల్లను పెళ్ళి చేసుకోనని స్పష్టంగా చెప్పేశాడు. తల్లి కూడా కొడుకు అభిప్రాయం గ్రహించి మరి బలవంతం చెయ్యలేదు.

ఆ పిల్లకు మరో సంబంధం చూసుకుని పెళ్ళి చేసేశారు.

అభిరామ్ తరవాత రోహిణి బి. ఎస్. సి. ఫైనలు చదువుతోంది· తర్వాత మగ పిల్లాడు ఇంటర్ చదువుకుతున్నాడు.

ఆదాయానికి తగిన ఆడంబరాలు ఆ ఇంట్లో లేవు. పిల్లలకి నిరాడంబరంగా ఉండటం అలవాటు చేశారు ఆ దంపతులు. కాని ·నికి వ్యతిరేకంగా పెరుగుతోంది కూతురు రోహిణి, ఆమెకు మన ·ం పదాయాలు ఆచారాలు కంటె వి··శ పద్ధతులంటే చాలా ఇష్టం. ఆమెను చూసిన వాళ్ళు ఎవరైనా ఆ విషయం తెలుసుకుంటారు.

అన్నం తింటున్న కొడుకు పరధ్యాన్నంగా ఉన్నాడని ఆ తల్లి ఇట్టే గ్రహించింది.

"అదేమిట్రా అన్నం తింటూ కూడా ఆలోచిస్తున్నావ్" అడగనే అడిగింది తల్లి.

అసలు సంగతి చెప్పాలో అక్కర లేదో అతనికి తె లేదు. కొంత చెప్పకుండా ఉండలేకపోయాడు.

"కాలేజీ ప్రోగ్రామ్‌కి వెళ్ళివచ్చాను" అన్నాడు.

"అలాగా! నాన్నగారి సంగతి అడగలేదా వాళ్ళు" అంది తల్లి.

"అడిగారు! మద్రాసు వెళ్ళారని చెప్పాను."

"ప్రోగ్రామ్ బాగా జరిగింది అన్నింటికంటే ముఖ్యంగా కార్తీక బి.ఏ. అమ్మాయి భామా కలాపం చాలా బాగా చేసింది. మనిషి కూడా చాలా బాగుంది"

అలా చెబుతున్నప్పుడు కొడుకు కళ్ళల్లో, ముఖంలో కొట్టవచ్చినట్టు కనబడిన ఆ కొత్త కాంతిని ఆ తల్లి ఇట్టె గ్రహించి నవ్వుకుంది.

"అలాగా! అంత బాగుందా" కొడుకు మనస్సు తెలుసుకుందామని అడిగింది.

"అవును నువ్వు కూడా చూసి రావాలి. మేకప్ కపోయినా ఆ అమ్మాయి చాలా అందంగా ఉంది"

"ఎవరి అమ్మాయో తెలుసునా"

"తె దు" చటుక్కున ఆగిపోయాడు.

చేతి ఉంగరం సి ప్రెజంటు చేశానని కాని, ఇంటి వరకు దిగబెట్టి వచ్చానని కాని తల్లితో చెప్పలేక ఊరుకున్నాడు.

ఒక్కసారి చెప్పడం ఆపిన కొడుకును తల్లి ఆశ్చర్యంగా చూసింది.

"ఏదో చెప్పకుండా దాస్తున్నాడని ఇట్టే గహించింది.

కొడు ఎప్పుడో చెబుతాడని వూరుకుంది.

కొడుకు ఆమెను పెళ్ళి చేసుకుంటానంటే తనకు అంతకంటే కావలసింది ఏదీ లేదు. ఆ మాట కోసమే ఎదురుచూస్తోంది.

తన కొడుకు నిధానస్తుడని, తెలివైన వాడని ఆ తల్లికి నమ్మకముంది.

అతను తెలివి తక్కువ పనులు చెయ్యడు. అతని భవిష్యత్తు అతను నిర్ణయించుకో గలడు అతని జీవితాన్ని అతను రిదిద్దుకో గలడు. ఆధైర్యంతో అతని వివాహాన్ని అతని నిర్ణయాని వదిలేసారు.

కాలం మారిందని మునుపటి పిల్లలు కారని ఆ తల్లిదండులకు తెలుసు. కాలంతోపాటు పెద్దవాళ్ళు కూడా మారాలని వాళ్ళకి తెలుసు. అందు కొన్ని విషయాలతో పిల్లలకు స్వంత విషయాలను ఆలోచించు కొనే శక్తి కలిగించాలని వాళ్ళ ఉద్దేశం.

అభిరామ్ ఆ సంభాషణ అంతటితో ఆపేశాడు. ఆవిడా ఆ పసక్తి మానేసింది. అతను భోజనం అయిందనిపించి గదిలోకి వెళ్ళి పడుకున్నాడు. అతని ఆలోచనంతా "కార్తీకను ఎలా కలుసుకోవాలి" అన్న . కాలేజీకి వెడి అందరికి తెలిసిపోతుంది. దానివల్ల కార్తీకకు చెడ్డపేరు వస్తుంది: అలా ఆలోచిస్తూ అలసటగా నిదలోకి జారు కున్నాడు.

* * *

ఆరోజు కార్తీక పుట్టినరోజు, పొద్దుటనుంచి ఒకటే హడావిడి పడుతున్నారు తల్లి, సర్వయ్య.

ఎంతో ఖరీదైన చీర, కొకెట్టు కొంది. మాచింగ్ అని పగడాల సెట్టు సి ఇచ్చింది పెట్టుకోమని.

సర్వయ్య రకరకాల పిండివంటలు సి టేబులు నిండా సర్ది పెట్టాడు.

కార్తీకకు మాటిమాటికి అభిరామే గుర్తుకొస్తున్నాడు, అతన్ని పార్టీకి పిలిచి వుండవలసిందనుకుంది.

కాని అతను కాజీ చైరన్‌గారి అబ్బాయి అనగా ఎందుకో

మనస్సులో చెప్పలేని భయం అనిపించింది. అంతలోనే అతని రూపం కళ్ళముందు కదలగా, సర్వాన్ని మరచిపోయింది.

అతను ఎక్కడైనా కనబడతాడనే ఆశమాత్రం వదల్లేదు. సాయంకాలం అవ- అయింది.

ఉత్తర స్వాతి స్కూలునుంచి రాగా ముస్తాబై కార్తీక ఇంటికి బయలుదేరారు.

ఇద్దర్నీ చూడగా, కార్తీకకు చెప్పలేని సంతోషం కలిగింది.

తినలేమన్నా వదలకుండా ఇద్దరిచేత టిఫినులన్నీ తినిపించింది.

ఎక్కడ సినిమా మొదలుపెడతారోనని భయపడి ముగ్గురు కారులో బయలు- రారు.

శ్యామసుందరీ వి "జాగ్రత్తమ్మా" అంటూ ఎన్నోసార్లు అంది.

'మేఘమాల' సినిమా హాలు రాగా డ్రైవరు కారు అపు శాడు. అతనే టిక్కెట్లు తెచ్చి ఇచ్చాడు.

ముగ్గురు కారుదిగి హాల్లోకి వెళ్ళారు. అప్పు సినిమా ప్రారంభ మవుతోంది.

సీట్లు వెతుక్కుంటూపోయి కూర్చున్నారు.

కొత్తగా వచ్చింది సినిమా. బాగా రష్‌గా ఉంది. కథలో -న మయా రు ముగ్గురు.

అటు ఇటు ఎవరున్నదీ కూడా వాళ్ళు చూసుకో దు.

కార్తీక ప్రక్కనున్న వ్యక్తి ఆమెను ఇట్టే పోల్చుకున్నాడు.

"తన అదృష్టం తన ఆరాధ్యదేవత తిరిగి తనప్రక్కకి వచ్చింది" ఇది చాలా విచి తం అనుకున్నాడు.

ఇద్దరిమధ్య అంగుళం కూడా దూరంలేదు. తన భుజానికి ఆమె భుజం తగులుతోంది.

తన కాలుకు అమె కాలు తగులుతోంది. తను కావాల- తియ్య లేదు. ఆమె జరుపుకోడానికి చోటులేక జరుపుకోలేదు.

తెరమీద సన్నివేశాన్ని బట్టి ముగ్గురు నవ్వుకుంటున్నారు, ఏదో మాట్లాడుకుంటున్నారు. ఎంతో సరదాగా చూస్తున్నారు.

సినిమా చూడ్డమేమానేసి కార్తీకవైపే చూస్తున్నాడు అభిరామ్. కుర్చీ హేండిలుమీద ఉన్న ఆమె చేతిమీద తన చెయ్యి వెయ్యాలనుకున్నాడు. కాని ఆమె భయపడి కెవ్వుమంటే హాలులో జనమంతా తనకేసే చూస్తారని భయపడి బలవంతంగా ఆ చెయ్యిని ఆపుకుంటున్నాడు.

ఆమె రాసుకున్న ఫారిన్ పెర్ఫ్యూమ్ వాసన మత్తును కలిగించి మనస్సును గిలిగింతలు పెడుతోంది. తల్లోని సన్నజాజుల మాల గుప్పుమంటుంటె అందుకుని వాసన చూడాలనుకున్న ప్రయత్నం బలవంతంగా ఆపుకున్నాడు.

మాటిమాటికి జారుతున్న పమిటను సర్దుకుంటున్న ఆ చెయ్యి తనదే అయి ఎంత బాగుండును అనుకున్నాడు. ఆ చేతి వేలికి మిల మిల మెరుస్తున్న ఉంగరం అంత చీకట్లో అతని కంటపడింది. ఇంక ఉండబట్టలేని అతను ఆమెకు వినబడాలని గొంతుక సవరించాడు.

ఒక్కసారి తలతిప్పి చూసిన కార్తీక చూపులు అలా ఉండి పోయాయి. అనుమానంతో కళ్ళు చిట్లించి దీర్ఘంగా చూసింది.

ఇద్దరి అనుకోని కలయికకు ఆనందం పొంగి వచ్చి ఉక్కిరి బిక్కిరి అయింది.

చూపులు మరల్చుకోడం మర్చిపోయారు.

అది గమనించిన ఉత్తర ఆమె భుజంపట్టి కుదుపుతూ "ఎవరే" అని అడిగింది.

ఈసారి కార్తీక చూపులు మరల్చుకోక తప్పదు.

చేతి ఉంగరం చూపించి ఆమె చెవిలో ఏదో చెప్పింది.

ఆమె స్వాతి చెవిలో చెప్పింది. సినిమా చూడ్డం మానేసి వాళ్ళిద్దరు వంగి వంగి అతన్ని చూడ్డం ప్రారంభించారు.

అంతలో ఇంటర్వెల్. లైట్లు వెలిగాయి.

అభిరామ్ ముగ్గుర్నీ లేచిరమ్మని బలవంతం చేశాడు.

అతని వెనకే నడిచి టీస్టాలు దగ్గర ఆగారు.

ముగ్గురికి కూల్ డ్రింక్స్ ఇప్పించి అతను కూడా ఒకటి తీసుకున్నాడు.

ఈసారి స్వాతి అతన్ని పలకరించింది. రెండు నిమిషాలలో నలుగురు కలివిడిగా మాట్లాడుకోవడం ప్రారంభించారు. తాగడం పూర్తి చేసిన కూల్ డ్రింక్ సీసాలు అక్కడ పెట్టి నలుగురు సీట్లలోకి వచ్చి కూర్చున్నారు. ఈసారి అభిరామ్ కావాలనే ఆమెకు దగ్గరగా జరిగి కూర్చున్నాడు.

కార్తీక కూడా కాస్త చనువుగా వుంది. ఇద్దరి దృష్టి సినిమా మీద లేదు.

అతను ఏదో ఒకటి అడుగుతూనే ఉన్నాడు ఆమెకి చేతి దగ్గరగా తలపెట్టి. అలా పెట్టినప్పుడు అతని చెక్కిలి ఆమె చెక్కిలికి రాసుకుంటోంది.

ఆమె నవ్వుతూ సమాధానాలు ఇస్తోంది. వాళ్ళ కబుర్లతో-సినిమాటైం పూర్తి అయింది.

నలుగురు నడిచి బయటకు వచ్చారు. టీస్టాలు దగ్గర మళ్ళీ టీలు ఇప్పించాడు అభిరామ్. కార్తీక వేషంచూడగానే అతనికి ఎందుకో అనుమానం వచ్చింది. ఉండబట్టలేక "ఈరోజు ఏదైనా స్పెషలా సినిమాకు వచ్చారు!" అని అడిగాడు.

"మా కార్తీక పుట్టినరోజండీ." స్వాతి అంది తడుముకోకుండా. తలదించుకుంది కార్తీక.

"చెప్పారు కాదేం? నన్నుకూడా పార్టీకి పిలిస్తే వచ్చేస్తానని భయపడ్డారా?" నిష్ఠూరంగా అడిగాడు.

"అదేం లేదు! అనుకోకుండా వచ్చాం!" అంది కార్తీక చిరునవ్వుతో.

"ఏదైనా ప్రెజెంటేషన్ ఇద్దామంటే షాపులన్నీ మూసేశారు. తొమ్మిది అయిపోయింది." అన్నాడు కాస్త దిగులుగా.

"మొన్న ఇచ్చారుగా!" అని నాలుక కరుచుకుంది.

సిగ్గుతో ఆమె బుగ్గలు కెంపులయ్యాయి. నలుగురు కారు వరకూ వచ్చారు. ఇద్దర్నిగమనిస్తూనే ఉంది ఉత్తర. కార్తీక మనస్సులో ఏముందో ఇట్టే గ్రహించింది.

ఒక్కపక్క శ్రీకాంత్ ఫారిన్‌నుంచి రాబోతున్నాడు. ఈమె మనస్సు ఇతనివైపు మళ్ళుతోంది. ఇది ఎలా మారుతుంతో ఏ చిక్కులు తెచ్చి పెడుతుందో అనుకుంది ఆరిందాలా ఉత్తర. ఆమె అనుభవమే అమె ఆలోచనల్ని పెంచి పెద్దచేసింది. ముగ్గురు బయలుదేరి ఇంటికి వచ్చారు.

అభిరామ్ స్కూటర్ మీద బయలుదేరి వెళ్ళిపోయాడు.

ఎంతో సంతోషంగా ముగ్గురు ఇంట్లో అడుగుపెట్టారు. సినిమా కబుర్లు చెప్పుకుంటూ భోజనాలదగ్గర కూర్చున్నారు! ఇంతలో శ్యామసుందరి వి "కార్తీ! బావ దగ్గరనుంచి ఉత్తరం వచ్చిందమ్మా!" అంది.

"అదేమిటి? మేము వెళ్ళేటప్పటికే అయిదు అయింది. పోస్టు తర్వాత ఎలా వచ్చింది?" ఆశ్చర్యంగా అడిగింది.

"పోస్టుబాక్సులో ప సిపోయినట్టున్నాడు. సువ్వెళ్ళాక సర్వయ్య బాక్సుతెరిచి పట్టుకొచ్చాడు." జరిగిన సంగతి చెప్పింది.

"అలాగా? ఏమని రాశాడు" అడగడం తప్పదని అడిగింది

"రేపు నాలుగో తేని ఇక్కడకు వస్తాడుట".

"ఈరోజు ఒకటవ దీ! అంటే ఇంక మూడురోజులున్నదన్న మాట! బావ వచ్చేస్తే ముందు నీకు దిగులుపోయి ఆరోగ్యం తిన్నపడుతుంది. నాకు బలం పెరుగుతుంది." తల్లిని నవ్వించాలని అంది.

"అవునమ్మా! అతను వచ్చేస్తే నా బరువు బాధ్యతలు అన్నీ తీరిపోతాయి. మీ ఇద్దరికి పెళ్ళిచేసి హాయిగా రామా, కృష్ణా అంటూ కూర్చుంటాను."

తలతిప్పి ఉత్తరకేసి చూసిన కార్తీక ఆ చూపులు తట్టుకోలేక పోయింది.

వెంటనే చూపులు మార్చుకుంది.

అక్కచెల్లెళ్ళిద్దరు ఒకరికేసి ఒకరు చూసుకున్నారు. కార్తీకను ఎలా అర్థం చేసుకోవాలో వాళ్ళిద్దరికి తె లేదు.

"అమా! ఆమా! సినిమా ఎంత బాగుందో నువ్వుకూడా రావలసింది!" మాట మార్చింది కార్తీక.

"ఆలాగా! అయినా మీలాటి చిన్నపిల్లలకి కాని నాలాటివాళ్ళకు ఇంకా సినిమా లేమిటమ్మా!"

"అంత ముసలిదానివేమిటమ్మా! నీకంటె పెద్దవాళ్ళెందరో హాల్లో కనబడ్డారు."

"ఎవరి ఇష్టం వాళ్ళది, ఏమంటావు ఉత్తరా?"

"అలా అనకండి ఆంటీ! ఈసారి మీరు రాకుండా మేమసలు సినిమా వెళ్ళం. తెలిసిందా!" అంది.

"పోనీలే అమ్మా! ఈసారి అందరం కలిసే వెడదాం!" కార్తీక అంది.

"అవునండి. మీరు తప్పకుండా రావాలి" అంది స్వాతి.

"దానికేం తప్పకుండా వెడదాం!"

ఇంతలో అందరు భోజనాలు పూర్తిచేసి లేచారు.

తర్వాత ఉత్తర స్వాతి శ్యామసుందరీదేవికి, కార్తీకకు చెప్పి ఇంటికి బయలుదేరారు.

"జాగ్రత్త అమా! ఏదైనా అవసరమైతే బామ్మ గారిని పిలవండి!

పడుపడకండి." అంటూ ఎన్నోసార్లు చెప్పింది.

ఆవిడ అభిమానానికి ఇద్దరి కళ్ళల్లో నీళ్ళు నిలచాయి.

కళ్ళు తుడుచుకుంటూ ఇంటి వైపు నడిచారు.

ఆ రాత్రి కార్తీకకు కళ్ళు మూతలు పడలేదు. ఎంతో ఉత్సాహంగా ఇంటికి రాగానే నీళ్ళు జల్లినట్టుగా శ్రీకాంత్ దగ్గర నుండి ఉత్తరం వచ్చింది. అభిరామ్‌తో ఉన్నంతసేపూ మనస్సు ఆనంద లోకాల్లో తేలి ఆడింది.

బావ పక్కన ఎన్నోసార్లు నడిచింది. బావ తన ఒంటిమీద ఎన్నో సార్లు చేతులేశాడు, తనుకూడా బావచెవులు పిండేది. నడుము వంచిగుద్దేది, చేతులు గిల్లేది. కాని తనకెప్పుడూ ఏమీ అనిపించలేదు.

అది నాలుగేళ్ళనాటి సంగతి.

ఈనాడు అభిరామ్ రూపమే తన ఆనందానికి కారణం. అతని సాంగత్యమే తనలో కొత్త ఉత్సాహాన్ని కలిగిస్తోంది. చిన్నతనంనుంచి శ్రీకాంత్ భార్య అని పిలిచినా చెప్పినా తనకేమీ అనిపించ లేదు. కాని ఈనాడు ఆలా ఎవరైనా అంటే తను భరించలేదు. బావపై తన కటువంటి అభిప్రాయం లేదని మొదటిసారి అనుకుంది.

"అమ్మకు కోపం వచ్చినా సరే బావను పెళ్ళి చేసుకోకూడదు. ఆ విషయం అప్పుడే బయట పడకూడదు. అమ్మకు క్రమంగా నచ్చ చెప్పాలి. ఒక్కసారి చెబితే అమ్మ బాధపడుతుంది!" అనుకుంది.

ఆ ఆలోచనలతో అలసి అలసి కళ్ళుమూసుకుంది. చిరునవ్వుతో అభిరామ్ ఎదురుగా నిలిచాడు. హాయిగా నిద్రపోయింది.

* * *

ఆ రోజు శ్రీకాంత్ ఫారిన్ నుంచి తిరిగి వస్తున్నాడు! రోజాలాగే

కార్తీక కాలేజీకి వెళ్ళటానికి తయారవడం ప్రారంభించింది. అది చూసిన తల్లి కార్తీక శ్రీకాంత్ సంగతి మర్చి పోయిందేమో అనుకుంది.

'కార్తీ! ఈ రోజు బావ వస్తున్నాడు కదమ్మా! మనం ఎయిర్ పోర్టుకి వెళ్ళాలి"

"నాకీ రోజు ఇంపార్టెంటు క్లాసు లున్నాయమ్మా! నువ్వెళ్ళి రాకూడదూ!"

"అదేమిటమ్మా! బావకంటే నీకు క్లాసులు ఎక్కువయ్యాయా! ఎవరేనా వింటే నవ్విపోతారు!" అంది పైకి. కాని ఈ మధ్య కూతురిలో ఏదో మార్పు రావడం ఆవిడ గ్రహించింది. మాట్లాడితే అభిరామ్ సంగతి పది సార్లు చెబుతోంది. అతనిని గురించి చెప్పేటప్పుడు ఆమె ముఖంలో కొత్తకాంతి తను చూసింది. బావ దగ్గర నుంచి ఉత్తరం వచ్చిందంటే ఎగిరి గంతెయ్యడానికి బదులు ముడుచుకుంది. ఈ రోజు తప్పించుకో డానికి ప్రయత్నిస్తోంది. నాలుగేళ్ళ తర్వాత బావను చూడడానికి ఆ కన్య మనసు ఎంత తహతహ లాడాలి? ఆమె మనస్సు ఎందుకో శంకించింది.

కూతుర్ని ఏమీ అనలేక ఆలోచిస్తూ అలాగే కూర్చుండిపోయింది శ్యామసుందరీదేవి!

చిన్నతనం నుండి శ్రీకాంత్‌ను అల్లుడిగా ఊహించుకుంది. భర్త పోయినప్పటి నుంచి అతనే పెద్దవాడై అన్ని విషయాలు చూస్తాడని నమ్ముకుంది. కాని అది సవ్యంగా జరుగుతుందా లేదా అనే అనుమానం కలిగిందీనాడు. మనస్సంతా తుఫాను నాటి సముద్రంలా అల్లకల్లోలమై పోయింది.

తల్లి మనస్సును ఇట్టే గ్రహించింది కార్తీక. తల్లిని ఆ స్థితిలో చూసేటప్పటికి కార్తీక విలవిల్లాడిపోయింది.

'అమ్మా! అమ్మా! టైమవుతోంది! మనం బయలు దాలి!" అంది.

ఏమీ జరగనట్టు.

తల్లి తలెత్తి కూతురు కేసి చూసింది. ఎదురుగా చిరునవ్వుతో కూతుర్ని చూసింది!

కూతురు మామూలుగానే ఉంది, త. అనవసరంగా అనుమానపడి ఇంత దూరం ఆలోచిండుకున్నాననుకుంది.

"పదమా ! వెడదాం" అంటూ లేచింది.

సర్వయ్యను మరోసారి పిలిచింది.

కారు గుమ్మం దగ్గర సిద్ధంగా ఉంది. పని మనిషిని గుమ ంలో కూర్చోమని చెప్పి ముగ్గురు కారెక్కారు.

దార్లో ఒక పూలకొట్టు దగ్గర కారాపించి దిగింది కార్తీక. ఎర్రని గులా పూలు చెమ్కీతో కట్టిన దండ సుకుని తిరిగి కారెక్కింది.

"అమ్మా! బావగారికి కానుక చూశావా" అంది, ఆ మాటకు తల్లి మనస్సు ఉప్పొంగిపోయింది, కూతురు ఏమీ మారలేదనుకుంది. మనస్సు మబ్బులేని ఆకాశంలా ప్రశాంతంగా మారిపోయింది.

ఇంతలో ఎయిర్‌పోర్టు రా- వచ్చింది! కారు దిగి ముగ్గురు లోపలకు నడిచారు. అక్కడంతా ఎంతో సంరడిగా ఉంది. అప్పటి . రా. వచ్చింది విమానం. ఆకాశం నుండి దిగివస్తున్న వతా వాహనంలా భూమి మీద వాలింది. విమానం దిగివస్తున్న జనాన్ని చూస్తున్నరు, అందులో వాళ్ళకి ్రకాంత్ కనపడలేదు. ఆవిడకు ఆరాటం ారంభమైంది.

బావ తప్పకుండా దిగే ఉంటాడమ్మా, మనమే పోల్చుకోలేక పోయి ఉంటాము."అంది కార్తీక తల్లికి ఓదార్పుగా!

"నిజమేనమ్మా!" అన్నాడు సర్వయ్య.

"అయి ఉండవచ్చునమా " అంది శ్యామసుందరీ వి.

అందరు దిగి సామానులు తెచ్చుకుని బయటకు వెళ్ళిపోతున్నారు.

అప్పటికే ఒక గంట అయిపోయింది.

ఇంక తిరిగి వెళ్ళిపోదామనుకున్నారు.

అంతలో నల్లటి సూటులో పచ్చటి మనిషి కూలింగ్ గ్లాసెస్‌తో చేతిలో బ్రీఫ్ సుతో ఆ ముగ్గురూ ఉన్న చోటుకి రావడం ముగ్గురు ఒ సారి చూశారు.

"బావేనమ్మా!" అరిచింది కార్తీక, తల్లికి సమ్మకం కుదరలేదు.

"అవునమ్మా, బావే!" తిరిగి అంది కార్తీక!

"ఆంటీ" అంటూ దగ్గరగా వచ్చి ఆవిడ భుజాలు పట్టుకుని కుదిపేశాడు శ్రీకాంత్!

"సర్వయ్యా! ఎలా ఉన్నావు" పలకరించాడు!

"హాయ్! కార్తీ అంటూ ఆమెకు చేతులు కలిపాడు.

"హాయ్! బావా! అంటూనే చేతిలో ఉన్న పూలమాల అతని మెడలో వేసి చప్పట్లు కొట్టింది.

ఆ దండను ఒక్కసారి వాసనచూసి వెంటనే ఆ దండ ని ఆమె మెడలో వేసి చప్పట్లు కొట్టాడు. ఈసారి శ్యామసుందరీదేవి, సర్వయ్య కూడా తతనితో చేరి చప్పట్లు కొట్టారు.

శ్యామసుందరీ వి ఇద్దరికి వివాహం జరిగినంత సంబరపడిపోయి ఇద్దర్ని మార్చి మార్చి చూసింది.

కార్తీక మాత్రం అనుకోని ఆ సంఘటనకు తెల్లబోయి అలాగే నిలబడింది. తర్వాత "ఛ! ఏమిటి బావా ఇదంతా." అంటూ దండతీసి సర్వయ్యా చేతి కందించింది.

"బాగుంది. నువ్వేస్తే తప్పులేదు, అ పని నేనుచేస్తే ఛీ! అంటా వేమిటి? అంటూ కార్తీక చెవిపట్టి మెలేశాడు, తెలుగు మాటలు కాస్తంత తడబడుతూ మాట్లాడుతున్నాడు.

"అమ్మా! చూడవే?" అంటూ బలవంతంగా విడిపించుకుని దూరంగా జరిగి నిలబడింది. ఆ తల్లి మనస్సు సంతోషంతో బరు

వెక్కింది.

శ్యామసుందరీ వి అతని చేతులు నిమిరి, "ప్రయాణం బాగా జరి గిందా బాబూ" అంటూ అడిగింది.

"చాలా బాగా జరిగింది ఆంటీ! నీ ఆరోగ్యం ఎలా ఉంది?"

"నాకేం బాగానే ఉన్నాను, నీకోసమే ఇలా ఉన్నాననుకో!" అంటూ వచ్చే కన్నీళ్ళను ఆపుకుంటూ కళ్ళు ఒత్తుకుంది.

సర్వయ్య అతని చేతిలోని బ్రీఫ్‌కేస్ అందుకున్నాడు. సామాన్లు తీసుకుని అందరు కారువైపు నడిచారు.

కారులో తన పక్కనే కార్తీక కూర్చుంటుందనుకున్నాడు. కాని ఆమె వెళ్ళి తల్లి ప్రక్కన వెనక సీట్లో కూర్చుంది. సర్వయ్యను ముందు కూర్చోపెట్టి వచ్చి కార్తీక పక్కనే కూర్చున్నాడు శ్రీకాంత్. అక్కడి విశేషాలను చెప్పడం ప్రారంభించాడు.

అతని చూపులన్నీ తనచుట్టూ ఉన్నాయని యిట్టే గ్రహించింది కార్తీక! అయినా అతను చెప్పేవన్నీ ఎంతో శ్రద్ధగా వింటోంది. ఎందుకో హఠాత్తుగా ఆమె దృష్టి అభిరామ్ వైపు వెళ్ళింది. అతను మితంగా మాట్లాడుతాడు, అతని చూపుల్లో ఏదో వింద ఆకర్షణ తనకు కనబడుతుంది. ఇతను మామూలుగా చూస్తున్నాడు. ప్రతి చిన్న విష యంలోను ఇద్దర్నీ పోల్చి చూసుకుంటోంది కార్తీక. ఇ-మి అర్థంకాని శ్రీకాంత్ ఆమె చూస్తూ మాట్లాడుతున్నాడు.

ఇంటికి రాగానే పెట్టితెరచి 'కార్తీ' అంటూ పిలిచాడు. ఎందుకో అతనలా పిలుస్తుంటే ఆమె మనసు చలిస్తోంది. ఆ పిలుపుకు తనలోని బింకం కరిగిపోతుంది. "అతనలా పిలవకుండా ఉంటే ఎంత బాగుం డును" అని పదిసార్లు అనుకుంది. కాని ఆ మాట చెబితే చిన్నబుచ్చు కుంటాడు. ఇప్పుడే కాదు సమయం రావాలి!" అనుకుంది మనస్సులో.

గబగబా అతని గదిలోకి వెళ్ళింది. "ఏంబావా" అంటూ.

ఆమెకోసం తెచ్చిన చీర చేత్తో పట్టుకుని మంచంమీద కూర్చుని ఉన్నాడు.

"కార్తీ! ఎలా ఉంది చీర." ఆత్మీయంగా ఉన్నాయి మాటలు.

లేత పసుపురంగు చైనా సిల్కుచీర సెల్ఫుడిజైన్‌తో ఎంతో అందంగా ఉంది. తనకు బాగా నచ్చేరంగు అది.

"బావా! బావా! ఎంత బాగుందో" దగ్గరగా వెళ్ళింది. చీర అందుకుని చూడాలని.

చీర చేతికి అందించిన శ్రీకాంత్ చటుక్కున ఆమెను ఒకచేత్తో అందుకుని చీరను ఒంటినిండా పరిచాడు. బిత్తరపోయిన ఆమె బలమైన అతని చేతుల్ని విడిపించుకోలేక గింజుకోడం ప్రారంభించింది.

"ఏమిటి బావా ఇది? ఒదులు ముందు నన్ను. లేకపో నేచీర కట్టుకోనం ?" బుంగమూతి పెట్టింది.

ఆ బుంగమూతి అంటే అతనికి ప్రాణం. అమాంతం అందుకుని ముద్దుపెట్టుకోవాలని ఉంది. కాని ఆమె నిజంగా చీర కట్టుకోదేమోనని భయపడ్డాడు.

అయినా మనస్సును అదుపులో పెట్టుకోలేక ఆమె లేత పెదాలను మునివేళ్ళతో రాసి వదిలేశాడు.

ఆ చీర అక్కడే వదిలేసి తుర్రుమంది కార్తీక. అతను పిలుస్తున్నా వెనక్కి తిరిగి చూడ లేదు.

"కార్తీ ఇదిగో చీర కట్టుకోకపోతే నామీద ఒట్టే!" అంటూ ఆమె వెంట పరుగెత్తాడు.

తల్లిపక్కన నక్కిన కార్తీక మీదకి చీర విసిరాడు. శ్రీకాంత్ మూతి వంకర తిప్పుతూ చీర అందుకుంది కార్తీక. ఇద్దర్ని అర్థం చేసుకోలేక ఆ తల్లి తికమకపడింది.

తర్వాత మేనత్తకోసం పట్టుకొచ్చిన చీర ఆమెకు అందించాడు.

సర్వయ్యకు తెచ్చిన వస్తువులు అతనికిచ్చాడు.

"మా నాయనే! నూరేళ్ళు బ్రతుకు." అంటూ దీవించాడు సర్వయ్య.

అందరూ సంతోషంగా భోజనాలు పూర్తిచేశారు.

"ఇంక నా బరువు దిగినట్టే అనుకుని శ్యామసుందరీ వి ఆ రాత్రి హాయిగా పడుకుంది.

"కార్తకకు చిన్నతనం ఇంకా పోలేదు. ఎలా తెలియచెప్పాలా' అని ఆలోచిస్తూ పడుకున్నాడు ప్రకాంత్.

"ఇప్పుడే అసలు సమస్యలు ప్రారంభమయ్యాయి. వీటిని ఎలా పరిష్కరించుకోవాలో?" అని ఆలోచిస్తూ పడుకుంది కార్తీక.

* * *

సాయంకాలం కార్తీక ప్రకాంత్ బహుమతిగా ఇచ్చిన గోల్డెన్ కలర్ చైనాసిల్క్ చీర కట్టుకుంది. ఆ రంగుకు మాచింగ్ గాజులు వేసుకుంది. మెడలో అదేరంగు 'స్టల్స్ పెట్టుకుంది. చెవులకు కూడా క్రిస్టల్స్ దుద్దులే పెట్టుకుంది.

వెళ్ళి తల్లికి చూపించింది. తల్లి ఆనందానికి అంతు మ. నీకు రంగు చాలా బాగుందమా !" అంది. పచ్చటి కార్తీక వంటి రంగు రింత పచ్చగా కనబడుతోంది. ఏ గంధర్వ కన్యో ఆ లోకంనుండి లాటి చీరలు కట్టుకోడానికి భూలోకం వచ్చి ఉంటుంది కాబోలు అనిపించేటట్టుగా ఉంది. ప్రకాంత్ తెచ్చిన చీర కట్టుకుంటుందో లేదోనని పొద్దుట నుంచి కూతుర్ని రెండు మూడుసార్లు హెచ్చరికచేసింది. ందుకే ఆ చీర కట్టుకున్నందుకు ఆమె ఉప్పొంగిపోయింది.

"తల దువ్వుకోకుండా అలా విరబోసుకున్నా మిటే?" అడిగింది తల్లి.

"మన కుం లో పూసిన పసుపు గులా.. తెచ్చుకుని జడ వేసుకుందామని" సమాధానమిచ్చింది.

బావకు కనబడు. నిన్నిలా చూస్తే ఎంత సంబరపడతాడో!" మరోసారి చెప్పింది.

"ఇంతలో, కార్తీ అన్న పిలుపు వినబడింది. అది శ్రీకాంత్ పిలుపు.

"ఏం బావా పిలిచావా?" అంటూ వెళ్ళి అక్కడ నిలబడింది.

"కార్తీ! ఇతను నా ఫ్రెండ్ అభిరామ్."

"నమస్తే" అంటూ చేతులు జోడించిన కార్తీక అలాగే ఉండిపోయింది. 'నమస్తే' అభిరామ్ చిరునవ్వుతో అన్నాడు.

"బాగున్నారా!" అభిరామ్ ప్రశ్నించాడు.

శ్రీకాంత్ ఇల్లు గుర్తుపట్టిననాటి నుంచి కార్తీక ఆ యింట్లోకి ఎందుకు వెళ్ళిందో అర్థం కాలేదు.

అతను ఇండియాకు తిరిగి వస్తున్నానని తనకు ఉత్తరం రాయకపోయినా ఒక స్నేహితుని వల్ల తెలుసుకున్నాడు. శ్రీకాంత్‌కి కార్తీ ఏమవుతుందో తెలుసుకోవాలనే వెంటః బయలుదేరి వచ్చాడు.

"అతని చిరునవ్వు కార్తీకకు ఎంతో ఇష్టం. ఎదురుగా బావ ఉన్నాడని భయపడి అభిరామ్‌ను సూటిగా చూడలేకపోయింది.

అది గమనించిన శ్రీకాంత్ "మా కార్తీ! మీకు తెలుసా?" అడిగాడు.

"తెలుసు ఈమధ్యేవాళ్ళ కాలేజీ రోజున పరిచయం అయ్యారు.

"కాలేజీ ప్రోగ్రామ్‌కి నువ్వు ఎందుకు వెళ్ళావు?" ఆశ్చర్యంగా అడిగాడు.

"నాకు డాన్సు అంటే చాలా ఇష్టం. ఆరోజు ఈవిడ భామా

కలాపం మా నాన్నగారు ఊళ్ళో లేకపోవడంచేత నేవెళ్ళాను."

"మీ నాన్నగారు కాలేజీలో పనిచేస్తారా!"

"లేదు బావా: ఆయన మా కాలేజీ చైర్మన్‌గారు!"

"ఓ అదా! మా కార్తీ, డాన్సులు అవి మనలాటి వాళ్ళకు ఎందు కంటె వినదు!" అన్నాడు కాస్త నిష్ఠూరంగా.

అంతవరకు నిలబడి ఉన్న కార్తీకను చూసి "కూర్చోండి." అన్నాడు అభిరామ్.

అభిరామ్ ఉండగా అక్కడ కార్తీకను కూర్చోమనడం ఇష్టం లేదు, సరదాకి పరిచయం చేద్దామని పిలిచాడు. పరిచయం చెయ్యటం పూర్తికాగానే వెళ్ళిపోతుందనుకున్నాడు శ్రీకాంత్.

కాని కార్తీక అక్కడే నిలబడింది, బావ కూర్చోమనలేదని కాస్త కోపం కూడా వచ్చింది.

"కార్తీక డాన్సు చాలా బాగా చేశారు. అలాటివారు మరికాస్త కృషి చెయ్యాలి! అయినా కళను నేర్చుకోవడంలో తప్పులేదు. అందరికి అభిరుచి ఉన్నంత మాత్రాన పట్టుబడదు. అన్నీ తగినట్లుగా ఉన్న కార్తీక వంటివారు చాలా అరుదు. అటువంటి వారు కళారాధన చెయ్యక పోతే ఎలాగండి!" అన్నాడు అభిరామ్ నవ్వుతూ! అతని అభి ప్రాయం కార్తీకకు చాలా నచ్చింది.

పైగా తన అభిప్రాయాలకు ప్రాధాన్యత ఇస్తూ మాట్లాడిన ఆ వ్యక్తిపై గౌరవం కూడా పెరిగింది.

శ్రీకాంత్ అతని అభిప్రాయాలతో ఏకీభవించలేక పోయాడు.

"స్త్రీలు ఇంటి పనులతోనే అలసిపోతారు. సంసారం పెట్టాక పిల్లలూ బాధ్యత పెరుగుతుంది. ఇంక ఈ కళలు, కళాపోషణలకు టైం ఎక్కడ ఉంటుందండి! ఇవన్నీ ఆదర్శాలే తప్ప నిత్య జీవితానికి పనికి వచ్చేవి కావు అభిరామ్" స్పష్టంగా చెప్పాడు శ్రీకాంత్.

అభిరామ్ నవ్వి ఊరుకున్నాడు. ఎదుటివారితో వాదించడానికి అంతగా అతను ఇష్టపడడు. అంత మాత్రంచేత తన అభిప్రాయాలు మార్చుకోడు కూడా.

కార్తీకకు మాత్రం శ్రీకాంత్‌ను నెత్తి మీద మొత్తాలన్నంత కోపం వచ్చింది.

ఇంతలో సర్వయ్య టిఫిన్ ప్లేట్లు పట్టుకొని వచ్చాడు.

కార్తీక వాటిని ఇద్దరికి అందించింది. తర్వాత ఏదో జ్ఞాపకం వచ్చినట్లుగా పరుగెత్తుకుంటూ తల్లి దగ్గరకు వెళ్ళింది.

"అమ్మా! అమ్మా! నాకు ఉంగరం ప్రజంటు చేసిన అభిరామ్ వచ్చాడు. నువ్వు చూడాలి రామ్మా!" అంటూ తల్లిని బలవంతం చేసింది.

చేస్తున్న పని వదిలిపెట్టి శ్యామసుందరీదేవి వారు కూర్చున్న హాలు గుమ్మం వరకు వచ్చి నిలబడింది.

చాటు నుంచే చూపించింది కార్తీక.

పరిలించి చూసింది ఆవిడ! సోఫాలో కూర్చుని ఎంతో మృదువుగా శ్రీకాంత్‌తో మాట్లాడుతున్నాడు. "పేరుకు తగ్గ రూపం" అంట మెల్లిగా కూతురుకు వినబడేటట్లు.

శ్రీకాంత్‌కు స్పష్టంగా కాకపోయినా ఏవో మాటలు వినబడి తల తిప్పి చూశాడు.

"అత్తయ్యా! ఇతను నా క్లాస్‌మేట్ అభిరామ్."

అభిరామ్ ఈవిడ మా అత్తయ్య కార్తీక మదర్" ఇద్దరిని పరిచయం చేశాడు!

అభిరామ్ లేచి నిలబడి "నమస్కారమండీ!" చిరునవ్వుతో కూర్చోండి అంటూ ఆవిడకు కుర్చీ చూపించాడు, "మీరు కూడా కూర్చోండి కార్తీకగారూ" అన్నాడు. ఇద్దరు కూర్చున్నాక అతను

కూర్చున్నాడు.

"నా యింట్లో ఇతని మర్యాదలేమిటో" విసుక్కున్నాడు శ్రీకాంత్.

"నువ్వాబాబు? మా కార్తీక చెప్పింది ఉంగరం కూడా బహుకరించావని. చాలా సంతోషం బాబు!"

"దాని ముఠవండి" మా నాన్నగారు లేనప్పుడు నా బాధ్యత ను నిర్వర్తించాలి గదండీ"

"అమ దొంగా? ఉంగరం చూపించావు కాదేం" అడిగాడు శ్రీకాంత్.

"నువ్వు అడగలేదుగా ఇదుగో ఇప్పుడు చూడు!" అంటూ ఉంగరం వేలు చూపించింది.

"పచ్చని పొడవైన వేలుకు మరింత పచ్చగా మెరుస్తున్న ఉంగరాన్ని అభిరామ్, శ్రీకాంత్‌లు ఒకేసారి చూశారు.

తన ఉంగరాన్ని ఆవిడ పెట్టుకున్నందుకు, తన ఉంగరం చాలా అదృష్టం చేసుకుందనుకున్నాడు అభిరామ్, "ఉంగరం ఇస్తే మటుక్కి వేలికి పెట్టుకుని ఊరేగాలి కాబోలు!" అని మనసులో అనుకున్నాడు. సెకి మా తం చాలా బాగుంది." అన్నాడు శ్రీకాంత్.

"ఆ రాత్రి వేళ ఉంగరం ఎక్కడనుంచి తెచ్చావ్ అభిరామ్!"

"తేవడమెందుకు నా కొత్త ఉంగరం తీసి ఇచ్చాను."

ఆ మాటలు వినగా కార్తీక మరింత సంతోషపడింది. లి ఉంగరం తీసి అవతల పడెయ్యాలనుకున్నాడు శ్రీకాంత్. కాని అది సభ్యత కాదని ఊరుకున్నాడు. మనస్సులో అభిరామ్ మీద చెప్పలేనంత ఈర్ష్య ప్రారంభమైంది.

అది దాచుకోడానికి ప్రయత్నిస్తూ "మంచిపనిచేశావు అభిరామ్!" అన్నాడు,

మరునాడు వాళ్ళింటికి పార్టీకి రమ్మని అందరిని పిలిచాడు.

శ్రీకాంత్‌కు కార్తీక పార్టీకి రావడం ఇష్టంలేదు. అందుకే "రేపు కుదురుతుందో లేదో వీలు చూసుకుని వస్తాం పైగా కార్తీకకు పరీక్షలు దగ్గరకొచ్చాయి ఆమె రానంటుందేమో" అన్నాడు.

"పరీక్షలకేముంది బావా! నేను అన్నీ ప్రిపేరు అయ్యే ఉన్నాను. వాళ్ళింటికి నేనూ వస్తాను." అంది శ్రీకాంత్ మనస్సు గ్రహించి.

"మీరు కూడా తప్పకుండా రావాలం " అన్నాడు శ్యామసుందరీ దేవిని.

"నేను ఎందుకు నాయనా, వాళ్ళను పంపిస్తాలే" అంది.

అభిరామ్ అందరికి మరోసారి చెప్పి ఆనిడకు నమస్కరించి వెళ్ళిపోయాడు.

ఊపిరి పీల్చుకున్నాడు శ్రీకాంత్.

"బుద్ధిమంతుడు." అనుకుంది శ్యామసుందరీదేవి.

అతను వెళ్ళినవైపే చూస్తూ అలా వుండిపోయింది కార్తీక.

"కార్తీ! ఉంగరం సంగతి నాతో చెప్పలేదేం." కార్తీక పక్క కుర్చీ లాక్కుని కూర్చున్నాడు.

ఆ మాటలకు ఉలిక్కిపడి ఈ లోకంలోకి వచ్చింది కార్తీక.

"చెప్పటానికేముంది. అందుకే చెప్పలేదు" అంది నవ్వుతూ.

"అదికాదు శ్రీకాంత్ ఒకరోజు మన కార్తీక రోడ్డుదాటలేక అవస్థ పడుతుంటేవచ్చి రోడ్డు దాటించాట్ట. ఈ అభిరామ్" అంది శ్యామసుందరీదేవి.

"చెప్పవేం కార్తీ." అంటూ నెత్తిమీద మొట్టి "కారు ఏమయింది" అని అడిగాడు.

వారిద్దరిని ఆశ్చర్యంగా చూసింది ఆవిడ.

"రిపేరులో ఉంది. నేనేం అతన్ని అడిగినా రోడ్డు దాటించమని

ఆ ఈరోజు కూడా ఉంగరం ఇమ్మని అడిగినా అతను ఇచ్చాడు. ప్రిన్సిపాల్‌గారు పెట్టుకోమన్నారు. పెట్టుకున్నాను. నువ్వుకూడా ఒక ఉంగరం ఇస్తే పెట్టుకుంటాను దాన్ని" అంది.

శ్యామసుందరీ వికి ప్రకాంత్‌కు కూడా ఆ మాటలు అమృతపు జల్లుల్లా అనిపించాయి.

"అనవసరంగా అపార్థం చేసుకున్నాను!" అనుకున్నాడు.

అతని వేలికి ఉంగరం లేదు. అందుకే మెళ్ళో ఉన్న సన్నని గొలుసు తీసి ఇచ్చి పెట్టుకోమన్నాడు.

అతని చేతిలోని గొలుసు అందుకొని మెళ్ళో పెట్టుకుని "అబ్బో పెద్ద బహుమానమే" అంది.

ప్రకాంత్ ముఖం చిచ్చుబుడ్డిలా వెలిగింది.

చదువుకోవాలని లేచింది కార్తీక. శ్యామసుందరీదేవి వసుంధరని లోపలికి వెళ్ళింది.

ప్రకాంత్ అలానే సోఫాలో కూర్చున్నాడు. అతని మనస్సులో వెయ్యి ఆలోచనలు బయలు దేరాయి.

ఏమైనాసరే అభిరామ్‌కి దూరంగా ఉంచాలి కార్తీకను.

కార్తీక అమాయకురాలు. ఆడపిల్లలకు బుట్టలో వేసుకోవడంలో ఘ్రలా ఉన్నాడు అభిరామ్. రోడ్డు దాటించడానికి అతను తయారు య్యాడు. అంతటితో పోవచ్చుగా. సిగ్గులేకుండా ఆడపిల్లల కాలేజీ గ్రామ్‌కి వెళ్ళి పెద్ద హీరోలా చేతి ఉంగరం ప్రజంటు చేశాడు. పైగా పార్టీకి మరీమరీ రమ్మని పిలిచాడు. ఏమైనా ఇతనికి దూరంగా ఉంచాలి కార్తీకను. పైగా తనో కొత్త ఉంగరం కొనిఇచ్చి ఆ ఉంగరాన్ని వేలి నుండి తీయించేయాలి. తన కార్తీకను ఎవరు కన్నెత్తి కూడా చూడ కూడదు. ఆమె తనది. అలా ఆలోచిస్తూ కూర్చుండిపోయాడు ప్రకాంత్.

స్వాతి కరాటె ఎంతో ఉత్సాహంగా నేర్చుకుంటోంది. అక్కడ స్వాతి అందరికంటే నేర్పరితనంగా నేర్చుకోవడంవల్ల అందరు అభిమానంగా చూస్తున్నారు. అక్కడ ఆడపిల్లలు పన్నెండుమంది ఉన్నారు. మగపిల్లల బాచ్ వేరుగా ఉంది. మగపిల్లలలో 'రాజా' అనే అబ్బాయి చాలా చురుకైనవాడు.

ఒకరోజు రాజావాళ్ళు ప్రదర్శన చూస్తుంటే అప్పుడే క్లాసునుంచి వస్తున్న స్వాతి వాళ్ళ ఎదురుగా వెళ్ళి కూర్చున్నారు. రాజా ప్రదర్శన స్వాతిని ఆకట్టుకుంది. అతనితో సమానంగా తనూ నేర్చుకుంది. అతని అందరు పొగుడుతున్నారు. అందరికంటే చాలా గొప్పవానిగా చూస్తున్నారు. అందుకే ఆ ప్రదర్శనలన్నీ తనూ చేసి చూపించాలనుకుంది.

అతని ప్రదర్శన పూర్తి అయింది. అందరు హర్షధ్వానాలు చేశారు. కరాటె మాష్టరు ఎన్నో విధాల పొగిడాడు.

"వెంటనే స్వాతి లేచి మాస్టారు ఈ ప్రదర్శన ను చేస్తానండి" అంది.

"నువ్వా అమ్మా! అన్నారు ఆశ్చర్యంగా.

"అవునండి. నాకు కూడా చెయ్యడానికి పర్మిషన్ ఇవ్వం అంది.

"ఓకే, కానీయమ్మా" అన్నాడాయన.

అక్కడఉన్న మగపిల్లలంతా "కరాటెరాణి బయలుదేరినట్టుందిరా! రాజాతో పోటీకి రాణిగారు! కరాటెరాణిగారు"! అన్నారు నెమ్మదిగా. మేష్టారికి వినబడితే తిడతారని భయం.

రాజా మాత్రం దీర్ఘంగా చూస్తున్నాడు. కళ్ళు కాస్త ఎర్రబడ్డాయి.

స్వాతి ప్రదర్శన ప్రారంభించింది. ముందు ఇటుకల్ని,

తర్వాత మంచు గడ్డలను ఒక్క చేతి ముటతో పగలగొట్టింది.

తర్వాత అమ్మాయి లీలతో కలియబడింది. రెండు దెబ్బలతో ఓడించింది. అక్కడ ఉన్న ఆడపిల్లలందర్నీ అవలీలగా ఓడించింది. అక్కడ ఉన్నవారంతా ఆశ్చర్యపోయి చూస్తున్నారు.

మాష్టారు లేచి "శభాష్ స్వాతి! శభాష్. నీకు ఎదురులేదు. అవలీలగా ఎంతటి వారినైనా ఓడించేస్తావు. అలాగే శ్రద్ధగా ర్చుకుంటే ఏ మగవాడు నిన్ను ఎదురించలేడు!" అన్నారు.

వెంట రాజా స్నేహితుడు లేచి "ఇది అవమానం, మీరు మగవారై ఉండి ఇలా అనడం అవమానం" అంటూ అరిచాడు.

"అవును. ఇది నిజం" మిగిలిన వాళ్ళు గొంతుకలు కలిపారు.

అప్పుడు కరాటె మాస్టారు లేచి "స్త్రీలు కరాటె నేర్చుకోవడంలో రెండో బాచ్ ఇది. అందరిలో చాలా చురుకుగా ర్చుకుంటున్న వారిలో ఈమె ప్రథమురాలు. ఈమె ఇలానే ర్చుకుంటే ఏ నేర్పరులు ఈమె ముందు నిలబడలేరు" అన్నాడు.

"మేం నమ ం. మా రాజాముందు కూడా నిలబడగలదాండి మేస్టారు?" శ్యాం వెటకారంగా అడిగాడు.

"రాజాతో పోటీక రమ నమనండి చూద్దాం?" రమేష్ అరిచాడు.

"నేను రె ." అన్నాడు రాజా.

"శభాష్ రాజా." మీసాలు మెలేశారు స్నేహితులు.

"నువ్వు ఏమంటావమ్మా" అడిగారు మేస్టారు.

" ను రె యే. కాని ఈరోజు కాదు. వచ్చే ఆదివారం" అంటూ ్వాతి అక్కడనుంచి డ్రస్సు మార్చుకుని ఇంటికి బయలు రింది.

వెళ్ళిపోతున్న ఆమెనే చూస్తూ నిలబడ్డాడు రాజా.

"ఈమెను ఓడించిననాడే నిద్రపోతాను." అనుకున్నాడు

అదే అవిడ నోరు కట్టించేస్తుంది. అందుకే ఆ బాణం ప్రయోగిస్తుంది కార్తీక. ఆ తల్లి వెంటనే 'సరేలే' అంది.

ఇంతలో బయటనుంచి వచ్చాడు శ్రీకాంత్!

ఎదురుగా కార్తీక అప్సరసలా కనబడింది. కళ్ళు తిప్పుకోడం మర్చిపోయాడు.

"ఏంబావా! నువ్వు ఇలాగే వచ్చేస్తావా!" అడిగింది కార్తీక.

"అబ్బే! నిమిషంలో వచ్చేస్తాను. ఈరోజు నీ చీర చాలా బాగుంది కార్తీ!" అన్నాడు.

"నా చీరేనా! నేను బాగుండలేదన్నమాట?"

"ఆ చీరలో నువ్వు సరేనా! అయినా ఈరోజు స్పెషల్‌గా తయారు అయినట్టు కనబడుతున్నావ్?" లోపల అభిరామ్ కోసమేమో నన్న అనుమానం వేధిస్తోంది. ఉండబట్టలేక అడిగేశాడు.

"స్పెషల్ కాక ఏమిటి? ఫారిన్ బావగారి వెంట వెళ్ళాలిగా!"

ఆ మాటలకు శ్రీకాంత్ మనస్సు సంతృప్తి పడింది. ఎక్కడలేని ఉత్సాహం వచ్చింది.

"ఇప్పు వచ్చేస్తా చూడు." అంటూ మేడమెట్లవైపు పరుగెత్తాడు.

నవ్వుకుంది కార్తీక. సంబరపడింది తల్లి.

అన్నట్టుగానే శ్రీకాంత్ అయిదునిమిషాల్లో తయారై వచ్చాడు.

"రా కార్తీ! వెడదాం." అన్నాడు.

"ఓ " అంటూ బయలుదేరింది కార్తీక.

"ఎక్కువసేపు వుండకండమా ! త్వరగా వచ్చేయండి." అంది శ్యామసుందరీదేవి.

"అలాగే వచ్చేస్తాము. అయినా ఈ బావగారు కదిలిరావాలిగా!" అంది.

"అబ్బే నాదేముంది, ఈ పార్టీ అంతా నీకోసమేగా!" అన్నాడు శ్రీకాంత్.

"తమరు ఫారిన్ నుంచి వచ్చారని పార్టీ. నాకోసం కాదు. పోనీ నే మానేస్తాను. నువ్వెళ్ళు" అంది.

"నయమే. నడునడు" అన్నాడు ఆమె పక్కన కూర్చుని వెళ్ళి ఆమె తన భార్య అని అభిరామ్‌కి తెలియజెయ్యాలి. అప్పుడు మరికాస్త దూరంగా వుంటాడు అనుకున్నాడు శ్రీకాంత్.

ఇద్దరు వెళ్ళి కారెక్కారు.

ఆ ఇద్దర్నీ చూస్తూ నిలబడింది, ఆవిడ అప్పు అక్కడకు వచ్చిన సర్వయ్యను "సర్వయ్యా! ఆ ఇద్దర్నీ చూశావా!" అడిగింది.

"చూస్తున్నాగా అమ్మా! ఏనాడో చేసుకుంటేనే ఈ జన్మలో ఇటు వంటి ఈడు జోడు కుదురుతుంది" అన్నాడు.

కారు హారన్ వినగా- అభిరామ్, అతని చెల్లెలు రోహిణీ బయట హాలులోకి వచ్చారు.

కారు దిగుతున్న కార్తీకను, శ్రీకాంత్‌ని చూసి "రండి రండి అంటూ ఆహ్వానించారు.

లోపలికి వస్తున్న శ్రీకాంత్‌కు అభిరామ్ చేతులు కలిపాడు తర్వాత హల్లో రోహిణీ!" అంటూ ఆమె చేయి అందుకున్నాడు.

అభిరామ్ కార్తీక దగ్గరగా వచ్చి "బాగున్నారా?" అన్నాడు. ఆ మాటలో ఆత్మీయత ఉట్టిపడుతోంది.

"బాగున్నా." అంది చిరునవ్వుతో.

కార్తీకనే చూస్తున్న రోహిణికి అభిరామ్ కార్తీకను పరిచయం చేసాడు.

"హలో! అంటూ పలకరించింది రోహిణి. తర్వాత శ్రీకాంత్‌ను చెయ్యి పట్టుకుని తీసుకునివెళ్ళి సోఫాలో కూర్చోబెట్టి పక్కన

కూర్చుంది. ఆమె పక్కన వదిగి కూర్చున్నాడు శ్రీకాంత్.

అదంతా చూస్తున్న కార్తీకకు ఆశ్చర్యమేసింది. ఆ యింట్లో శ్రీకాంత్‌కు బాగా పరిచయం ఉందని ఇట్టే గ్రహించింది. పైగా ఆమె వేషం కూడా తనకంటే మాడరన్‌గా ఉంది. స్లీవ్‌లెస్ జాకెట్టు -సుకుంది. బొడ్డుకిందికి పల్చటి చీర కట్టింది. జుట్టు భుజాలవరకు కత్తిరించి ఉంది. చేతికి వాచీతప్ప గాజులు లేవు. ఆ ఇద్దర్నీ అలా పక్కపక్కనే చూడగానే అతనికి తగిఉంది. అనుకుంది మనస్సులో.

అలా నిలబడ్డారేమిటి రండి వచ్చి కూర్చోండి." అంటో ఆమెకు సోఫా చూపించాడు అభిరామ్.

కార్తీక మరిచిపోయినట్టు వున్నాడు శ్రీకాంత్.

ఇంతలో అభిరామ్ చిన్న చెల్లెలు రేవతి అందరికి కూల్ డింక్స్ గ్లాసులో పోసి అందించింది.

అందరు గ్లాసులు అందుకున్నారు. శ్రీకాంత్ గ్లాసుతోపాటు మరో చేత్తో రేవతి చెవి అందుకున్నాడు.

"ఇంత పెద్దదానివై పోయావేమిటి నాతో చెప్పకుండా" అన్నాడు.

"బాబోయ్! పెద్దదాన్ని కాలేదు నువ్వే ముసలివాడై పోయావు. గో జుట్టు నెరిసిపోయింది." అంటూ అతని తలలో వెతికి ఒక తెల్ల టుక చూపించింది.

"ఏది చూపించు, చూపించు!" అంటు ఆమె చెవి వదిలి ఆడి డు.

తు రున పారిపోయింది రేవతి.

"అమ్మ దొంగా అదా సంగతి, ఈ మాటటు రా! నీ సంగతి చెబుతా" అంటూ బెదిరించాడు.

" ను బయట రానులే? అంటూ సమాధానమిచ్చింది రేవతి. అందరు పకపకా నవ్వారు.

"గార్డెన్‌లో కూర్చుందాం రండి!" అంటూ లేచాడు అభిరామ్. అందరు గార్డెన్‌లోకి నడిచారు.

ఇంటి కంటె తోట చాలా పెద్దదిగా ఉంది? రకరకాల పూల చెట్లు ఉన్నాయి"

రంగు రంగుల గులాబులు పూసి కన్నుల పండుగ చేస్తున్నాయి.

పక్క సన్నజాజి, విరజాజి, చెంబేళి గలున్నాయి. వాటికి పక్కగా రకరకాల క్రోటన్సు లున్నాయి. వాటి మధ్యలో కుర్చీలు వేసి ఉన్నాయి.

అందరూ వెళ్ళి కుర్చీల్లో కూర్చున్నారు. శ్రీకాంత్ కార్తీక పక్క కూర్చున్నాడు మరో పక్కగా వచ్చి కూర్చుంది రోహిణి.

ఫారిన్ విషయాలన్ని కుతూహలంగా అడుగుతోంది. శ్రీకాంత్ సమాధానాలు ఇస్తున్నాడు. ఇద్దరు మధ్య మధ్యలో నవ్వుకుంటున్నారు. అలా నవ్వేటప్పుడు శ్రీకాంత్ మీ పడుతోంది రోహిణి.

అవన్ని చూస్తున్న కార్తీక రోహిణికి అన్నగారిలోని గాంభీర్యం లేదనుకుంది. అభిరామ్ అక్కడ కనబడలేదు.

ఇంక అక్కడ కూర్చోలేకపోయింది కార్తీక, కుర్చీలోంచి వెళ్ళి పూలచెట్ల వైపు నడిచింది.

సాయంకాలం మూలంగా గాలి చల్లగా వస్తోంది, పూలవాసన మనస్సును కలవర పెడుతోంది.

ఒక్కొక్క గులాబీ పూవును చేత్తో తాకి చూస్తోంది. వాటితో ఏదో మూగభాషలో మాట్లాడుతోంది కార్తీక. ఇంతలో తల్లిని తీసుకుని అటే వస్తున్న అభిరామ్ కార్తీకను చూసి ఆశ్చర్యపోయాడు.

ఆ పూల మధ్యలో వనదేవతలా ఉంది. ఆమెవల్ల ఆ తోటకే అందం వచ్చిందనుకున్నాడు.

"అమ్మా! ఆమె కార్తీక" అన్నాడు తల్లికి కార్తీకను చూపిస్తూ.

"అలాగా! బంగారపు బొమ్మరా! ఏ అప్సరసలు ఆమెకు సాటి సారు' అంది సంబరంగా చూస్తూ.

ఆ ఇద్దర్నీ చూసిన కార్తీక పూలను వదలి వారినే చూసింది. అభిరామ్ చూపులు భరించలేక ఆమె చూపులు చెదిరి గులాబీ పూలల్లో తలదాచుకున్నాయి. కాస్త ముందుకు వచ్చి అభిరామ్ "కార్తీకగారు ఈవిడ మా అమ్మగారు" పరిచయం చేశాడు.

రెండు చేతులు జోడించి నమస్కరించింది కార్తీక.

ఆవిడ కార్తీక దగ్గరగావచ్చి భుజాలు రాస్తూ "బాగున్నావా అమ్మా! నీ గురించి మా అభిరామ్ చెబుతూంటాడు." అంది.

తల ఎత్తి ఒకసారి అభిరామ్‌కేసి చూసి తిరిగి తలదించుకుంది.

"అమ్మగారు రాలేదేం." అడిగింది ఆవిడ.

"ఆవిడ ఆరోగ్యం అంతమంచిది కాదం ! అందు ఎక్కడికీ రారు" అంది.

ఆవిడకు మొదటి చూపులోనే కార్తీకమీద ప్రత్యేకమైన అభి మానం ఏర్పడింది.

ఆమె ప్రతి మాట, కదలిక ఆవిడకు ఆనందాన్ని కలిస్తున్నాయి. చూపులు తిప్పుకోకుండా చూస్తోంది.

అన్నపూర్ణమ గారు టిఫిన్లు ప్లేటలో సర్దింది. అభిరామ్ అందరి అందించాడు.

ఇవేమీ గమనించకుండా రోహిణి కబుర్లు చెబుతూ ఉంది. ఆమె స్వభావం అంతుపట్టలేదు కార్తీకకు.

"శ్రీకాంత్! టిఫిన్ తీసుకుంటావా? బలవంతంగా నోట్లో పెట్ట మన్నావా!" అడిగాడు అభిమ్.

"అంతపని వద్దులే నేనే తింటాను." తినడం ప్రారంభించాడు.

అన్నపూర్ణమ్మగారు "బాగున్నావా శ్రీకాంత్, ఎప్పుడొచ్చావు!"

అంటూ పలకరించింది.

"మీరా! నమస్కారమండి, నేను బాగా వున్నా, మొన్న పొద్దుటే వచ్చాను. మీరెలా వున్నారు?" అన్నాడు కబుర్లలోపడి ఆవిడ వచ్చినట్టే గమనించలేదు పలకరించేవరకు.

"నేను బాగానే వున్నాను. తిను తిను టిఫిన్ తిను" అంటూ కార్తీక పక్కకు వెళ్ళి కూర్చుంది. కార్తీకకు తలఎత్తి ఆవిడను చూడడమే భయంగా ఉంది. ఎప్పుడు తలెత్తి చూసినా ఆవిడ తనకేసే చూస్తోంది. అందుకే కాస్త భయంగా ఉంది. అయినా మధ్య మధ్య అభిరామ్ చూపులతో ఆమె చూపులు కలుస్తూ ఉన్నాయి.

రోహిణి ఇట్టే పసిగట్టింది. ఆమెకు శ్రీకాంత్ అంటే చెప్పలేని ఇష్టం. మంచి అందగాడు! చాలా మోడరన్ డ్రస్సులు వేసుకుంటాడు. పైగా ఫారిన్ వెళ్ళివచ్చాడు. ఎంతో సరదాగా ఉంటాడు కూడా!అందుకే అతను తనవాడయి ఎంత బాగుండును అనుకుంది.

కానీ కార్తీకతో ఎప్పుడో పెళ్ళి నిశ్చయమైందని చెప్పాడు. కాని కార్తీకకు తన అన్నగారిమీద అభిమానం ఉన్నట్టు కనబడుతోంది. అందుకని వారిద్దరిని కాస్త దగ్గరకు -సుకురావాలి. అన్నకిచ్చి పె' చేయించాలి. అప్పుడు తనకు అడ్డుపోతుంది. శ్రీకాంత్ తనకు దక్కుతాడు అనుకుంది..

పక్కనే కూర్చున అన్నపూర్ణమ్మగారు కూతుర్ని, కార్తీకను మార్చి మార్చి చూస్తోంది. కార్తీక వినయం, గాంభీర్యం, మితభాషిత్వం ఆమెను ఆకట్టుకున్నాయి. ఆమె అభిరామ్‌కి అన్ని విధాలా తగిన పిల్ల. ఈ ఇంటికి కోడలిగా వస్తే, తమకు అంతకంటే అదృష్టం ఏముంటుంది" అనుకుంది.

టిఫిన్లు, కాఫీలు పూర్తి చేశారు అంతా. కార్తీక రోహిణీతో కలవలేకపోయింది. రోహిణికూడా కార్తీకను చనువుగా పలకరించలేక

పోయింది. ఆమెలో ఈర్ష్యలాంటిదేదో అవరించింది. అది ఉంతగా ఎవ్వరూ మామూలుగా ఉంచలేరు. అందుకే కార్తీకను తప్పించుకుని తిరుగుతోంది, చూడనట్టే మసలుతోంది.

"ఇంక వెడదామా!" జ్ఞాపకం చేసింది కార్తీక.

"నువ్వు కబుర్లలో మరిచిపోయామో అనుకున్నాను" కాస్త నిష్ఠూరంగా అన్నాడు శ్రీకాంత్.

తాను అభిరామ్‌తో చనువుగా ఉన్నందుకే అలా అంటున్నాడని కార్తీక అర్థం చేసుకుంది.

"తమరు మరిచిపోయ్యారని నేను జ్ఞాపకం చెయ్యవలసివచ్చింది." అంది నవ్వు తెచ్చుకుని.

"మంచి మాటకారే." అనుకున్నాడు అభిరామ్. అన్నపూర్ణమ్మ గారు కూడా మనస్సులో అలాగే అనుకుంది.

తర్వాత ఇద్దరూ లేచి నిలబడ్డారు.

అన్నపూర్ణమ్మ గారు చిన్నకూతురు చెవిలో ఏదో చెప్పారు. ఆ పిల్ల పరుగెత్తింది ఇంట్లోకి.

"ఉండమ్మా! కార్తీకా! బొట్టు పెట్టించుకుని వెళ్ళమ్మా." అంది అన్నపూర్ణమ్మ గారు.

ఇంతలో వతి పళ్ళు, తాంబూలం, రవికెగుడ్డ పట్టుకొచ్చి కర్తీకకు బొట్టుపెట్టి అందించింది.

కార్తీక అందుకొని "వెళ్ళొస్తానండి" అంది.

"మంచిదమ్మా! ఈమాటు అమ్మ గార్ని తీసుకునిరా" అందావిడ.

"అలా తప్పించుకోకు అంటీ. మీరు వీలు చూసుకుని మా ఇంటికి రావాలి. అప్పుడే మేము తిరిగి మీ ఇంటికి వచ్చేది" అన్నాడు శ్రీకాంత్.

"అవునం! మీరంతా తప్పకుండా రావాలి." అన్నపూర్ణమ్మ గారితో అంటూ అభిరామ్‌కేసి చూసింది.

"సరే!" అన్నట్టు అతను కళ్ళతోనే సంజ్ఞచేశాడు.

"అలాగేనమ్మా! తప్పకుండా వస్తాము." అందాఆవిడ.

అందరి దగ్గరా శెలవు సుకుని కారెక్కారు ఇద్దరు. కారు వరకు వచ్చారు అభిరామ్, రోహిణులు. ఇద్దరు శ్రీకాంత్‌కు షేక్‌హేండు ఇచ్చారు. కార్తీకకు "టా!టా!!" అంటూచేతులు వూపారు. కారు బయలు దేరింది.

కనుచూపుమేర దాటేవరకు ఇద్దరు అక్కడే నిలబడి తర్వాత లోపలికి వెళ్ళారు అన్నాచెల్లెళ్ళు,

ఆ రాత్రి కార్తీకకు, శ్రీకాంత్‌కు ని రాలేదు. వాళ్ళిద్దరు కార్లో కూడా మాట్లాడుకోలేదు. శ్రీకాంత్ రోహిణిని చూట్టూ తప్పుకుంటున్నా అతని మనస్సు కార్తీకవైపే ఉంది. కాని అభిరామ్ అడ్డుగా వచ్చాడు. కార్తీక అతని మోజులో పడుతుంద- అనుమానం బయలుదేరింది. అదే ఆలోచిస్తు మనస్సులో మధనపడుతున్నాడు శ్రీకాంత్.

కార్తీక ఆ దు బ్ధ్యాన్ని ఎలా ఛేధించాలో తెలియక తికమక పడింది. రోహిణి శ్రీకాంత్ మనస్సును ఎలా ఆకట్టుకుందామా అని ఆలోచిస్తూ పడుకుంది.

అభిరామ్ మనస్సులో కార్తీక నిండి ఉంది. అమె మనస్సు త వైపు ఉందని అతని ఆశ.అందుకే హాయిగా యని ఊహాలలో లి పోతూ నిదపోయాడు.

* * *

"ఉదయం ఆలస్యంగా నిదలేచిన శ్రీకాంత్ గదిలో కూర్చుని ఏవో ఉత్తరాలు రాసుకుంటున్నాడు.

"బావా! ఏంచేస్తున్నావు?" అంటూ గది గుమ్మంవరకు వచ్చి

నిలబడింది.

తలెత్తి చూసిన శ్రీకాంత్ "రా కార్తీ! అక్కడే నిలబడ్డావేం? ఇలా వచ్చి కూర్చో." అంటూ పక్కనున్న కుర్చీ చూపించాడు.

కార్తీక కుర్చీలో కూచోకుండా వెళ్ళి మంచంమీద చతికిలబడింది.

శ్రీకాంత్ రాస్తున్న ఉత్తరాలు ఆపేసి కార్తీకకేసి చూశాడు. బతిమాలినా గదిలోకి వచ్చి కూర్చోని కార్తీక పిలవకుండా రావడం అతనికి ఆశ్చర్యాన్ని కలిగించింది. ఆమెను అర్థం చేసుకోడం అతనికి చాలా కష్టంగా ఉంది. ఒకసారి ఎంతో దగ్గరైనట్టు కనిపిస్తుంది, మరో సారి తన ఉనికి గుర్తించనట్టు మసలుతోంది.

"బావా! రోహిణి బాగుంది కదూ!" అతని మనస్సులోని అభిప్రాయం రాబట్టాలని ఆమె ఉద్దేశ్యం.

"అభిరామ్ బాగున్నాడు కదూ!" ఆమెను ఏడిపించాలనుకున్నాడు.

"అభిరామ్ బాగుంటే నాకెందుకు? మరొకరు బాగుంటే నాకెందుకు?" అంది కోపం నటిస్తూ.

"మరి రోహిణి సంగతి నాకెందుకో!"

"నీక్కాకపోతే మరెవరికి, తమరి పాత స్నేహితురాలు కదా! పైగా చక్కటి డ్రస్సులో గలగలా మాట్లాడుతూ ఎంతో సరదాగా ఉందికదా, అందుకని."

"నువ్వు బాగా మాట్లాడలేదు కాబోలు అభిరామ్‌తో. డ్రస్సుదేముంది అందమైన మగవాళ్ళని ఆకర్షించడానికి అనేక రకాల డ్రస్సులు. షాలు. వాటి ముంది? నువ్వూ వేసుకో?"

ఆ మాటలు విని కార్తీక ఆశ్చర్యపోయింది. పరాయి ఆడ వాళ్ళను గురించి శ్రీకాంత్ అలా విమర్శించడం ఆమెకు నచ్చలేదు.

"ఛీ! ఛీ! ఏంమాట్లాడుతున్నావు బావా! అయినా మగవాళ్ళను ఆకర్షించుకోవలసిన అవసరం నాకు లేదు. అమ్మాయిలను ఆకర్షించుకో

డానికే నువ్వు ఇన్ని రకాల డ్రస్సులు వేసుకుంటున్నావు కాబోలు!

"అవును, నీలాంటి అమ్మాయిల్ని ఆకర్షించుకోడాని !" నవ్వుతూ సమాధానమిచ్చాడు.

"పో! బావా! నీవన్నీ పిచ్చి ఆలోచనలే. నీ డ్రస్సుచూసి నిన్నెవ్వరు ప్రేమించరు. అయితే ఆ రోహిణి డ్రస్సులు చూసి నువ్వు వెంట పడుతున్నావన్నమాట!"

"సరదాగా మాట్లాడటంలో తప్పేముంది. అంత మాత్రంచేత ప్రేమిస్తున్నానని ఆ అమ్మాయంటే ఇష్టపడుతున్నానని ఎలా అనుకుంటున్నావు? పిచ్చిపిచ్చి ఆలోచనలు పెట్టుకోకు?"

"పిచ్చిపిచ్చిగా ఆలోచించవలసిన అవసరం నాకు లేదు. అన్నీ నువ్వే అనుకుంటున్నావు." అంటూ అక్కడనుంచి లేచింది.

"నాతో పోట్లాడాలని వచ్చినట్టున్నావు. కూర్చో?" భుజం పట్టుకుని కూర్చోపెట్టాడు. ఆమె కూర్చోకుండా అతని చేతుల్ని విదులించుకుంటూ గబగబా కిందికి వచ్చేసింది.

ఆశ్చర్యపోతూ చూశాడు శ్రీకాంత్. అసలు కార్తీక మనస్సులో ఏముందో మాత్రం అతనికి అంతుపట్టలేదు.

* * *

ఆరోజు సాయంకాలం ఉత్తర, స్వాతి, బయలుదేరి కార్తీక ఇంటికి వచ్చారు.

"హాయ్ ఉత్తరా, హాయ్ స్వాతీ!" ఇద్దరినీ సాదరంగా పిలిచి కూర్చోపెట్టింది కార్తీక.

"ఏంటీ! ఇద్దరూ కనబడ్డమే మానేశారు?"

"బావగారు వస్తే నాకేం పనుంటుంది? కాని మీకే తీరికలు లేవను

కుంటాను!"

కార్తీక అప్పుడు చూసింది ఉత్తర ముఖం మాడిపోయి ఉండటం.

"ఇద్దర్నీ తీసుకుని డాబా మీదికి వెంటచేవెళ్ళింది కార్తీక.

"ఏం ఉత్తరా! అలా వున్నావేం" అడిగింది కార్తీక.

"ఎలా ఉన్నాను కార్తీ! నా బతుకు ఇంక ఇం " కళ్ళనీళ్ళు పెట్టుకుంది ఉత్తర.

స్వాతి అక్కను చూడలేక ఎటో చూస్తోంది.

"అ ం ఉత్తరా! అలా అంటే ఎట్లా? ఏం జరిగిందో ముందు చెప్పు."

జరగటానికేముంది స్కూల్లో కూడా నన్ను బతకనిచ్చేటట్టు లేడు! ఈ రోజు స్కూలుకి వచ్చి హెడ్ మిస్ట్రెస్ ఎదురుగా నానా మాటలు మాట్లాడాడు. ఆవిడనన్ను తెలిసినావిడ కనక సరిపోయింది. లేకపోతే ఎన్ని అపార్థాలు వచ్చునో, ను బతికి వుండటం కంటె చచ్చిపోవడం మంచిది కార్తీ! వెక్కి వెక్కి ఏడ్చింది ఉత్తర.

కార్తీక లేచి కన్నీళ్ళు తుడిచింది. "నువ్వేడిస్తే నేను నీతో ట్లాడను ఇలా ఏడవటానికా ఇక్కడకు వచ్చింది? లే, లే, నువ్వు చ్చిపో ఆ స్వాతి గ మవుతుంది? దాన్ని చంపేసి నువ్వు కూడా చచ్చిపో!"

"ఏం చెయ్యమన్నావు కార్తీ! చెప్పు?"

"ఏం చెయ్యొద్దు. ధైర్యంగా ఉండు అం చాలు! మీ సంగతి అందరికీ తెలిసిందే కదా! అతన్ని గురించి దాచుకోడంలో అర్థంలేదు."

"మా హెడ్‌మిస్ట్రెస్ అతన్ని తిట్టి పంపించింది. అయినా ఇన్ని అవమానాలు భరించలేకపోతున్నాను కార్తీ."

"అనుకుంటే అవమానం, లేకుంటే ఏమీ దు."

"కార్తీ! మీ బావని చూపించవా"? స్వాతి అడిగింది మాట మారుస్తూ.

"ఓ తప్పకుండా" ముగ్గురూ క్రిందికి వచ్చారు. ఉత్తర కళ్ళు తుడుచుకుంది. సర్వయ్య కాఫీలు అందించాడు.

ఇంతలో శ్యామసుందరీదేవి అక్కడకు వచ్చింది. ఇద్దర్నీ పలకరించింది. కార్తీక ఆవిడ మనస్సు కూడా ఎందుకు పాడుచెయ్యాలని ఆవిడకు ఉత్తర సంగతి చెప్పలేదు.

"అమ్మా! అమ్మా! బావను చూస్తారట! అంది తల్లితో.

"శ్రీకాంత్, ఇటురా" ఆవిడ పిలిచింది.

"పిలిచావా అత్తా" శ్రీకాంత్ గదిలోంచి బయటకు వచ్చాడు. ఎదురుగా కొత్త అమ్మాయిలు ఇద్దరు.

"బావా! నా స్నేహితులు ఉత్తర, స్వాతి."

"అలాగా! నా పేరు శ్రీకాంత్."

"నమస్కారం!" ఉత్తర చేతులు జోడించింది.

స్వాతి చెయ్యి చాపి షేక్ హేండ్ ఇచ్చింది.

"ఈవిడే బావా! మిస్ కరాటె రాణి!"

"వెరీ హేపీ టూ మీట్ యు!" అన్నాడు శ్రీకాంత్.

"అంత చక్కటి మనిషి అంటే కార్తీకకు ఎందుకు ప్రేమ లేదో ఆ అక్కచెల్లెళ్ళిద్దరికి అర్థం కాలేదు. అంతలో శ్రీకాంత్ ఎవరో స్నేహితులు వస్తే అక్కనుంచి వెళ్ళిపోయాడు.

తర్వాత అక్క చెల్లెళ్ళిద్దరు ఇంటికి బయలు రారు.

ఆ తల్లి కూతుళ్ళు చేసేఆదరణ, సలహాలు, ఆ అక్కా చెల్లెళ్ళకు మందులు ఇవ్వలేని ఉత్సాహాన్ని కలిగిస్తాయి. అందు వచ్చి కాసేపు కూర్చుని వెడుతుంటారు. తోబుట్టువులులేని కార్తీక కూడా వారివల్ల సంతోషపడుతుంది. అందు తరచు వాళ్ళిద్దరిని కలుసుకోవాలను

కుంటుంది. చెప్పలేని ఆనందం కలుగుతుంది.

* * *

పరీక్షలు ప్రారంభమయ్యాయి. కార్తీక ఎంతో శ్రద్ధగా చదువు తోంది. ఆరోజు పొలిటికల్ సైన్సు పేపరు. రాత్రి పన్నెండు గంట లయింది. మాల, కుసుమ హడావిడిగా వచ్చి తలుపు తట్టారు.

తలుపు తీసిన కార్తీక ఇద్దర్ని చూసి ఆశ్చర్యపోయింది.

"కార్తీ! పేపరు ఔటయిందిట! ఇదిగో పేపరు!" అందించింది మాల!

పేపరా! ఎలా అవుటయింది? పైగా మీకెలా దొరికిం ?" ఆశ్చ ర్యంగా అడిగింది కార్తీక.

"సెంటర్‌లో అందరూ రాసుకుంటున్నారుట! మా అన్న చూసి రాసుకొచ్చాడు," కుసుమ చెప్పింది.

"నిన్న కూడా హిస్టరీ పేపరు అవుటయింది. పేపరు పేపరులా వచ్చిందట" మనకు తెలీదు? ఈరో- నా తెలిసింది." మాల అంది.

ముగ్గురు కూర్చుని పేపరు చదువుని సమాధానాలు చూసు న్నారు. అప్పటికే రాత్రి ఒంటిగంట అయింది.

"కార్తీ! బాగా చదువుకో? మేం వెడతాం!"

"కాస్త టీ తాగం "

అంతలో సర్వయ్య అందరికీ టీ లు పట్టుకొచ్చి ఇచ్చాడు.

"ప్రాణం లేచి వచ్చిందే" అంది మాల.

"తాగితే మీ సర్వయ్య టీయే తాగాలి!" అంది కుసుమ.

"అవునూ అడగటం మర్చిపోయాను, మీరెలా వచ్చారే?"

"ఎలా రావటం ఏమిటే మా తమ్ముణ్ని సాయం తీసుకొచ్చాం! లోపలి రమ్మంటే రానని ఈ వీధిలోవాళ్ళ స్నేహితుడున్నాడట!అక్క

తకు వెళ్ళాడు. కుసుమ సమాధానమిచ్చింది.

ఇద్దరూ ఇంటికి బయలుదేరారు.

వాళ్ళు వెళ్ళాక కార్తీక అసలు నిద్రపోలేదు. అలా చదువుతూనే ఉంది. అలా చదివేటప్పుడు ఆమెకు మధ్య మధ్యలో అభిరామ్ రూపం ఎదురుగా వచ్చి పలకరిస్తూ ఉంది. అతని చిరునవ్వు మైమరపిస్తూ ఉంది. ఆ ఆనందంలో కార్తీక మరింత బాగా చదువుతోంది.

ఎప్పుడు నిదపట్టిందో తె దు. మెళకువవచ్చేటప్పటికి తెల్లవారింది.

ప్రకాంత్ పేపరు చదువుతూ "కార్తీ! కార్తీ!" అంటు అరిచాడు:

"ఏంబావా! ఏం జరిగింది" కార్తీ హడావిడిగా వచ్చింది.

"ఏం జరిగింది బాబూ" అంటూ శ్యామసుందరీదేవి వచ్చింది.

"ఏంలేదు, ఈ వార్త విన్నారా," నిన్న రాత్రి సెంటర్‌లో పేపరు అము తున్న ముఠా పట్టివేత!" హెడ్డింగు చదివాడు.

"ఏమిటి బావా వివరంగా చెప్పు!"

"నిన్నరా తి డిగ్రీ తరగతి పొలిటికల్ సైన్సు పేపరు అవుటు చేసిన ముఠాను అరెస్టు చేశారు.

"ఇప్పుడెలా? ఈరోజు పరీక్ష ఎలా జరుగుతుంది బావా?"

"జరగడానికేముంది. తిరిగి పేపరు కొత్తది తయారుచేస్తారు?"

"అయినా చదువుకోనివాళ్ళకు గాని నీలా శ్రద్ధగా చదువుకువాళ్ళకు భయమేమిటి కార్తీ!"

"అదేంలేదు. పరీక్షకు టైంఅవుతోంది!" అక్కడనుంచి కదిలింది కార్తీక.

ఉదయం 8 గం॥ పరీక్షలు ప్రారంభమవుతున్నాయి.

"అందుకే కార్తీక గబగబా తెమిలి బయలుదేరింది. డ్రైవరు లేడు. ప్రకాంత్ కారు తీసుకుని వచ్చాడు.

పరీక్ష హాల్లో అడుగుపెట్టింది కార్తీక. నెంబరు చూసుకుని

కూర్చుంది.

ఎగ్జామినర్ పేపరు చేతిలో పెట్టాడు. ఇటుఇటు తిప్పి చూసింది. తను రాత్రి చదివిన ప్రశ్నలు ఒక్కటీ లేవు. ఇంతలో మాల, కుసుమ హాల్లోకి వచ్చి తమతమ నెంబర్లు చూసుకుని కూర్చున్నారు.

ఇద్దరికి పేపరు చూడగానే కళ్ళు తిరగడం ప్రారంభించాయి. "ఏమిటిది మాలా! పేపరిలా ఉంది!" కార్తీక కంగారుగా అడిగింది.

"పేపరు రాత్రి అవుటయిందని రాత్రికి రాత్రి సైక్లోస్టయిల్ తీయించి కొత్త పేపరు ఇచ్చారట. ముందు వరుసలోంచి ఒకళ్ళు అన్నారు.

"అవును. ఇది ప్రింటుకాలేదు. అందుకే కాబోలు" మరి ఒకరి సమాధానం.

పేపర్లోని ఒక ప్రశ్నకు సరిగా సమాధానం రాయలేకపోయారు అందరు కూడా.

అంతబాగా చదివిన కార్తీకకూడా ఆ గందరగోళంలో ఏమీ జ్ఞప్తికిరాక సరిగా రాయలేకపోయింది.

ఇంతలో ఒకళ్ళు లేచి పేపరు చాలా కష్టంగా ఉంది. కొన్ని ప్రశ్నలు సిలబస్‌లో లేనివి ఇచ్చారు. మనం ఆన్సర్ చెయ్యకుండా బోయ్‌కాట్ చేద్దాం. అనగానే అందరూ లేచి "అదే కరక్టు నడవండి!" అంటూ అరిచారు. తరువాత ఒక్కొక్కళ్ళే బయటకు రావడం ప్రారంభించారు.

కార్తీక, మాల, కుసుమ కూడా ఏంచెయ్యలేక బయటకు వచ్చేశారు.

అంత బాగా చదివినా పరీక్ష రాయలేకపోయినందుకు కార్తీక చాలా బాధపడింది. క్లాసు తప్పకుండా వస్తుందనుకుంది. ఈసారి ఫెయిల్ అవడం కాయమనుకుంది. మిగిలిన పేపర్లన్నీ ఏ హడావిడి లేకుండా బాగా- జరిగాయి. కాని కార్తీక అనుకున్నంత బాగా రాయలేకపోయింది.ఏదో నిరుత్సాహంఆవరించింది. ఆరోజు పేపరు తిరిగి పెట్టమని విద్యార్థులంతా కలిసి రిప్రజెంటు శారు. అందరికి ఏదో ఆశ

మిణుకుమిణుకుమంటోంది. కాని యూనివర్శిటీవారు అంగీకరించలేదని రేడియోలోను, పత్రికల్లోను కూడా వార్త వచ్చింది. ఫేలవుతానని నిర్ణయించుకుంది కార్తీక.

ఈలోపుగా యూనివర్శిటీకి కొత్త వైస్ ఛాన్సలర్ రావడం జరిగింది. కొత్త వైస్ ఛాన్సలర్ వచ్చారు. విద్యార్థులు. మళ్ళ వెళ్ళి ఒక అప్లికేషన్ పెట్టారు. సిలబస్‌లో లేని ప్రశ్నలు ఇవ్వడం వల్ల వెంటనే పరీక్ష మళ్ళీ పెడుతున్నామని యూనివర్శిటీవారు తెలియజేశారు.

ఆరోజు విద్యార్థుల సంతోషానికి అంతులేదు. తిరిగి అందరూ పరీక్షలు వ్రాశారు. ఆ పేపరు బాగానే ఆన్సరు చేయగలిగారు విద్యార్థినీ విద్యార్థులంతా.

"కానీ కొంతమంది విద్యార్థులు పేపరురాస్తూ కాపీ చేశారని పట్టుకున్నారు. జేబుల్లో, బూట్లలోపల, ఫ్యాంటులోపల అంతటా చిన్న చిన్న కాగితాలమీద రాసి అంటించుకున్నారని పరీక్ష హాలులోనుంచి బయటకు పంపించారు. వాళ్ళు కూడా సామాన్యులు కారు. కత్తులు చూపించి హాలులో అందరిని బెదిరించారు. అంతలో పోలీసులు వచ్చి వాళ్ళను తీసుకువెళ్ళారు. తర్వాత మిగిలినవారు పరీక్ష పూర్తిచేశారు

కాని కార్తీక రాసిన సెంటర్లో అల్లర్లు ఏమీ జరగలేదు. కార్తీక సంతోషంతో ఇంటికి తిరిగివచ్చింది. ఈ విషయాలన్నీ విన్న శ్రీకాంత్ ఆశ్చర్యపోయాడు. విదేశాలు చూసి తిరిగివచ్చిన అతనికి మన విద్యా విధానం, ఈ కాపీకొట్టే పద్ధతులు పరీక్షా విధానం, అన్నీ మారడం అవసరమేమో అనుకున్నాడు. ఆ మాటే కార్తీకతో అన్నాడు. కార్తీక వాటిని కొట్టినేస్తూ "పో బావా: నీవన్నీ ఫారిన్ ఆలోచనలే. ఇక్కడి పద్ధతులేమి నీకు నచ్చవు" అంది.

అదేమిటి కార్తీ! నావి ఫారిన్ పద్ధతులుకావు. నువ్వు ఏదిచెప్పినా ఆలోచించవు? నీ ధోరణి నీ . అది మంచిపద్ధతి కాదు.

"పోనీలే బావ నాది ఏ పద్ధతైతే ఏంకాని మన రోహిణీ వాళ్ళు ఎందుకు మనింటికి రాలేదంటావు? అని అడిగింది. లోపల అభిరామ్

అడిగింది.

"నాకేం తెలుసు? అవునూ! మన రోహిణి అంటున్నావు. మన అభిరామ్ అంటే బాగుండేదేమో!" అన్నాడు. కార్తీక మనస్సులో ఏముందో ఇట్టే గ్రహించాడు.

"పో బావా! నీకెప్పుడూ అభిరామ్ సంగ , -ను రోహిణి సంగతి అడుగుతున్నా!"

"నాకేం తెలుసు రోహిణి సంగతి? నీకే అభిరామ్ సంగతి తెలియాలి."

"ఆరోజు అభిరామ్ మీ యింటికి రేపు వస్తున్నాము!" అన్నాడు. కాని ఇంతవరకు రాలేదు. పైగా ఎక్కడా కనబడలేదు.

కార్తీకకు మనస్సులో ఏంతోచలేదు. వాళ్ళింటికి వెడితే బాగుండదు. ఫోన్ చేస్తే రోహిణి ఎత్తి బాగుండదు. ఎటు ఆలోచించ లేకపోయింది కార్తీక.

"కార్తీ! ఏమిటి ఆలోచిస్తున్నావు అభిరామ్ సంగతా!" మాట్లాడ కుండా కూర్చున్న కార్తీకను అడిగాడు శ్రీకాంత్.

శ్రీకాంత్ రోహిణిని కలుస్తూ ఉన్నాడు. కాని పైకి కార్తీక ఏమైనా అనుకుంటుందని చెప్పలేదు.

ఇంతలో ఫోను గణ గణా మోగింది. శ్రీకాంత్ సుకున్నాడు.

కో శ్రీకాంత్ కావాలి?"

"-ను శ్రీకాంత్‌నే! ఎవరూ? అభిరామా!" గొంతుక గుర్తుపట్టి ,గాడు.

"అవును త్వరలో మీ యింటికి-వస్తున్నాము. కార్తీక పరీక్షలు బాగా రాశారా!"

"చాలా బాగా రాసింది. ఏదో ఒక పేపరు ఆరోజు అవుటయిం దని క్యాన్సిల్ చేశారు. ఈరోజు జరిగింది. రేపు రండి తప్పకుండా"

వస్తున్నాము. కార్తీక గారిని పరీక్షల్లో వచ్చి ఇబ్బంది పెట్టడం ఇష్టం లేక ఇన్నాళ్ళు మీ యింటికి రాలేదు."

"అలాగా! తప్పకుండా రండి" అన్నాడు పైకి. లోపల కార్తీక పరీక్షలు అయి పీడికెందుకో కాకపో ఎందుకో రోగ్" అనుకున్నాడు.

తర్వాత ఫోన్ పెట్టేశాడు.

"ఎవరు బావా!?

"ఎవరేమిటి? మీ అభిరామ్‌గారు దయచేస్తున్నారు. ఇన్నాళ్ళు తమరి పరీక్షలని రాలేదుట."

"ఈరోజు వస్తున్నారా" ఇం మనకుండా. అక్కడనుంచి లేచింది కార్తీక,

ఆ సంతోషం పట్టుకోలేక తల్లి దగ్గరకు వెళ్ళి "అమా ! అమ్మా! ఈరోజు సాయంకాలం మనింటికి అభిరామ్, రోహిణి వాళ్లు వస్తున్నారు! అంది గుక్క తిప్పుకోనుండా.

వెంటనే తల్లి ఇచ్చే సమాధానం వినకుండా ఉత్తర వాళ్ళ ఇంటికి పరుగెత్తింది.

కార్తీక కంగారు, దాచుకోలేని సంతోషం చూసిన శ్రీకాంత్ శ్యామసుందరీదేవి ఆశ్చర్యపోయారు.

"పిచ్చి పిల్ల! ఇంటికిఎవరొస్తారా! అని మొహం వాచి ఉంటుంది!" అనుకుంది తల్లి.

శ్రీకాంత్‌కి మాత్రం అభిరామ్ మీద చెప్పలేని ద్వేషం పెరగడం మొదలు పెట్టింది.

* * *

అప్పటికి రెండు ఆదివారాలు గతించాయి. స్వాతికి ఎందుకో రాజాతో కలియపడ్డానికి మనస్సు అంగీకరించడం లేదు, అందు ఏదో

వంక పెట్టి తప్పించుకుంటోంది. అక్కగారితో కూడా చెప్పలేదు. అక్కడ కూడా ఎవరు అంతగా పట్టించుకోలేదు.

కాని ఒక ఆదివారం ఉదయం స్వాతి మామూలుగా, క్లాసుకి బయలు రి వెళ్ళింది!

"ఏం అమా ! వచ్చావా స్వా , ఆ రాజా స్నేహితులు ఒకటే అడుగుతున్నారు! ఏం చేస్తావు?" అని అడిగాడు.

ఇంతలో అక్కడికి వచ్చిన రాజా స్నేహితుడు గోపీ "కరాటే రాణీ గారికి పాపం భయంగా ఉన్నట్టుందిరా, రాజా వది వయ్యా:" అన్నాడు.

"అప్పను రాజా, పాపం ఆడకూతురు కదయ్యా, కాస్త దయతల చాలి! ఎంతైనా ఇండియా కదా!" అన్నాడు రమేష్.

"రాజా, అలా అనడానికి వీల్లేదు, పందెమంటే పందెమే, కరాటే రాణీగారు ఓడిపోయ్యానని మన ఎదుట చెబి నె వదిలెయ్యాలి" అన్నాడు చక్రవర్తి.

"అనకేం చేస్తుంది, రాజా కాస్త దయ తలచాలయ్యా" అన్నాడు తిరిగి రమేష్.

రాజా స్వాతి వైపు చూశాడు, అతని కోపంగా చూస్తున్న స్వాతికి మరింత కోపం వచ్చి పట్టుదల పెరిగింది.

"మేష్టారు! ఇప్పు పదర్శన ఏర్పాటు చేయండి.' అంది స్వాతి.

"ఏం రాజా, నువ్వేమంటావు." అడిగాడాయన.

". ను ఎప్పుడూ రె సార్" అన్నాడు రాజా.

ఇద్దరు వచ్చి నిలబడ్డారు రంగస్థలంలో, మేష్టారు సంజ్ఞ చెయ్యగానే ఇద్దరు కలయబడ్డారు!

ఆమె కట్టుకున్న వస్త్రాలవల్ల కాని ఆమె సే పదర్శనవల్ల కాని ఆమె ఆడపిల్లని ఎవరు పోల్చుకోలేరు. సుశిక్షితులైన వారివలె

ఇద్దరు ఎదుర్కొంటున్నారు.

ఆమె నేర్పరి తనానికి రాజా ఆశ్చర్యపోయాడు. ఆమె మీద చెప్పలేని అభిమానం ఏర్పడింది కాని ప్రత్యర్థి అవడంవల్లపోరాడవలసి వస్తోంది.

రాజా స్నేహితులు కూడా ఆమెను చూసి ఆశ్చర్యపోయారు. ఎవరు రాజాయో ఎవరు స్వాతో గుర్తించలేకపోతున్నారు.

అతని వైపు వచ్చినపుడు అతని పక్షం వాళ్ళు ఆమె వైపు వచ్చినపుడు ఆమె పక్షం వాళ్ళు చప్పట్లు కొడుతూ కొత్త ఉత్సాహాన్ని కలిగిస్తున్నారు.

ఇద్దరికి పోరాటం సాగుతూ ఉంది. ఇద్దరూ అలసినట్లు కనబడుతున్నారు.

శివమెక్కిన రెండు కోడి పుంజుల్లా రెండు పొట్టేళ్ళలా ఎగబడుతున్నారు.

అది చూసిన మాష్టారు ఇద్దరిని ఆపుచేశారు.

"రాజా! ఆవిడ నేర్పరి అని ఒప్పుకుంటావా!" అడిగారాయన.

"ఎప్పుడో తెలిసింది." అన్నాడు ముక్తసరిగా.

"ఏదో ఆడపిల్ల కదా అని వదిలేశాడండి రాజా, లేకపోతే తుక్కుకింద కొట్టేవాడు." గోపీ అన్నాడు.

"ఆ! ఆ! కొట్టేవాడు సోడాబుడ్డిని." అన్నారు స్వాతి స్నేహితులు.

అందరిని ఆపుచేశారు మేస్టారు.

రాజా అక్కడనుంచి స్నేహితులతో కదిలాడు. అలా వెళ్ళేటప్పుడు ఒక్కసారి స్వాతి ముఖంలోకి దీర్ఘంగా చూశాడు.

ఆ చూపుల వేడిని భరించలేకపోయింది స్వాతి. ఒక్కసారి తలదించుకుంది. తర్వాత స్నేహితులతో ఆమె కదిలింది.

అందరు ఎవరి దారిన వాళ్ళు వెళ్ళిపోయారు. స్వాతి ఇంటి వైపుకు దారితీసింది.

* * *

అప్పటికే మధ్యాహ్నం పన్నెండు గంటలయింది. రోడ్డుమీద ఎక్కువ జనసంచారంలేదు. వచ్చిపోయే వాహనాల చప్పుళ్ళు ఎక్కువగావినబడుతున్నాయి. స్వాతి బిక్కర్తై నడుచుకుంటూ పోతోంది.

వెనక అడుగుల చప్పుడు వినబడింది. ఎవరో తన మీ॥ నడుచుకుంటూ వెడుతూ, ఉంది స్వాతి. అంతలో ఆ చప్పుడు మరింత దగ్గరయింది. అయినా స్వాతి తలతిప్పి చూడలేదు. తన రాకను తెలిసేటట్టుగా ఆ ఆకారం దగ్గింది. తలతిప్పింది స్వాతి. రాజా కనబడ్డాడు.

అతని వెనకే వచ్చిన గోపీ "కరాటే రా॰ గారు అలసిపోయినట్టున్నారు!" అన్నాడు.

"షటప్." అరిచింది స్వాతి.

"యు షటప్. అన్నాడు రాజా.

స్వాతికి కోపం ఆగ-దు. ముందు వెనక చూడకుండా ‌యు రాస్కెల్." అంది.

వెంటనే రాజా ఆమె చెయ్యిఅందుకుని "ఇప్పుడు చెయి ఫైటింగ్" అన్నాడు.

"చేస్తా! బాగా చేస్తా!" అంటూ కుడిచెయ్యి ఎత్తి రాజా దవడ పగిలేటట్టు - సింది.

కంచుచెంబు బండరాయిమీద విసరికొట్టినంత చప్పుడయింది. అదరిపడ్డారు స్నేహితులు. అనుకోని సంఘటనకు తెల్లబోయాడు రాజా!

వాళ్ళు రకు- లోపలే స్వాతి గబగబా నడుచుకుంటూ వెళ్ళిపోయింది.

గుమ్మంలోనె ఉత్తర ఎదురై "ఇంత ఆలస్యమయిందే స్వా !" అంటూ అడిగింది.

ముందు చెబుదామా? మానదామా? అనుకుంది. తర్వాత జరిగిన దంతా చెప్పింది. ఉత్తర చెల్లెలి ధైర్యానికి ఆశ్చర్యపోయి మెచ్చు కోకుండా ఉండలేకపోయింది. కాని లోపల కాస్త భయపడింది.

ఒకనాడు కరాటె పురుషులకు మాత్రమే అనుకున్నారు. కాని ఈనాడు ఆడపిల్లలు కూడా ఆ విద్యలో ఆరి రుతున్నారు.

కాని ఉత్తర చెల్లెలు చెప్పినదంతా విన్న తరువాత "స్వా ! నువ్వు తొందవపడ్డావు? అతని జోలికి వెళ్ళకుండా ఉండవలసింది. వాళ్ళు నిన్ను అంత లిగ్గా ఒదలరనిపిస్తోంది!" అంది భయపడుతూ!

"అనవసరంగా భయపడుతున్నావక్కా. నేను వెళ్ళేది అక్క డి . తర్వాత స్కూలుకి, అంత భయమెందుకు? నన్ను వాళ్ళు ఏమి చెయ్య- రు?" అంటూ అక్క మాటలు తేలిగ్గా కొట్టిపారేసింది స్వాతి.

చెల్లెలు అలా అన్నా ఉత్తర మనస్సులో భయపడుతూ ఉంది. స్వాతి మాత్రం తను రాజాతో చేసిన పోటీని తలుచుకుని తన విజయ నికి , ర్పరితనానికి సంబరపడుతూ హాయిగా గుండెలమీద చెయ్యి - స కుని ని దపోయింది.

*　　　*　　　*

ఆరోజు ఉదయం అభిరామ్ మ ్ళ ఫోన్ చేశాడు. సాయంకాలం వస్తున్నామని.

ఆరోజు సాయంకాలం అయిదింటికల్లా అభిరామ్, రోహిణి, అన్నపూర్ణమ వచ్చారు. కార్తీక సంతోషానికి అంతులేదు. ఉదయం

నుంచి ఎదురుచూస్తుంటే ఇప్పటికి ఎదురుగా నిలబడ్డాడు అభిరామ్.

అతనికేసి సూటిగా చూడలేకపోయింది కార్తీక. చూడకుండానూ వుండలేకపోయింది. ఆ స్థితిలో ఉన్నాడు అభిరామ్ కూడా.

'హాయ్ శ్రీకాంత్' అంటూ షేక్‌హాండ్ అందిచ్చింది రోహిణి. 'హాయ్ రోహి' అంటు అందుకున్నాడు ఆ చెయ్యి శ్రీకాంత్.

అన్నపూర్ణమ గారిని పలకరిస్తున్న శ్యామసుందరీ వి వాళ్ళిద్దర్ని తెల్లబోయి చూసింది. ఫారిన్‌లో ఎక్కడో అలాగే షేక్ హాండ్లు ఇస్తారని వింది. కాని ఇక్కడ అలా ఉండటం ఆవిడకు నచ్చలేదు. పైగా ఆ పిల్ల కార్తీకను పలకరించకుండా శ్రీకాంత్‌నే పలకరించడం చూసి ఆవిడ సహించలేకపోయింది.

"శ్రీకాంత్! అభిరామ్‌నీ వాళ్ళని లోపలికి సుకురా!" అంది. అప్పటికైనా ఆ అమ్మాయిని వదులుతాడని.

అది గ్రహించిన అన్నపూర్ణమ గారి మనస్సు చివుక్కుమంది.

అందర్నీ పలకరించిన కార్తీక ముందుగా ఇల్లంతా చూపించింది.

హాల్లో ఖరీదైన సోఫాలు, గోడలకు ఖరీదైన పెయింటింగ్స్, 'లుపులకు రంగులు, ఎంతో అందంగా ఉన్నాయి: చూడగా, ధనతులని పోల్చుకోవచ్చు. అన్నీ ఎంతో కుతూహలంగా చూసింది న్నపూర్ణమ్మగారు.

అభిరామ్ కార్తీక వెన వస్తున్నాడు. అందరూ ఏదో మాట్లాడుకుంటున్నప్పుడు కార్తీకను ప్రత్యేకంగా పలకరించాలని అతని ఉద్దేశ్యం.

"ఇన్నాళ్ళు కనబడలేదు!"

"నేను అదే అనుకున్నా!"

"ఫోనైనా చెయ్యలేదు."

ఆమె మనస్సు తెలుసుకున్న అభిరామ్ "ఎవరేనా రిసీవర్ ఎత్తితే బాగుండదని" అన్నాడు తిరిగి మ ౹.

"పరీక్షలు ఎలా రాశారు?" అడిగాడు.

"ఫరవాలేదు పాస్ అయిపోయాతాను!"

"ఫర్‌దర్ స్టడీస్ చేస్తారా!"

"బహుశా చేస్తాను, మా అమ్మగారు మానమన్న మానను. బతిమా-నా ఒప్పిస్తాను?"

ఇంతలో వెనక నుంచి వాళ్ళు కలవడంతో ఇద్దరు టాపిక్ మార్చేశారు.

ఇద్దర్ని చూస్తూనే ఉంది శ్యామసుందరీదేవి. అతని చనువును కూడా ఇట్టే పసికట్టింది.

ఇల్లు చూసి అన్నపూర్ణమ్మగారు ఎంతో మెచ్చుకున్నారు. తర్వాత అందరూ గార్డెన్‌లోకి వచ్చి కూర్చున్నారు.

గార్డెన్ ఆసక్తిగా చూస్తున్న అభిరామ్‌తో."మీ గార్డెన్ అంత పెద్దది కాదులెండి" అంది కార్తీక.

"పెద్దా చిన్నా దేనికిలెండి, మీ గార్డెన్‌లో పూలమొక్కలు ఎక్కువున్నట్లు కనబడుతున్నాయి. కొన్ని కూరగాయలు, ఆకుకూరలు మొదలైనవి కూడా వెయ్యవలసింది. ఇదిగో ఆ టాప్ దగ్గర అరటి వెయ్యవలసింది. ఆ పక్కన కొబ్బరి వెయ్యాలి. అక్కడ విశాలంగా పెరిగినా ఏ పూల మొక్కలకి అడ్డురావు" అన్నాడు అభిరామ్.

అతని అభిరుచులు, అతని పెంపకంపైగల ఔర్సరితనం పసిగట్టి శ్యామసుందరీదేవి ఆశ్చర్యపోయింది. "ఇంటికి అన్నివిధాల యోగ్యుడైన వాడు. అనుకుంది మనస్సులో.

తర్వాత అందరూ కుర్చీల్లో కూర్చున్నారు.

అన్నపూర్ణగారు, శ్యామసుందరీదేవిగారు ఒకపక్కగా కూర్చున్నారు. పిల్లలు నలుగురు కాస్త దూరంగా కూర్చున్నారు. పేకాట ఆడాలని శ్రీకాంత్, రోహిణి అనుకున్నారు.

ఇంతలో సర్వయ్య టిఫిన్ ప్లేట్లతో వచ్చాడు!

అభిరామ్ ఇంట్లో అభిరామే స్వయంగా అందరికి ఇవ్వడం గుర్తు కొచ్చిన కార్తీక అందరి త, అందించింది.

అభిరామ్ ఎంతో ఆప్యాయంగా అందుకున్నాడు. అన్నపూర్ణమ గారు కూడా కార్తీకను చూసి ఎంతో సంబరపడ్డారు.

కాఫీ టిఫినులు పూర్తి అయిన తర్వాత కార్తీకకు పేకాట ఆడా లనిపించలేదు. తల్లి పక్కకు వచ్చి కూర్చుంది.

్రకాంత్ ఎన్నోసార్లు పిలిచాడు. అయినా కార్తీక కదల్లేదు.

అన్నపూర్ణగారు ఏదైన పాటపాడమని అడిగింది.

"డాన్సు నేర్చుకున్నానండి పాటలు అట్టేరావు." అంది.

"ఏది వస్తే అ పాడమ్మా." అడిగింది అన్నపూర్ణమ్మగారు.

"కార్తీ! ఏదో ఒకటి పాడమ్మా! అంత బతిమాలించుకో కూడదు?" అంది తల్లి.

సంగీతం ర్చుకోకపోయినా లైట్ స్సాంగ్సు బాగా పాడు తుంది కార్తీక.

వారి సంభాషణ విన్న రోహిణి సినిమా పాట ఏదైనా పాడమని కిగింది.

శివరంజని సినిమాలోని "అభినవ తారవో!" అంటూ అందు ంది.

తిలోని పేక ముక్కలు అక్కడ ప సి అభిరామ్ తల్లి పక్కకు చేరాడు. కార్తీకకు పాటలు కూడా వచ్చని అతనికి తెలీదు. అతనికి పాటలన్నా ఎంతో ఇష్టం.

పాట పాడుతూ మధ్యమధ్యలో అభిరామ్‌ని సాదరంగా చూస్తోంది కార్తీక!

ఆ పాట తనకోసమే పాడుతోందనుకున్నాడు అభిరామ్. అతని మనస్సు ఏదో లోకాల్లో సంచరిస్తోంది! తెలియని ఆనందం అంతులేని

తడబాటు.

అన్నపూర్ణమ్మగారు కూడా ఎంతో సంతోషపడింది.

రోహిణి. అన్నగారు అక్కడ లేనందుకు శ్రీకాంత్‌తో హాయిగా మాట్లాడవచ్చనుకుంది.

కార్తీక పాట ఆపగా మత్తు నుంచి రుకున్న అందరు చప్పట్లు కొట్టారు.

"అన్నయ్యా! ఇప్పుడు నీ వంతు." అంది రోహిణి.

"ప్లీజ్ పాడండి." అంటూ పట్టుబట్టింది కార్తీక.

తూర్పు పడమరలోని 'శివరంజని' అంటూ మొదలుపెట్టాడు.

సినిమాలో బాలూయే అనిపించింది అందరి .

కార్తీకకు మాత్రం ఆ పాట తనకోసమే పాడుతున్నాడనుకుంది. అతని ఒడిలోకి వెళ్ళివాలాలనుకుంది.

శ్యామసుందరీ వికి అతని పాట ఎంతో నచ్చింది.

ఒక్క శ్రీకాంత్‌కే అతని ధోరణి నచ్చలేదు. మధ్యమధ్యలో కార్తీక చూడ్డం అతనికి అసలు నచ్చలేదు. ఆమెను వలలో సుకో డాని అతను అన్ని మాయలు పన్నుతున్నాడని అతని ఊహ. పైగా కార్తీక అత న్ని చూడ్డం మరీ చిరాకనిపించింది.

"మేనత్తతో చెప్పి ఆమెను మందలించాలి. అభిరాంని యీ ఇంటికి రాకుండా చెయ్యాలి." అనుకున్నాడు.

అభిరామ్ పాట ఆపగా "చాలా బాగా పాడావయ్యా! సినిమాలో నువ్వే పాడావనిపించింది" అంది శ్యామసుందరీ వి.

"చాలా బాగా పాడారం . పైగా ఆపాట నాకు చాలా నచ్చిన పాట!" అంది కార్తీక.

"థాంక్యూ!" అన్నాడు అభిరామ్ ఆమె కళ్ళల్లోకి సూటిగా చూస్తూ.

ఇంతలో సర్వయ్య అందరి లస్సీ గ్లాసులు అందించాడు.

"సమయానికి పట్టుకొచ్చావు సర్వయ్యా!" అన్నాడు శ్రీకాంత్.

అభిరామ్ మనస్సు కార్తీకపై అల్లుకుంది. ఆమె ఎదురుగా ఉండబట్టే అంత తన్మయత్వంతో పాడాననుకున్నాడు.

లస్సీ తాగడం పూర్తి చేసి గ్లాసు అక్క పెట్టి లేచాడు అభిరామ్. చెట్లవైపు నడిచాడు.

శ్రీకాంత్ రోహిణీలు పేకాటలో మునిగారు. పెద్దవాళ్ళు ఇద్దరూ కబుర్లలో వున్నారు. కార్తీక కూడా మెల్లిగా లేచి అభిరామ్ వెన వెళ్ళింది. అక్కడ నిలబడితే ఒత్తుగా వున్న చెట్ల మూలంగా ఎవరూ కనబడ్డంలేదు.

"కార్తీకగారూ!" అంటూ ఆమె చేయి అందుకున్నాడు.

కార్తీక నోటికి మాటే రాలేదు. చేతిని విడిపించుకోలేదు. ఆ చేతిని నోటివరకు సుకొచ్చి ఒక్కసారి ముద్దుపెట్టుకుని వదిలేశాడు.

"మళ్ళీ ఎప్పుడు దర్శనం!"

"ఇలా.." అంటూ అతని చేతిని సుకుని ఒకసారి తన గుండెలకు హత్తుకుంది కార్తీక.

అదుపు దాటిన అభిరామ్, రెండు చేతులతో ఆమెను బంధించబోయాడు. "ఇప్పుడేనా!" అంటూ పారిపోయి వచ్చేసింది కార్తీక.

అభిరామ్ పట్టరాని ఆనందంతో వీధిగేటు వైపు వెళ్ళిపోయాడు.

కార్తీక తిరిగి వస్తుంటేచూసిన శ్రీకాంత్ ఆశ్చర్యపోయాడు. కోపం పొంగి వచ్చింది. అయినా అదుపులో పెట్టుకున్నాడు.

"కార్తీ! అభిరాం ఏడి!" మామూలుగా ఉండాలని అడిగాడు.

"నాకు తె దు వెళ్ళిపోయా మో." అంది

ఆమెలోని తడబాటు గమనించలేకపోలేదు శ్రీకాంత్.

అభిరాం స్పర్శతో కలిగిన గగుర్పాటు సర్దుకోలేదు కార్తీకలో. నిలబడలేక వచ్చి తల్లి పక్క కుర్చీలో కూర్చుంది.

అప్పటికే సూర్యాస్తమయం అయింది. చీకటి మెల్లగా లోకంలో అడుగు పెడుతోంది. శ్రీకాంత్ అనుమానంతో అభిరామ్ ఎక్కడికి వెళ్ళాడో చూడాలని లేచాడు. అటు ఇటు చూశాడు ఎక్కడా కనబడ లేదు. "నిజంగా కార్తీక చెప్పినట్టు వెళ్ళిపోయి ఉంటాడు." అనుకున్నాడు. మనస్సు కుదుటపడింది. కార్తీక చెప్పినది నిజమే అనిపించింది.

"అన్నపూర్ణమ్మగారు "ఇక వెడదాం రోహి ! అన్నయ్యే ఏ ." అడిగింది.

"ఇక్క ఎక్కడో ఉంటాడులే!' అంది.

"మీరుకూడా మా యింటికి రావాలి!" అంది అన్నపూర్ణమ గారు.

"అలాగేనం . తప్పకుండా వస్తాను!" సమాధానమిచ్చింది శ్యామసుందరీదేవి.

"ఆంటీ వెడతామండీ" అంది రోహిణి.

"మంచిదమ్మా!" అంది పైకి శ్యామసుందరీ వి. మనస్సులో మాత్రం "నువ్వింక రాకుతల్లీ" అనుకుంది. ఆమె షభాషలు ప్రకాం తో అంత చనువు ఆవిడకు ఏమాత్రం నచ్చలేదు.

అందరూ వీధిల్లోకి వచ్చారు.

అక్కడ గేటును పట్టుకుని దీర్ఘంగా ఆలోచిస్తున్న అభిరామ్ కన బడ్డాడు.

అతని ఆలోచనలన్నీ కార్తీకచుట్టూ ఉన్నాయి. ఆమెను చూడకుండా ఉండలేడు. ఆమె పాట పాడుతున్న దృశ్యం, తన దీర్ఘంగా చూసిన చూపులు, ఆమె తన చేతిని అందుకున్న దృశ్యం. అలా సినిమా రీలులా కళ్ళముందు తిరుగుతున్నాయి. అలాగె ఉండిపోయాడు.

ఆ మధుర దృశ్యాలలో లీపోతున్నాడు.

"అభిరామ్ ఇక వెడదామా!" అడిగింది తల్లి.

ఆ పిలుపు వెళ్ళి అతని హృదయానికి తగిలింది. కళ్ళముందున్న కలలన్నీ చెల్లాచెదరైపోయాయి.

"మీ కోసమే చూస్తున్నా!" అంటూ "వెడతాం ఆంటీ, వెడతాం ్రకాంత్" అన్నాడు అభిరామ్.

"మంచిదిబాబూ, ఎప్పుడైన వస్తూండు!"అంది శ్యామసుందరీ వి.

కార్తీకకు మాత్రం నోటితో చెప్పలేక కళ్ళతో వెళ్ళిపోతున్నానని సంజ్ఞ చేసాడు.

ఆమెకూడా చూపులతో సమాధానమిచ్చింది.

అతను వెళ్ళిపోవడం ఇష్టంలేదు. కాని ఆగమని చెప్ప-క పోయింది.

కారు స్టార్టుచేశాడు. తల్లి, రోహిణి వెనకసీట్లో వచ్చి కూర్చు ్నారు.

చివరసారిగా కార్తీక సి చూశాడు.

ఎటబాటును సహించలేని బాధ అంతా కళ్ళలో గూడుకట్టు న్నట్టుగా ఉన్నాయి ఆమె చూపులు. ఇందాకటి కాంతిలేదు. ఆమె ుఖంలో ఏదో దీనత్వం కనబడుతోంది. ఆ కళ్ళలో ఏదో అభ్యర్థన నబడుతోంది.

అందు మనస్సును ఆమెకే వదిలేసి బయలుదేరాడు అభిరామ్.

చేయి ఎత్తి 'టాటా' అంది కార్తీక. నవ్వుకున్నాడు అభిరామ్.

'టాటా' అంది రోహిణి.

"టాటా" అన్నాడు శ్రీకాంత్. కారు వెళ్ళిపోయింది.

"అన్నపూర్ణమ్మగారు చాలా మర్యాదస్తురాలు. అభిరామ్ ఆ త నోట్లోంచి ఊడిపడ్డట్టు వున్నాడు." అంటూ లోపలికి నడిచింది

శ్యామసుందరీదేవి. అక్కడ నిలబడిన కార్తీక భుజంమీద చెయ్యివేసి "లోపలికిరా కార్తీ!" అంటూ లోపలికి నడిపించబోయాడు.

అతన్ని వదిలించుకుని గబగబా లోపలికి వెళ్ళిపోయింది కార్తీక.

పొరపాటున కూడా అభిరామ్‌ని ఆ ఛాయలకి రానియ్యకూడదనుకున్నాడు శ్రీకాంత్.

ఆరాత్రి భోజనం అయిన తర్వాత శ్యామసుందరీదేవి మేడమీద ఉన్న శ్రీకాంత్ గదికి వెళ్ళింది.

శ్రీకాంత్ వాలుకుర్చీలో కూర్చుని ఏదో ఆలోచిస్తున్నాడు. పర ధ్యానంగా ఉన్న శ్రీకాంత్ గదికి వెళ్ళింది.

శ్రీకాంత్ వాలుకుర్చీలో కూర్చుని ఏదో ఆలోచిస్తున్నాడు. పర ధ్యానంగా ఉన్న అతను శ్యామసుందరి వెని గమనించలేదు.

"బాబూ! శ్రీకాంత్" అని పిలిచింది.

"ఏం అత్తయ్యా! నువ్వు పైకి వచ్చావేం రా! ఇలా కూర్చో" అంటూ కుర్చీ చూపించాడు.

ఫారిన్‌నుంచి వచ్చిన కొత్తలో 'ఆంటీ' అని పిలిచేవాడు. ఇప్పుడు పాత అలవాటు ప్రకారం "అత్తయ్యా!" అని పిలుస్తున్నాడు.

"ఈ వైశాఖలో, ముహూర్తాలున్నాయట." అంది ఏ ఉపోద్ఘాతం లేకుండానే.

"అ ను అనుకుంటున్నానత్తయా!"

"మరీ మంచిది! రేపే పురోహితుడికి కబురు చేసి ముహూర్తాలు పెట్టిస్తాను. మా చెల్లెలికి, మా తమ్ముడికి కూడా కబురుచేస్తాను!"

"నీ ఇష్టం అత్తయ్యా!"

ఆ తల్లికి ఈ మేనల్లుడికి కూడా కార్తీకను పెళ్ళి విషయం అడగాల అనిపించలేదు.

"సరేబాబా" అంటూ పట్టరాని సంతోషంతో ఆవిడ కిందికి తిరిగి వచ్చేసింది.

మరునాడు తెల్లారకుండా సర్వయ్యను పంపించింది. పురోహితుని దగ్గరకూ సర్వయ్య అతన్ని వెంటబెట్టుకుని మరీ వచ్చాడు. అప్పటికి ఉదయం ఏడు గంటలయింది అంతే.

అతన్ని మర్యాదచేసి కూర్చోపెట్టింది. సర్వయ్య ఇచ్చిన కాఫీ తాగి పంచాంగం తీశాడు. నక్షత్రాలు చూశాడు. తారాబలం చూశాడు. చివరకు ఒక మంచి ముహూర్తం బాగుందన్నాడు. ఇంతలో శ్రీకాంత్ అక్కడకు వచ్చాడు.

పురోహితుడిని చూడగానే అతని సంతోషానికి అవధుల్లేవు. కార్తీక ఇక తప్పించుకోలేదు అనుకున్నాడు.

పళ్ళు తాంబూలం, ఒక వందరూపాయల దక్షిణ ఇప్పించింది శ్యామసుందరీదేవి. అతని చేతిలో పెట్టి నమస్కరించాడు శ్రీకాంత్. అతను ఆశీర్వదించాడు. బుధవారంనా పెళ్ళి పనులకి మీదు కట్టనికి బాగుందని చెప్పాడు.

శ్యామసుందరీదేవి ఎవరైనా ముత్తైదువను పిలిచి విఘ్నేశ్వరుని దు కట్టిస్తానంది. అది అయి తప్ప పెళ్ళిపనులు ప్రారంభించరాదదని ఆవిడకు తెలుసు. ముందుగా పసుపు కొట్టించాలని కూడా అతను మరోసారి జ్ఞాపకం చేశాడు. పురోహితుడు వెళ్ళడానికి లేవబోయాడు

ఇంతలో కార్తీక అక్కడకు వచ్చింది. పురోహితుణ్ణి చూడగానే ఆమెకు అనుమానం వచ్చింది. పైగా ముఖానికి కుంకుమతో భుజంమీద కండువాతో శ్రీకాంత్‌ను చూడగా- విషయమంతా అర్థం చేసుకుంది.

శ్రీకాంత్ కాని, ఆవిడ గాని ఏమీ అనలేదు కార్తీకతో. కార్తీక కూడా ఏమీ అడగ దు. పురోహితుని ఎదురుగా తను ఏమనా

బాగుండదు. అతను వెళ్ళిన తర్వాత తల్లిని అడగాలనుకుంది. అందుకే ఏమీ తెలియనట్టు అక్కడనుంచి వెళ్ళిపోయింది.

శ్యామసుందరీదేవి, శ్రీకాంత్ ఊపిరి పీల్చుకున్నారు. కార్తీక ఎదురు అడగనందుకు సంతోషించారు. పురోహితుడు వెళ్ళిపోయాడు. అతను వెళ్ళడం చూసిన కార్తీక వచ్చి తల్లి పక్కనే కూర్చుంది.

శ్యామసుందరీదేవి, శ్రీకాంత్ ఒకరికేసి ఒకరు చూసుకున్నారు. శ్రీకాంత్ లేచి అక్కడనుంచి వెళ్ళిపోయాడు. ఉండబట్టలేక కార్తీక "అమ్మా! పంతులుగారు ఎందుకొచ్చినట్టు?" అడిగింది.

"కార్తీ! అలా అడుగుతావేమిటి? మీ పెళ్ళిముహూర్తాలు పెట్టడానికే!"

మా పెళ్ళి ముహూర్తమా, అమ్మా! నాతో చెప్పకుండా నా పెళ్ళి ముహూర్తం పెట్టేస్తున్నావా?"

"అదేమిటి కార్తీ! అలా అంటావేమిటి. ఇందులో నీకు తె ంది ఏముంది. రేపే మీదు కట్టమన్నారు. 21వ దీని పెళ్ళి ముహూర్తం."

"అమ్మా! నీమాట కాదంటున్నాననుకోకు! ను రిజల్ట్సు రాం పెళ్ళి చేసుకోను!"

"రిజల్ట్సుదేముంది! అప్పటికి ఎలాగూ వచ్చేస్తాయి!"

"అయినాసరే. నాకసలు పెళ్ళి చేసుకోవాలనిలేదు!" మొండిగా అంది.

"కార్తీ! నీకు మతికాని పోతోందా? పెళ్ళి చేసుకోక ఏంచేస్తావు? ఏమిటా మొండితనం." కాస్త మందలింపుగా అంది.

"అదికాదమ్మా! ఇప్పుడే పెళ్ళి వద్దంటున్నాను. అం !" అంది కాస్త తగ్గి.

రిజల్ట్సు రాకుండా ఎక్కడికి పోతాయి. ఈలోపుగా రిజల్ట్సు రాక పో ఆపేద్దాం. అం గా!" అంది ఆవిడ కాస్త పట్టుదల తగ్గించుకుని.

"ప : అలాగే" అంది. కార్తీక అప్పటికే గండం దాటినందుకు కార్తీక ఉత్తర ఇంటికి వెడుతున్నానని చెప్పి వెళ్ళిపోయింది.

అలా కుర్చీలో కూర్చుండిపోయింది శ్యామసుందరి. ఎందుకో ఆవిడకు లోపల అనుమానంగా ఉంది. కార్తీక శ్రీకాంత్‌ని తప్పించుకుని తిరగడం ఆవిడ గమనిస్తోంది.

ఇదివరకల్లా "బావా! బావా!" అంటూ వెంటపడేది. ఇప్పుడు ఎంతసేపు అభిరామ్ సంగతే చెబుతోంది. అభిరామ్ నిన్న వెళ్ళేటప్పుడు ఆ ఇద్దరి చూపుల్ని గమనించింది ఆ తల్లి.

తర్వాత ఆమె మనస్సు శ్రీకాంత్ వైపు వెళ్ళింది. శ్రీకాంత్ ప్రవర్తన కూడా ఆమెకు అంతగా సంతృప్తి అనిపించలేదు. కార్తీక అంటే చెప్పలేని మోజుచూపిస్తున్నా అతను రోహిణితో అంత చనువుగా ఉండటం సహించలేకపోయింది. కార్తీక గమనించే ఉంటుంది. అందు అలా కార్తీక ఉందేమో" అనుమానం వచ్చింది. పైగా పు పెళ్ళయి. తర్వాత కూడా శ్రీకాంత్ అలాగే ఉంటే ఆ దాంపత్యం సుఖంగా సాగలేదు. తను బలవంతంగా పెళ్ళి చెయ్యటమా! అనుకుంది.

"చిన్నతనం వాళ్ళ ం తెలుసు త సరిదిద్దాలి. ఇద్దరి పెళ్ళి జరిపించాలి. వాళ్ళే సద్దుకుంటారు" తిరిగి ఒక నిర్ణయానికి వచ్చేసింది.

ఏమైనా సరే రేపు మీరు కట్టించెయ్యాలనుకుంది."

రైలు వచ్చి వెళ్ళిన తర్వాత ప్లాట్‌ఫారంలా ప్రశాంతంగా అయింది ఆవిడ మనస్సు.

"అమ్మా : స్నానం చెయ్యండి," జ్ఞాపకం చేసాడు సర్వయ్య.

"టైం ఎంతయింది సర్వయ్యా?"

"ఎనిమిదిన్నరయిందమ్మా!"

'అలాగా' అంటూనే ఆవిడ సోఫాలోంచి లేచింది. అంతలో శ్రీకాంత్ కిందికి దిగివచ్చాడు.

"శ్రీకాంత్ రిజల్ట్సు వచ్చేవరకు ముహూర్తం ఆపమంటోంది!"

"ఈ వేళో రేపో రిజల్ట్సు వస్తాయి!" అన్నాడు శ్రీకాంత్.

"అందుకే అన్ని ఏర్పాట్లు చేయిస్తాను బాబూ" అంటూ అక్కడ నుంచి లేచి వెళ్ళింది ఆవిడ. శ్రీకాంత్ సంతోషంగా బయటకు వెళ్ళి పోయాడు.

* * *

స్వాతి ఇంకా స్కూలు నుంచి రాలేదు. ఉత్తర హాల్లో కూర్చుని కాంపోజిషన్ పుస్తకాలు దిద్దుకుంటోంది!

ఇంతలో దగ్గరగా వేసున్న వీధి తలుపులు తోసుకుంటూ ఉత్తర తర్ర చలపతి లోపలకు వచ్చాడు. అతని వెనకే మరో వ్యక్తి లోపల అడుగు పెట్టాడు.

వాడిని చూసిన ఉత్తర ప్రమాదం గుర్తించింది? కాని ఏమి చెయ్యాలో మాత్రం తోచలేదు. చివరకు ధైర్యం కూడకట్టుకుని

"బామ్మగారూ!" అంటూ గట్టిగా అరిచింది.

అంతే ఆ కొత్త వ్యక్తి చేతిలోఉన్న కర్రతో ఉత్తర తలమీద బలంగా వేశాడు. ఉత్తర "అమ్మా" అంటూ నేలమీద పడింది.

రక్తం కాలవ కట్టి ప్రవహించింది.

చలపతి ఆమె మెడలో పుస్తె బలవంతంగా తెంచి జేబులో పెట్టు కున్నాడు. మరో దెబ్బ పడబోయింది తలమీద.

'ఆగరా! ఆగు' అప్పుడే అక్కడకు వచ్చిన బామ్మగారు గట్టిగా అరిచింది. వాళ్ళు అలాగే నిలబడిపోయారు.

ఇంతలో అక్కడకు వచ్చిన స్వాతి మెరుపులా వాడిమీద కలియ బడింది. ఇద్దరిని మరి లేవకుండా తన్నింది. వాళ్ళు పరుగు లంకించు

కుంటుంటే పోలీసులు పట్టుకుని పోలీసు స్టేషనుకు తీసుకువెళ్ళారు గాయం నుండి రక్తం కారుతున్న అక్కగారిని చూసి కంగారు పడిం స్వాతి. వీధి చివరనున్న లేడీ డాక్టరు దగ్గరకు పరుగెత్తింది. ఆ వెంట. బయలు రి వచ్చింది.

ఇదివరకున్న డాక్టరు ఇంటికి వచ్చేవాడు కాదు. పైగా ఫీ చేతిలో పెడితే తప్ప కదిలేవాడు కాదు. ఈ లేడి డాక్టరు డబ్బుమని కాదు: అందుకే వెంటనే వచ్చింది.

ఉత్తర దెబ్బలన్నీ తుడిచి మందులేసి కట్టుకట్టింది. తర్వా ఇంజక్షన్ చేసింది. రేపు వస్తానని చెప్పి వెళ్ళిపోయింది. ఆడపిల్లయి కరాటె . ర్చుకోడం వల్లే అంత ధైర్య సాహసాలు ప్రకటించ గలిగి దన్నారు అందరు. గుమిగూడిన జనం వెళ్ళిపోయారు.

బామ్మగారుకూడా ఒక్క ఉండలేకపోతోంది. అందుకే త ఇంటికి ఆ ఇద్దర్ని రమ్మంది. ముగ్గురు ఒకేచోట ఉండి వండుకు తిం- టుంది ఆ ముసలావిడి, ఆ మాటకు అక్క చెల్లెళ్ళిద్దరు మురిసిపోయారు ఉత్తర ఆవిడను కౌగిలించుకుంది.

"నాయనమ మాకు తెలియదు. త తెలియదు. నువ్వే మా అన్నీ!" అంటూ ఆవిడను కౌగిలించుకుంది స్వాతి. ఆవిడ ఆనందాని అంతులేదు.

అందురు వెళ్ళాక మెడ చూసుకున్న ఉత్తర బావురుమంది. మెడ బోడిగా ఉండి, భర్త మంగళసూత్రం తెంచుకుని పట్టుకుపోయి పోయినట్టు తెలుసుకుని బావురుమంది.

"ఉత్తరా! నీ సంసారానికే చక్కదనం లేనప్పుడు మె మంగళ సూత్రం దేనికమ్మా" అంది.

"నిజమే బామ్మగారు కాని జనమంతా నన్నే ఆడిపోస్తా మంగళ సూత్రాలు తీసేసి తిరుగుతోందని చెయ్యని అపరాధాని

నిందలు వేస్తారు బామ్మగారు!" కన్నీళ్ళు పెట్టుకుంది ఉత్తర.

"అమ్మా ఉత్తరా! చదువుకున్న దానివి నువ్వే అలాఅంటే ఎలా గమ్మా! అని నిందలు కావు! అవి వారి నోటి దురుసు వాగుళ్ళు. వాటిని మనం పట్టించుకోకూడదు" అంటూ నచ్చజెప్పింది.

వయస్సు అంత పెద్దదయినా ఆవిడ అభ్యుదయ భావానికి అక్కచెల్లెళ్ళిద్దరు ఆశ్చర్యపోయారు. ఆవిడ ఏమీ చదువుకోకపోయినా ఆవిడ లోకజ్ఞానం అటువంటిది. ఆమె మాటే వేదవాక్కు అనుకున్నారు ఇద్దరూ. ఉత్తరకు జ్వరం తగిలింది. మూలుగుతూ పడుకుంది. స్వాతికి ముసలమ్మగారు దగ్గరుండి అన్నం పెట్టింది. ఉత్తరకు తగ్గే వరకు అక్కడే ఉంది. తర్వాత తనింటికి సుకువెడతానంది. ఎంతో సంతోషించారు అక్కచెల్లెళ్ళిద్దరు.

* * *

స్వాతికి తగిన గుణపాఠం చెప్పాలనుకున్నాడు రాజా. ఎంత పొగరు తనకు ఇన్నాళ్ళికి అవమానం చేసిన వ్యక్తిని వదలకూడదను కున్నాడు. ఆమెచేత 'సారీ' చెప్పించాలి.

ఎలా చెప్పించాలి. అదే ఆలోచన. కాని కరాటె ప్రదర్శనలో ఆమె చూపిన మెళకువలు మెచ్చుకోకుండా ఉండలేకపోయాడు.

స్త్రీ ప్రదర్శనలో కూడా అంత అందంగా ఉంటుందా అను కున్నాడు.

ఆరాత్రి మగతమగతగా మాతమే నిద్రపోయాడు రాజా.

ఉదయం ఆరు కాకుండా, కరాటె క్లాసుకి బయలుదేరాడు. అక్కడకు వెళ్ళగానే స్వాతి కోసం వెతికాడు. అప్పుడే స్వాతి రాదని తెలుసు. అయినా ఆతురత అటువంటిది. మనసులో కోపానికి, ప్రతీ

యానికి కూడా ఆతురత పెరిగిపోతుంది. మనసు అదుపుతప్పి సముద్ర కెరటంగా ఎగసిపడుతుంది.

కరాటె మేష్టారు, తోటి స్నేహితులు అందరు వచ్చారు. కాని స్వాతి రాలేదు.

అంతవరకు ఉన్న ఉత్సాహం అతనిలో చల్లారింది. కొస్త నిరుత్సాహం వ్యాపించింది.

అది గమనించిన రమేష్ అతని దగ్గరగా వచ్చి "రాజా కరాటె రాణీగారి కోసమా ఆ ఎదురుచూపులు" అంటూ హేళన చేశాడు.

"పొండిరా! మీకేపనీ లేదు. కరాటె రాణీ సంగతి తప్ప" అన్నాడు.

"భాయీ! మాకేంతెలుసు, నీమనసు తెలుసు అబద్ధమాడకురా" అన్నాడు రమేష్.

"భయ్యా! రాగా- తెగవెతికిన కళ్ళు అలసిపోయి . టుకేసే స్తున్నాయని మాకు తెలుసురా!" అన్నాడు చక్రవర్తి.

"చాలు, చాలు. నడవండి కాలేజీకి" అంటూ లేచాడు రాజా.

"పొద్దుటనుంచి తిండి దు. హోటల్లో ఇంత మేత వ యిస్తే లు నడుస్తాయి. లేకపో ఇక్క ఈలా. కూలిపోతాయి" అంటూ లకు జారడం మొదలెట్టాడు రమేష్.

మిగిలిన వాళ్ళు అతన్ని పట్టుకుని పడిపోకుండా ఆపు శారు.

"అన్నట్టు రాజా! ఇన్సల్టురా! ఇన్సల్టు. నిన్న తిన్న చెంపదెబ్బకి ర్టీ ఇచ్చి రాలి" అన్నారు.

"అలా అయి ఇవ్వను. మీరు చస్తున్నారంటే ఇస్తా పార్టీ!" అన్నాడు రాజా.

"చస్తున్నాం" అంటూ వాళ్ళు అరిచారు. రాజావెంట అందరు హోటల్ వైపున నడిచారు.

హోటల్లో టిఫిన్ కాఫీలు .సుకుని బయటకొచ్చేటప్పటికి కా. జీ టైం అయింది.

అందరూ తిరిగి బయలుదేరారు.

రాజాకు ఎందుకో కాలే .కి వెళ్ళాలనిపించలేదు. మనస్సంతా ఎంతో చికాగ్గా ఉంది.

ఇంతలో బాగ్ చేతపట్టుకుని వస్తున్న స్వాతి ఎదురయింది.

ఒక్కసారి సరాలు జీవ్వుమన్నాయి రాజాకి.

"కరాటె రాణీ జిందాబాద్" అంటూ అరిచారు మిగిలినవాళ్ళు.

రాజా "ఊరుకోకుండా నడిరోడ్డుమీద ఏమిటా అరుపులు" అన్నాడు మందలింపుగా.

"అయ్యో పాపం!" అంటూనే ఊరుకున్నారు. కరాటె . ర్చు కుంటున్న వాళ్ళు రౌడీలు కారు. ఏదో సరదాకి - శాకోళం చేస్తారం . లేకపో- విద్య అవమానం.

స్వాతి అరుపులు వింది. కాని ఏమీ సమాధానం ఇవ్వకుండా గబగబా నడుచుకుంటూ వారిని దాటి వెళ్ళిపోయింది.

"రమేష్! స్వాతి ఎక్కడికి వెడుతుందో చూడరా!" అన్నాడు రాజా!

"అవునురా! ఎక్కడికి వెడుతుందో కాస్త చూడవలసిం‌ద అంటూ ఆమె వెనుక బయలుదేరాడు రమేష్.

మిగిలినవాళ్ళు కా- జీవైపు వెళ్ళారు.

రాజాకి స్వాతి ఏమి చేస్తుందో తెలీదు. ఆమె కాలేజీలో చదవటం లేదని మా తం అనుకున్నాడు. ఆమెను చూస్తే ఎక్కడైనా ఉద్యోగం చేస్తోందా అనే అనుమానం వచ్చింది రాజాకి.

కాలేజీ బెల్ కొట్టేటప్పుడల్లా రమేష్ తిరిగి వచ్చాడు.

"రాజా! రాజా ఆమె అక్కడ ఒక స్కూల్లోకి వెళ్ళింది. ఒక

మా యిని పిలిచి ఆవిడ ఎవరని అడిగాను.

"మా టీచర్ అంది. చూసావా రాజా ఎలా తెలుసుకున్నానో" అన్నాడు గర్వంగా.

మంచి పని చేశావు. ఏం స్కూలురా!" అన్నాడు.

"కస్తూరిబా మెమోరియల్ స్కూల్ ఆ మార్కెట్టు గల్లీలో ఉంది" అన్నాడు.

"అలాగా! అందుకే అటు వెళ్ళినట్టుంది." అంటూ. రాజా క్లాసుకి బయలుదేరాడు. అందరూ క్లాసుల్లో కూర్చున్నారు.

అందరిని వదిలించుకున్న రాజా స్కూలు వదిలే టయింకి అక్కడకు చేరుకున్నాడు. ఎదురుగా బుక్ షాపు దగ్గర నిలబడ్డాడు.

పిల్లలంతా బిలబిలమంటూ బయటకొచ్చారు. తర్వాత టీచర్స్ బయటకొస్తున్నారు. అందరిలో నక్షత్రాల్లో చందమామలా ఉంది స్వాతి.

మొదటిసారి చలించాడు రాజా, కాస్త సర్దుకున్నాడు తిరిగి.

ఆమె బయటకొచ్చి ఇంటివైపు బయలుదేరింది.

ఆమె వెనకే బయలుదేరాడు రాజా.

ఆమె ఇంటి సందువరకు వచ్చింది స్వాతి.

వెనకే వస్తున్న రాజా ఆమెను చేరుకున్నాడు.

ఉలిక్కిపడి చూసింది స్వాతి.

"నీతో మాట్లాడాలి" అన్నాడు రాజా.

"నాకు టైం లేదు." ముందుకు అడుగేసింది.

"స్వాతీ! ఆగు." అంటూనే ఆమెకు ఎదురుగావచ్చి నిలబడ్డాడు జా.

"రాజా తప్పుకో!"

"తప్పుకోడానికి రాలేదు. నేనడిగిన దానికి సమాధానం చెప్పు?"

"అడుగు. అవసరమైతే సమాధానమిస్తాను."

"ఇక్కడ కాదు. నాతోరా."

"ఎంత ధైర్యం నీకు! గుడ్లురిమి చూసింది.

ఆ చూపులకు ఉక్కిరి బిక్కిరి అయిన అతనికి మాటలు కరువయ్యాయి. తర్వాత కాస్త కోలుకుని బరువుగా ఊపిరి పీల్చుకున్నాడు.

నీతో అంత మర్యాదగా . ను ప్రవర్తిస్తే నన్ను అంతమంది ఎదురుగా కొట్టడంలో నీ ఉద్దేశం?

"అదా నీ మర్యాద! ఒక ఆడపిల్ల నడుచుకుపోతుంటే రౌడీల్లా వెంటబడి నన్ను కరాటెరాణీ అంటూ అరవడం మర్యాదనా?"

"దానికి నేను సారీ చెబుతున్నాను!"

"చేతులు కాలాక ఆకులు పట్టుకున్నట్లు ఉంది. అప్పుడు అనవలసింది ఆమాట."

"నన్ను అవమానించడంలో నీ ఉద్దేశ్యం!" తిరిగి రెట్టించాడు. కొట్టినందుకు సారీ చెప్పించాలని అతని ప్రయత్నం.

"మిస్టర్ రాజా! నేను అవమానించలేదు. హద్దుమీరి నాచెయ్యి పట్టుకున్నందుకు కాస్త చవిచూపించాను అం ."

సమాధానం చెప్పలేకపోయాడు రాజా.

"ఏం సమాధానం దొరకలేదా?"

"ఇప్పుడు కొట్టు చూస్తా" ఆమె చెయ్యి అందుకోబోయాడు.

అతనికి అందకుండా దూరం జరిగింది స్వాతి. కోపంతో ఆమె పెదాలు అదిరాయి బుగ్గలు కెంపులయ్యాయి. కనుబొమ్మలు ముడివడ్డాయి.

"రాజా! ఇందుకా పిలిచావు. ఇది రౌడీలు చెయ్యవలసిన పని కరాటె మాస్టర్లు చెయ్యవలసిన పనికాదు. ఛీ! ఛీ! మగవాళ్ళు అందరూ ఇం ! మానవత్వం లేదు. నిధానం లేదు. సంస్కారం అసలేలేదు." సమాధానం పూర్తయినట్టుగా ఆమె వెనుతిరిగింది.

రాజాకు నోట మాటరాలేదు. గాంభీర్యంగా వెనక్కు తిరిగి వెడుతున్న స్వాతిని చూస్తూ నిలబడిపోయాడు. ఆమె మాట అతని చెవుల్లో రింగుమన్నాయి ఆమె ధైర్యానికి, ఆమె ,ర్భరితనానికి అతని మనస్సు కదిలింది. అమెమీద చెప్పలేని అభిమానం ఏర్పడింది. దూరంగా వెడుతున్న ఆమె రూపం అతన్ని అయస్కాంతంలా ఆకట్టుకుంది. ఆమెవెంట వేగంగా అడుగులు వేసాడు.

వెనుక రాజా వస్తున్నాడని స్వాతికి తెలియదు. ఇల్లురాగానె తలుపులు తెరచుకుని స్వాతి లోపలికి వెళ్ళిపోయింది. రాజా దూరంగా నిలబడిపోయాడు. ఆమెవెంట లోపలికి వెళ్ళే ధైర్యం అతనికి లేదు. కాసేపు అలాగే నిలబడిపోయాడు. తర్వాత మెల్లగా వెనుదిరిగాడు. అతని మనస్సునిండా స్వాతి రూపమే నిలిచిపోయింది. అంత సున్నిత హృదయ, అందాలరాశి తనతో పోటీపడి కరాటె చెయ్యడం తలచుకుంటె అతనికి ఆశ్చర్యంగా ఉంది. ఏపని చేస్తున్నా అతనికి వివిధ భంగిమల్లో స్వాతి కనబడుతోంది.

ఏప్పుడో తెలుగు మాస్టారు సత్యభామ నరకాసురునితో యుద్ధం చేసిన వర్ణన చెప్పడం గుర్తుకు వచ్చింది. అతని కంటికి సత్యభామలా కనబడింది స్వాతి.

ఆమెను పొందాల కోరిక అతన్ని నిలవనియ్యలేదు. ముందు స్వాతి హృదయం మరింత అర్థం చేసుకోవాలనుకున్నాడు. తర్వాత ఆమె అంగీకారం చూసుకుని తల్లితో ఆ సంగతి చెప్పాలనుకున్నాడు.

* * *

ఆరోజు ఉదయం పేపర్లో రిజల్ట్సు వచ్చాయి. శ్రీకాంత్ ముందు చూశాడు. "కార్తీ! నీ రిజల్ట్సు వచ్చాయి." అంటూ అరిచాడు. కార్తీక పరుగెత్తుకుంటూ వచ్చింది.

"కార్తీ! చెప్పినందుకు ఏమిస్తావ్?"

"ఏది కావలసివస్తే అది ఇస్తాను. ముందు నెంబరెక్కడుందో చూడు."

"ఆ ఇదిగో, సెకండ్ క్లాస్" అంటూ పేపరు కిందవేసి చప్పట్లు కొట్టాడు. కార్తీక పేపరు అందుకుని మరోసారి చూసింది, సెకండుక్లాసులో కనబడింది నెంబరు. "అమ్మా, అమ్మా నేను సెకండు క్లాసులో పాసయ్యా!" అంటూ గంతులేసింది. శ్యామసుందరీదేవి అక్కడకు రాగానే ఆవిడ భుజాలు పట్టుకుని ఊపేసింది కార్తీక. ఆవిడ సంతోషానికి అంతులేదు. అక్కడకు వచ్చిన సర్వయ్య వారి సంతోషంలో పాలుపంచుకున్నాడు.

శ్రీకాంత్ మాత్రం కాస్త చిన్నబుచ్చుకున్నాడు. ముందుగా రిజల్ట్సు చూసి చెప్పింది తను. కార్తీక తన భుజాలు పట్టుకుని ఊపుతుందని ఆశించాడు. ఆమె తల్లి దగ్గరకు పరుగెత్తింది. చిన్నతనం పోలేదేమో? అనుకున్నాడు. మరి అభిరామ్‌తో అంత చనువుగా ఎందుకుంటోంది? అందుకే ఇంక అక్కడ నిలబడలేక మేడమీద తన గదికి వెళ్ళిపోయాడు.

సర్వయ్య సేమ్యా పరమాన్నం, పులిహోర తయారుచేసి అందరికి భోజనాలు వడ్డించాడు.

"సర్వయ్యా! శ్రీకాంత్‌నుకూడా పిలూ" అంది శ్యామసుందరీదేవి.

"నువ్వుండమామ్మా! బావను నేను పిలుచుకొస్తాను?" కార్తీక మెట్లు ఎక్కి పైకి వెళ్ళింది.

ఆవిడ అలాగే చూస్తూ ఉండిపోయింది.

"బావగారు! రండి భోజనానికి?" పిలిచింది కార్తీక!

"మీరంతా తినండి నాకు ఆకలిగా లేదు," అన్నాడు ముక్తసరిగా.

"నువ్వు వస్తేకాని నేనూ తినను! అప్పటి వరకు ఇక్క

కూర్చుంటాను." అంటూ అతను పడుకున్న మంచం మీ చివరగా కూర్చుంది.

ఆమెను అర్థం చేసుకోలేక తికమక పడ్డాడు శ్రీకాంత్.

"రా బావా!" అంది బతిమాలుతూ!

అతను లేవబోతుంటే చెయ్యి అందించింది అతనికి.

ఆమె చెయ్యి ఆధారంతో మంచం దిగాడు శ్రీకాంత్. కోపం అంతా మంచులా విడిపోయింది, లుంగీ సర్దుకుని నిలబడ్డాడు.

కార్తీక వెనకే కిందికి దిగివచ్చాడు.

ఆ ఇద్దర్ని ఎంతో సంబరంగా చూసింది శ్యామసుందరీదేవి.

భోజనం చేస్తున్నంతసేపు కార్తీక సరదాగా మాట్లాడుతూ ఉంది. శ్రీకాంత్ ఏవో వేళాకోళాలు చేస్తూ కార్తీక చెవి మెలేశాడు.

"బాబోయ్ అమ్మా! చూశావా! నీ ఎదురుగానే నన్నెలా బాధిస్తున్నాడో" అంటూ అరిచింది కార్తీక.

చెవి వదిలి నెత్తిమీద మొట్టికాయ మొట్టాడు శ్రీకాంత్.

ఎంతో సరదాగా భోజనాలు ముగించారు.

మరునాడు శ్యామసుందరీ వి విశ్వేశ్వరునికి మీదుకట్టిం సింది. పనులు కూడా ప్రారంభించింది. ఈరోజు రిజల్ట్సు వచ్చాయి. యిప్పుడే అడిగి ఏమంటుందోనని ఊరుకుంది. రాత్రి స్థిమితంగా అడగాలను కుంది.

* * *

రా దగ్గరకు వెళతానంటూ బయలుదేరింది కార్తీక.

"కారులో వెళ్ళమా !" డ్రైవరికి కబురుచేస్తాను" అంది తల్లి.

"కారెందుకమా ! ఆటోలో వెళ్ళిపోతా" అంటూ తలుపు సు

కుని రోడ్డు మీదికి వచ్చింది. రోడ్డు చివరవరకు వస్తేగాని ఆటోలు సాధారణంగా దొరకవు. అందుకే అటు ఇటు చూసి నాలుగడుగులు వేసింది కార్తీక. అభిరామ్ స్కూటర్ మీద వస్తూ ఎదురయ్యాడు.

"హల్లో! కార్తీ" అని నాలుక కరుచుకున్నాడు. మెల్లిగా స్కూటరు దిగి నిలబడ్డాడు.

"హలో" అంటూ ఎంతో సంబరంగా అతని స్కూటర్ పట్టుకుని నిలబడింది.

"పార్టీ ఎప్పుడూ"

"ఇప్పు " అంది తడుముకోకుండా.

"సరే! ఎక్కండి నా స్కూటరు!"

". ను రాజీ ఇంటి కెళ్ళాలి.'

"రాజీలేదు, ఎవరూ లేరు. నాతో రావలసిందే!

"నాకు స్కూటరంటే భయం. నేనెప్పుడూ ఎక్కలేదు" అంది. బెదురుగా.

ఏం భయంలేదు . నున్నాగా ఈ త్వరగా?"

"ఆమె స్కూటరెక్కి కూర్చుంది."

"అలాకాదు ఇలా పట్టుకో" అంటూనే ఆమె కుడి చెయ్యి అందుకుని అతని నడుం చుట్టూ శాడు.

"గట్టిగా పట్టుకోవాలి కాస్త ముందుకు జరగాలి."

ఆమె చేసేది లేక కాస్త ముందుకు జరిగి నడుం చుట్టూ చెయ్యి వేసి పట్టుకుంది. అనుకోని ఆ అవకాశానికి అతని హృదయం ఆకాశ వీధిలో ఎగిరిపోతుంటే అతని స్కూటర్ స్టార్ట్ చేసాడు.

"ఎక్కడికి అభిరామ్" మరచిపోయినట్లు అడిగింది,

"స్కూటర్ ఎక్కడాగితే అక్కడికి" అంటూనే స్పీడ్ ఎక్కిం చాడు.

అలవాటులేని కార్తీక అతన్ని అనుకుని కూర్చుంది. అతన్ని గట్టిగా పట్టుకుంది. నాలుగు వైపుల నుండి గాలి వచ్చి తగులుతోంది అంత ఎండలోను చెప్పలేని ఆనందం. వెన్నెల రాత్రి కంటె అందంగా ఉంది ఆ పట్టపగలు.

అభిరామ్ ఒక సినిమా హాలు ముందు స్కూటర్ ఆపి కార్తీ! దిగు" అన్నాడు.

ఆ కొత్త సంబోధనకు ఆమె హృదయం పులకించింది.

ఆమెదిగగానే స్కూటర్ పక్కగా పెట్టి వచ్చాడు. ఆమె చెయ్యి పట్టుకుని కౌంటర్ దగ్గరకు తీసుకువెళ్ళాడు."

"పైకి అంత గాంభీర్యంగా ఉన్నా" అతనిలో ఆ చొరవే తనని అతని వెంట తిప్పుకుంటోంది అనుకుంది కార్తీక!" ఆనాడు రోడ్డు దాటాను! ఈనాడు ఇల్లు దాటాను!" అనుకుంది మనస్సులో.

టికెట్లు సుకుని ఆమె నడుంచుట్టు ఎడం చెయ్యి వేసి నడిపించు కుంటూ హాల్లోకి సుకువెళ్ళాడు.

తర్వాత వాచ్‌మాన్ బాటరీలైటు వేసి సీట్లు చూపించగా, వెళ్ళి సీట్లో కూర్చున్నారు. ఇద్దరికీ కార్నర్ సీట్లు వచ్చాయి.

"ఇక ఏం చేద్దామనుకుంటున్నావు" అడిగాడు ముందుగా అతనే.

"ఇంకా ఏం అనుకోలేదు!"

ఒకసారి 'అం ' ఒకసారి 'కార్తీ' ఒకసారి 'నువ్వు' ఆమెకుఎంతో ంతోషమనిపించింది.

"కార్తీ! ఏమ్.ఏలో చేరడం మంచిది!" అన్నాడు.

"నాకూ చదవాల ఉంది. కాని మా అమ్మగా మంటారో!"

"చదవాలి. ఈ రోజుల్లో ఆమాత్రం చదవకపోతే ఎట్లా!" అన్నాడు.

అంతలో సినిమా ప్రారంభమైంది.

ఇద్దరు విడిగా ఉండలేనంత దగ్గరగా కూర్చున్నారు. ఆమె ఎడంచేతిని అందుకుని తన కుడిచేతితో బంధించాడు.

"మీబావ ఏం అంటున్నాడు?"

"ఏం అనడం లేదు. నేను ఎక్కువ మాట్లాడటంలేదు." అలా కబుర్లు సాగుతూనే ఉన్నాయి. ఇంట్రవెల్ అయింది. వారి కబుర్లు తరగలేదు. ఆ రెండున్నర గంటలు వాళ్ళు ఒక భూతలస్వర్గంలో ఉన్నట్టు ఉన్నారు. వారికదే శాశ్వతం కావాలి. ఆ స్వర్గంలో వారిద్దరే. బయట ప్రపంచంతో వారికి సంబంధం లేదు. ఏదో చెప్పలేని హాయి వారికి కలిగింది.

అందరు లేచి వెడుతుంటే వాళ్ళుకూడా లేచి బయటకొచ్చారు. అతను స్కూటర్ స్టాండుకెళ్ళి స్టార్టు చేశాడు.

ఈసారి కార్తీక కాస్త భయం లేకుండానే వచ్చి స్కూటరెక్కి కూర్చుంది. ఈసారి అతను చెప్పకుండానే అతనికి దగ్గరగా జరిగి కూర్చుంది. చేతిని అతని భుజంమీద వేసింది.

స్కూటరు గేటువరకు వచ్చింది. అంతలో పక్క ఆగిన కారు కేసి చూసిన కార్తీక గుండె జారిపోయింది.

ఎదురుగా డ్రైవింగ్ సీట్లో శ్రీకాంత్ కార్తీకకేసి పళ్ళు నూరుతూ చూశాడు. అతని పక్కనే రోహిణి కనబడగానే కార్తీక బెదురులేకుండా చూసింది. ఆమెలో అంతవరకు ఉన్న ఉత్సాహం తగ్గి ఆ స్థానంలో కోపం పేరుకుంది.

అభిరామ్ కారును చూడలేదు. కాస్త ముందు రష్ తగ్గగా స్కూటర్‌ను ముందుకు పోనిచ్చాడు.

వెనక కారు రావడంలేదుఅనుకున్నతర్వాత కార్తీకఅభిరామ్‌తో జరిగిన సంగతి చెప్పింది.

"శ్రీకాంత్ ఒక్క వచ్చాడా?"

"లేదు. పక్కనే మీ సిస్టర్ ఉంది కాని ఆమె చూడలేదు.'

అదీ ఒకందుకు మంచిదే అనుకున్నాడు అభిరామ్. ఒక హోటల్ ముందు స్కూటర్ ఆపాడు.

"ఇంక ఎక్కడికి రాను. అభిరామ్ నాకు వెళ్ళిపోవాలని ఉంది.

"భయపడుతున్నావా? ఏదో ఒకనాడు బయటపడక తప్పదు. ఇదీ మన మంచికే నడు? అంటూ ఆమె భుజంమీద చెయ్యివేసి ఆప్యాయంగా నడిపించుకుంటూ హోటల్ కి నుకువెళ్ళాడు.

ముందుగా స్వీటు తర్వాత దోసె తినిపించాడు. అతని కబుర్లతో ఆమె మామూలు స్థితికి వచ్చింది.

అప్పుడు అతనితో పెళ్ళి సంగతి పురోహితుణ్ణి పిలిపించి వాళ్ళ అమ ముహూర్తం పెట్టడం అన్నీ చెప్పింది.

"కార్తీ! ఇంక బయటపడక తప్పదు. మా అమ్మగారు ఎప్పుడో నా అభిప్రాయం గ్రహించారు. మా నాన్నగారితో ప్రస్తావించారు కూడా. ఆయన ఏమీ మాట్లాడలేదు. చూద్దాం అన్నారు. అందుచేత మీ యింట్లోనే ఈరోజు గొడవ కావచ్చు. సమయం వచ్చింది. అన్నీ చెప్పేసెయ్యి." అన్నాడు అభిరామ్.

ఇద్దరు కాఫీలు పూర్తిచేసి బయటకు వచ్చారు.

అతను బతిమాలినా ఇంక స్కూటరు ఎక్కలేదు. ఆటోలో వెళ్ళిపోతానంది. అతను వినలేదు. స్కూటరుమీద నుకెళ్ళి ఇంటి ముందు ఆపాడు.

ఒకరిని ఒకరు విడువలేక విడువలేక విడిపోయారు. కార్తీక కన్నుల్లో అనుకోకుండా నీళ్ళు నిలిచాయి.

అదిచూసిన అభిరామ్ గుండె కరిగిపోయింది. అతని కన్నులు తడిఅయ్యాయి. ఏదో అనబోయాడు. ఆమె కదిలి ముందుకు నడిచింది.

స్కూటర్ నుకుని బయలుదేరిన అభిరామ్‌కు స్కూటర్ మీద

కార్తీక లేదు అనుకోగానే ఏదో పోగొట్టుకున్నట్టు వేన్నో మారం చేసుకున్నట్టు బాధపడ్డాడు. కాని అంతలోనే ఆమె తన దగ్గర కూర్చున్నప్పటి సంఘటన గుర్తుకొచ్చింది. ఏదో తెలియని ఆనందం మనస్సుకు అంతులేని ఊరట కలిగింది. ఆ తలపులలోనే అతను ఇంటికి చేరుకున్నాడు.

ఇంట్లో అడుగుపెట్టింది కార్తీక. ఎదురుగా తల్లి, శ్రీకాంత్‌లు కూర్చొని ఉన్నారు. వారి ముఖాలు చూడగానే వారి కోపాన్ని యిట్టే గ్రహించింది. ఈ సంఘటన ముందుగానే ఊహించింది. అందుకే ధైర్యంగా ముందుకు అడుగులేసింది. ఇద్దరు పలకరించలేదు. తన గది వరకు వెళ్ళిపోయింది.

"కార్తీ! ఇంతవరకు ఎక్కడకు వెళ్ళావు" తల్లికంఠం ఉరుములా వుంది."

"సినిమాకు వెళ్ళాను."

"ఎవరితో!"

"అభిరామ్‌తో!" దాచడమెందుకని చెప్పేసింది.

"ఇక్కడ పెళ్ళిపనులు జరుగుతుంటే అలా సినిమాకు ఎలా వెళ్ళగలిగావు?" అది శ్రీకాంత్ కంఠం.

"నీలాగే."

"అంటే నీ ఉద్దేశ్యం."

"ఉద్దేశానికేముంది. నువ్వు రోహిణితో వెళ్ళినట్టే."

శ్రీకాంత్ ఏమీ అనలేకపోయాడు.

శ్యామసుందరీదేవి తెల్లబోయింది.

"అదేమిటి కార్తీ?" ఆవిడ అడిగింది.

"అవునమ్మా! నేను రాజీ ఇంటికి వెడుతుంటె అభిరామ్ కలిశాడు. పరీక్ష పాసయ్యానని అతను పట్టుబడి సినిమాకు వెళ్ళాను.

బావగారు ఈ రోహిణితో రోజూలాగే సినిమాకు వెళ్ళారు, నేనుచెప్పింది. అబద్ధమైతే అడిగిచూడు?" అంటూ గదిలోకి వెళ్ళబోయింది.

"కార్తీ" ఆగు! అది పిలుపు కాదు. శ్యామసుందరీదేవి ఆజ్ఞ. తల్లి ఎప్పుడూ అంత కోపంగా అరవడం ఆమెకి తెలియదు అందుకే ఉలిక్కి-పడి ఆగిపోయింది కార్తీక.

శ్రీకాంత్ ఆ అరుపుకు భయపడి కుర్చీలో సర్దుకు కూర్చున్నాడు.

"నువ్వుకూడా విను శ్రీకాంత్! మీ ఇద్దరి పెళ్ళి నాలుగు మూడ యినా జరిగి రవలసిందే. ఈ రోజు మొదలు మీ ఇష్టం వచ్చినట్టు తిరగడానికి వీల్లేదు"

"ఈనెల 21 వ తేదీ పెళ్ళి ముహూర్తం తెలిసిందా?"

కోపంతో ఊగిపోతూ పలికింది శ్యామసుందరీదేవి.

కార్తీక శ్రీకాంత్ నోట మాట లేక శిలా ప్రతిమల్లా నిలబడ్డారు.

ఆవిడ మాట కాదనే శక్తి అంతకన్నాలేదు! గుడ్లప్పగించి ఆవిడ కేసి చూస్తున్నారు.

అంతలో శ్యామసుందరీదేవి బాధతో మెలికలు తిరగడం ఇద్దరు ఒకసారి చూసారు.

"అమ్మా" అంటూ దగ్గరగా వెళ్ళింది కార్తీక.

"అత్తయ్యా" అంటు అడుగు ముందుకు వేశాడు శ్రీకాంత్.

సోఫాలో అలాగే వాలిపోయింది శ్యామసుందరీదేవి.

"అమ్మా" అంటు తల్లిని పట్టుకు గొల్లుమంది కార్తీక.

"సర్వయ్యా." అంటు అరిచి ఫోన్ దగ్గరకు పరుగెత్తాడు శ్రీకాంత్.

డాక్టరు బయలుదేరి వస్తున్నట్టు సమాధానమిచ్చాడు.

ఫోన్ పెట్టేసి తిరిగి ఆవిడ దగ్గరకు వచ్చాడు శ్రీకాంత్.

తర్వాత సర్వయ్యా దిండు పట్టుకురా అన్నాడు.

సర్వయ్య దిండు పట్టుకు రాగానే తల కింద పెట్టి సర్దాడు. మంచం మీద పడుకోబెట్టడానికి సందేహించాడు శ్రీకాంత్. ఆవిడను

కదిపి ఏమవుతుందోనని భయపడ్డాడు.

ఆవిడ ముఖం మీద చన్నీళ్ళు చల్లి తుడిచాడు.

శ్యామసుందరీ వి సన్నగామూలుగు ప్రారంభించింది. ప్రక్క శోక వతలా ఉంది కార్తీక.

"అత్తయ్యా?" అంటూ ఆవిడను తడిమి చూసాడు. ఆవిడ బాధతో పలకలేదు. చేతి నాడిని జాగ్రత్తగా పరిశీలించాడు. అతను డాక్టరైనా ఇంకా ప్రాక్టీసు పెట్టలేదు. అందుకే డాక్టర్ని రమ్మని పిలిచాడు.

"సర్వయ్యా! నువెళ్ళి బామ్మగార్ని ఉత్తరనుపిలుచుకురా" కార్తీక కళ్ళు తుడుచుకుంటూ చెప్పింది అతను పరిగెత్తాడు.

కార్తీక దగ్గరగా వెళ్ళి "కార్తీ నన్ను క్షమించు కార్తీ! నన్ను క్షమించు!" అన్నాడు ఆమె చేతులు పట్టుకుని.

కార్తీక ఆశ్చర్యపోయింది. ఇందాక అలా ప్రవర్తించిన వ్యక్తేనా ఇతను అనుకుంది.

"క్షమించడానికి కేముంది బావా?" ఇంకా డాక్టర్ రాలేదా?"

శ్రీకాంత్ మరోసారి ఫోను చేసాడు. డాక్టరు బయలుదేరాడని చెప్పారు. ఫోను పెట్టేసి "కార్తీ భయపడకు డాక్టరు వచ్చేస్తాడు భయ పడకు అంటూ ఆమె తల నిమిరాడు. తర్వాత కుర్చీ లాక్కుని దగ్గరగా కూర్చున్నాడు.

అతని వెనకే సర్వయ్య బామ్మగారు ఉత్తర స్వాతి లోపలికి వచ్చారు.

అందర్ని చూడగానే కార్తీక ఏడ్పు హెచ్చించింది. "కార్తీ ఏడవకు ఇలాటి సమయంలోనే ధైర్యంగా ఉండాలి." అంటూ బామ్మ గారు శ్యామసుందరీదేవి ప్రక్కనే కూర్చున్నారు ఉత్తర కార్తీకను బయటకు తీసుకొచ్చి ఓదార్చింది.

డాక్టరు పరీక్ష చేసి "మరేం భయం లేదండి. కాస్త విశ్రాంతిగా

ఉండనీయండి! అంటూనే ఇంజక్షన్ చేశాడు. తర్వాత మందులేవో మింగించాడు.

ఆవిడకు నిద్ర పట్టింది. డాక్టరు లేచి హాల్లోకి వచ్చాడు. అతని వెనకే శ్రీకాంత్ వచ్చాడు.

శ్రీకాంత్ భుజం తట్టి మరేం ఫర్వాలేదండి ప్రమాదం ఏంలేదు? చాలా విశ్రాంతిగా వుంచండి. ఆందోళన కలిగించే విషయాలేమీ చెప్పకండి" అన్నాడు డాక్టరు.

"అలాగేనండి" అన్నాడు శ్రీకాంత్ అతని కళ్ళలో నీళ్ళు తిరిగాయి. డాక్టరు చూడకుండా కళ్ళు తుడుచుకున్నాడు. డాక్టర్ ఉదయమే వస్తానని చెప్పి వెళ్ళిపోయాడు. బామ్మగారు ఆవిడ పక్కన అలాగే కూర్చుంది.

డాక్టరు వెళ్ళగానే కార్తీక ఉత్తర స్వాతి ఆ గదిలోకి వచ్చారు.

"అమ్మా" అంటూ వెక్కి వెక్కి ఏడ్చింది కార్తీక.

"ఏడవకమ్మా! డాక్టరుగారు ఆవిడను విశ్రాంతిగా వుంచమన్నారు. ఆవిడకు నిద్రపట్టింది. నువ్వు ఇలా ఏడిస్తే కాదు. కాస్త ధైర్యంగా వుండాలి" బామ్మగారు నచ్చచెప్పింది. కళ్ళు తుడుచుకుంది కార్తీక. వాళ్ళను వెళ్ళి పడుకోమంది బామ్మగారు! కార్తీక పడుకోనంది.

శ్రీకాంత్ వచ్చి "కార్తీ! నువ్వుపడుకో?" నేను కూర్చుంటాను అన్నాడు.

ఉత్తర స్వాతి కార్తీకను తీసుకుని కార్తీక గదిలో కెళ్ళారు. కార్తీక మంచం మీదే ముగ్గురు పడుకున్నారు. బామ్మగారు శ్యామసుందరీదేవి పక్కలో కూర్చుంది.

శ్రీకాంత్ ఆవిడ మంచానికి దగ్గరగా వాలుకుర్చీ లాక్కొని కూర్చున్నాడు. బామ్మగార్ని కాసేపు పడుకోమని బతిమాలాడు.

"అత్తయ్యగారికి మెళకువ వస్తే లేపు బాబూ," అంటూనే పక్కనున్న మంచం మీద నడుం వాల్చింది."

ఆవిడకు నిద్ర పట్టినట్టుగా ఆవిడ ఊపిరే చెబుతోంది. అతని మనసు శ్యామసుందరీదేవి వైపు వెళ్ళింది.

తల్లికంటె ఎక్కువగా పెంచింది. కొండంత ఆశతో చదివించి ఫారిన్ పంపించింది. ఇక్కడ నర్సింగ్‌హోమ్ పెట్టించాలని ఆవిడ ఉద్దేశం. కాని తనకెందుకో తిరిగి ఫారిన్ వెళ్ళిపోవాలనిపిస్తుంది. ఈనాడు తన మూలంగానే ఆవిడకు ఇంత కష్టమొచ్చింది. చావు బతుకుల్లో పోరాడుతోంది.

తను నిజంగా ఈ కుటుంబానికి అన్యాయం చేశాననుకున్నాడు. తనురోహిణితో కొన్నాళ్ళు దూరంగా ఉండాలి. కార్తీక మనసుమార్చి ఆమెను పెళ్ళిచేసుకోవాలి. అలా సాగుతున్నాయి అతని ఆలోచనలు. కునుకు పట్టబోయింది.

సర్వయ్య గుమ్మం దగ్గర అలాగే కూర్చుని ఉన్నాడు. అంత వృద్ధుడు అలా కూర్చునేటప్పటికి శ్రీకాంత్‌కు జాలేసింది.

"సర్వయ్యా! నువ్వు వెళ్ళి పడుకో!"

"బాబూ! నేను కూర్చుంటాను నువ్వు పడుకో." అన్నాడు.

ఇంతలో ఆవిడ మూలుగు వినబడింది.

"అత్తయా! అత్తయా!" అంటూ పిలిచాడు.

ఆవిడ పలకలేదు. ఇంతలో బామ్మ గారు లేచారు. దగ్గరగా వెళ్ళి "అమ్మా! సుందరమ్మా!" అంటూ పిలిచింది.

ఆవిడ మెల్లిగా కళ్ళు విప్పి చూసింది.

బామ్మగారు చెంచాతో మందు నోట్లో పోసింది. మెల్లిగా మింగింది శ్యామసుందరీదేవి. తర్వాత మళ్ళీ కళ్ళు మూసుకుని నిద్రలోకి జారింది.

కాస్త చిన్నపుచ్చుకున్నాడు శ్రీకాంత్. బామ్మ గారు ఆ విషయం

గమనించలేదు. కాని సర్వయ్య ఇట్టె గ్రహించాడు. కాని పైకి ఏమీ అనలేదు. ఆవిడకు తనే సేవ చెయ్యాలని శ్రీకాంత్ అభిప్రాయం.

గదిబయట ఓ చాప పరుచుకుని పడుకున్నాడు సర్వయ్య.

కార్తీక మెలకువ వచ్చినప్పుడు లేచి తల్లి గదిలోకివచ్చి చూసింది.

శ్రీకాంత్ కుర్చీలో కూర్చు ఉన్నాడు. బామ్మగారు కూడా మెలకువగానే ఉంది. తల్లిని ఓసారిచూసి మళ్ళీ వెళ్ళి గదిలో పడుకుంది కార్తీక. బామ్మగారు పక్కన ఉండడం ఎంతో ధైర్యంగా అనిపించింది కార్తీకకు.

శ్యామసుందరీదేవి రాత్రి రెండు మూడుసార్లు లేచింది. వేళ తప్పకుండా డాక్టరు చెప్పినట్లు మందులేశారు.

తెల్లవారగానే ఉత్తర, స్వాతి ఇంటికెళ్ళిపోయారు. మళ్ళీ సాయంకాలం వస్తామని చెప్పారు.

బామ్మగారు అక్కడే వుండిపోయారు. మెల్లిగా రుకుంటోంది శ్యామసుందరీదేవి. ఆ రెండురోజులు శ్రీకాంత్ బయటకెళ్ళలేదు.

మూడోనాటికి శ్యామసుందరీ వి కాస్త టగా కనబడింది. క్రమంగా కోలుకోవడం మొదలుపెట్టింది.

*   *   *

స్వాతి కరాటే క్లాసుకు వెడుతోంది. రాజా ఎంతో ఆరాధనగా చూస్తున్నాడు. ఆమెను కలుసుకోవాలని యగా మాట్లాడాలని ఎన్నో విధాల ప్రయత్నం చేస్తున్నాడు. కాని స్వాతి అవకాశం ఇవ్వడంలేదు. అతన్ని చూడగానే ఎందుకో తనమీద పగబట్టి చేస్తున్నాడనుకుంటోంది.

ఆరోజు స్కూల్లో ఏదో ప్రోగ్రామ్ ఉంది కాస్త చీకటిపడవచ్చు పొద్దుట అక్కగారికి చెప్పింది ఆలస్యమవుతుందని.

ఉత్తర జ్వరంతో మంచంమీద పడింది ఆ దెబ్బలు ఇంకా పూర్తిగా మానలేదు. వళ్ళంతా పచ్చి ముద్ద. అటు ఇటు సరిగా కదల లేకపోతుంది. చెల్లెలికి ఏదైనా జరుగుతుందని ఆమె భయం. అందుకే "స్వాతీ! జాగ్రత్త! నడిచిరాకు. రిక్షామీద రా!" అంటూ ఎన్నోసార్లు చెప్పింది.

"మరేం పరవాలేదక్కా!" అంటూ బయలుదేరింది.

ప్రోగ్రాం పూర్తి అయింది. అనుకున్నట్టుగానే చీకటి బాగా పడింది.

ఎక్కడా రిక్షా దొరకలేదు. చేసేదిలేక నడుచుకుంటూ స్కూలు నుంచి మైన్‌రోడ్డు వరకు బయలుదేరింది. అక్కడ రిక్షాలుండే వుంటాయి. నాలుగు అడుగులేస్తే మైన్‌రోడ్డు రానేవస్తుంది. ఇంతలో వెనకనుంచి ఎవరో వచ్చి కర్రతో నెత్తిమీద బలంగా వేశాడు. తల తిరిగింది స్వాతికి. రక్తం కారుతోంది. లేని బలం తెచ్చుకుని కళ్ళు విప్పి చూసింది. ఎదురుగా బావగారు, మరోవ్యక్తి. తలమీద బాధను లెక్కచెయ్యకుండా వాళ్ళమీదకు కలియబడింది స్వాతి. అపరకాళిలా వున్న స్వాతిని చూడగా, బావగారు పక్కకు తప్పుకున్నాడు. ఆ వచ్చిన వ్యక్తిమీద కలియబడింది స్వాతి. అంతలో "స్వాతీ! అంటూ రాజా అక్కడకు వచ్చి స్వాతిని పక్కకు -సి అతనితో కలియబడ్డాడు

రెండు దెబ్బలతో అతను నేలమీద పడ్డాడు. అక్కడవున్న రిక్షా వాళ్ళు చుట్టుముట్టారు. రోడ్డుమీద జనం పోగయ్యారు.

వెంటనే అక్కడ వున్న ఒక రిక్షా మాట్లాడి స్వాతిని అందులో కూర్చోపెట్టాడు. ఆమెను పట్టుకుని ఆమె పక్కనే కూర్చున్నాడు. జేబులో ఉన్న రుమాలు తీసి తల గాయానికి కట్టుకట్టాడు.

స్వాతి అతని వడిలో వాలిపోయింది. ఆ క్షణంలోనే మొదటి సారిగా అత. తన ప్రియబాంధవుడు అనుకుంది. వడిలో వాలి పడు కున్న స్వాతిని ఆప్యాయంగా పొదివిపట్టుకున్నాడు. రాజా స్వాతి చెంపలు నిమిరాడు.

ఇంతలో హాస్పటల్ వచ్చింది. ఆమెను దింపి కట్టుకట్టించాడు. మందులు తీసుకుని ఆటో మాట్లాడాడు. స్వాతిని మెల్లిగా ఎక్కించి తాను కూర్చున్నాడు. అతని హృదయం మీద వాలిపోయింది స్వాతి.

రెండు చేతులతో ఆమెను హత్తుకున్నాడు ఇద్దరిలో ప్రేమ పొంగివచ్చింది.

"స్వాతీ!" అన్నాడు మత్తుగా.

"రాజా!" అంది బాధతో యగా.

రాజా ఆమెను మరింత దగ్గరగా తీసుకున్నాడు. విడిపించు కోవాలనుకుని స్వాతి అతనికి మరింత దగ్గరగా జరిగింది.

"రాజా! నన్ను వదలవుగా?"

"వదలను. ఎప్పటికీ వదలను. నువ్వు పెళ్ళికి ఓకే అనాలి. నింట్లో ఇలాగే ఉంటాం. అంటూ ఆమె చెవిలో చెప్పాడు రాజా. ంందంతో మెలికలు తిరిగిపోయింది స్వాతి.

ఇంటిముందు ఆటో ఆగగానే బామ్మగారు, ఉత్తరకూడా తొంగి చూశారు. బామ్మ గారు తలుపుతీసింది.

ఎదురుగా స్వాతిని నడిపించుకుంటు వస్తున్న వ్యక్తితో పాటు స్వాతి తలకు కట్టు చూసిన ఉత్తర "స్వాతి" అంటూ ఘొల్లుమంది.

"స్వాతీ! ఏం జరిగిందమ్మా" ఏడుస్తూ అడిగింది.

లోపల వరకు తీసుకొచ్చి మరో మంచం మీద పడుకోబెట్టాడు స్వాతిని. తర్వాత రాజా జరిగిందంతా చెప్పాడు. బామ్మగారు రాజాను కూర్చోమని మరోసారి వివరాలు అడిగి తెలుసుకుంది. తర్వాత కాఫీ

పెట్టి రాజాకు ఇచ్చి స్వాతి చేత తాగించింది ఆవిడ.

"నాయినా పేరు చెప్పలేదు!" అంది బామ్మగారు.

"నేను స్వాతితో కరాటె నేర్చుకుంటున్నానండి నా పేరు రాజా!"

"అలాగా బాబూ! ఏం చేస్తున్నావు?"

"బాంకులో కొత్తగా ఉద్యోగ మొచ్చిందండి బి. ఎ. పాస య్యాను!"

అలాగా? నాన్నగారు అమ్మగారు ఎక్కడ వుంటారు?"

"ఈ ఊళ్ళోనే ఉంటారండి. మా నాన్నగారు సెక్రటేరియట్‌లో పనిచేస్తారు."

అతను మాట్లాడే పద్ధతి అతని ఉద్యోగం అతని వివరాలు అన్నీ నచ్చాయి బామ్మగారికి.

ఇలాటి బుద్ధిమంతుడు స్వాతిని పెళ్ళి చేసుకుంటే ఎంత బాగుం డునో అనుకుంది మనస్సులో.

"బాబూ! మా స్వాతి చాలా బుద్ధిమంతురాలు సుమా!"

"అవునండి మహా గడుసు!"

"స్వాతి మీద నీ అభిప్రాయం ఏమిటి బాబూ!"

"మీరు అంగీకరిస్తే స్వాతి నేను పెళ్ళి చేసుకుంటాం!"

"అంతకంటేనా బాబూ! మీ తల్లి తండ్రులు అంగీకరించాలి కదా!"

"వాళ్ళకి ఎప్పుడో చెప్పాను, నేను స్వాతి ప్రేమించుకున్నాం!"

"చెప్పావు కాదేం స్వాతీ! అమ్మదొంగా! పెళ్ళి అక్కరలేదు అక్కరలేదని ఇదా నువ్వు చేసిన ఘనకార్యం" అంది బామ్మగారు.

ఉత్తర సంతోషానికి అంతేదు. తాను పెంచి పెద్ద చేసిన చెల్లి చాలా అదృష్టవంతురాలు. ఉత్తముడైన భర్త ఎదురుగా నిలబడ్డాడు. అనుకుంది.

"నాయనా మీ యింటికొచ్చి మీ వాళ్ళతో మాట్లాడతాను" అంది.

బామ్మ గారు.

"రేపు వచ్చి నేనే -సుకు వెడతానండీ!" అన్నాడు.

"ఉత్తరకు తగ్గాక వస్తాము బాబూ" అంది ఆవిడ.

"మా నాన్నగారు రిటైరు అయ్యారు. అందుకే ఇక్కడ నుంచి మాపల్లెటూరు వెళ్ళిపోవాలనుకుంటున్నారు అందుకనం "

"బామ్మ గారూ! నాకదే తగ్గుతుంది. మీరు వెళ్ళి మాట్లాడి రండి." ఎక్కడ దాటిపోతుందోనని భయపడింది ఉత్తర.

"ముత్తయిదువ లేందే నేనెలా వెళ్ళాలమ్మా" అంది బామ గారు.

"మాకు అలాటి వాటి మీద నమ్మకం లేదండి రండి అన్నాడు రాజా. తర్వాత శలవు తీసుకుని బయలుదేశాడు.

అతను వెళ్ళగానే "ఎంత బుద్ధిమంతుడో అదృష్టవంతురాలివి స్వాతి" అంటూ ఆమె పక్కలో కూర్చుని ఆమె వళ్ళు నిమిరింది.

ఆ సంతోషంలో ఆ రాత్రి ముగ్గురికి నిద్దర్లేలేవు. పొద్దుటే వెళ్ళి శ్యామసుందరీదేవితో చెప్పాలనుకున్నారు.

"అంతవరకు చెల్లెలు రహస్యంగా ఉంచినందుకు కాస్త బాధ ింది. ఉత్తర ఆమాటే అడిగింది.

"లేదక్కా ఆరోజు ను ఇతనితోనే పోట్లాడాను" అంటూ జరిగి వంతా చెప్పింది. అందరిలో బుద్ధిమంతుడని చెప్పింది. ఆ మాటలు విన్నాక ఉత్తర మనస్సులో కోపం పోయి సంతోషం పెరిగింది.

* * *

అప్పుడే శ్రీకాంత్ స్నానానికి లేచి వెళ్ళాడు శ్యామసుందరీదేవి మెల్లిగా సర్వయ్యను పిలిచి శ్రీకాంత్ ఎలా వున్నాడని అడిగింది. "ఈ నాలుగు రోజులు బయటికె వెళ్ళలేదు మీ దగ్గరే కూర్చున్నారు.

చాలా మారిపోయారు. మీకోసం చాలా బెంగ పెట్టుకున్నారు!" అన్నాడు సర్వయ్య! ఆమెకు శ్రీకాంత్ పై కోపం తగ్గించాలని అతని ఉద్దేశ్యం.

'పోనీలే నాకు జబ్బు చేయటం మంచి పనే అయింది' అంది ఇంక మాట్లాడలేక కళ్ళు మూసుకుంది.

కార్తీక వచ్చి మందు వేసింది ఆవిడకు నిద్ర పట్టింది. దుప్పటి కప్పింది కార్తీక.

సర్వయ్య వంట పనిలోకి వెళ్ళిపోయాడు.

శ్రీకాంత్ గదిలో- ఉన్నాడు.

ఇంతలో రోహిణి వీధి తలుపులు తీసుకుని లోపలికి వచ్చింది. కార్తీక పక్కకు తప్పుకుంది. రోహిణి మెల్లిగా మెట్లెక్కి మీదికివెళ్ళింది. అతని గది తలుపులు తెరిచేఉన్నాయి. శ్రీకాంత్ రోహిణిని చూసి ఉలిక్కిపడ్డాడు. ఆమె లోపలికి రాగానే అటు ఇటు చూసి తలుపులు మూసేశాడు. కార్తీకకు ఏదో అనుమాన మనిపించింది. ఆమె వెన మీది కెళ్ళింది. అతని గది పక్కనే వరండాలో స్తంభం చాటున నిల బడింది. లోపలి మాటలు స్పష్టంగా వినబడుతున్నాయి.

"ఎందుకొచ్చావిక్కడికి." శ్రీకాంత్ గొంతు తీవ్రంగా ఉంది.

"శ్రీకాంత్ నిన్ను నమ్మి సర్వం అర్పించాను. పెళ్ళి చేసుకుంటానని మాట ఇచ్చావు. తల్లిని కాబోతున్నానని తెలిసి తప్పించుకు తిరుగుతున్నావు?"

"అంతా అబద్ధం! నన్ను నీ వలలో వేసుకోడానికి ఆ నాటకం నేను నమ్మను."

"శ్రీకాంత్ అంతమాట అనకు. నన్ను పెళ్ళి చేసుకుంటానన్నావు. ఇప్పుడు నువ్వు కాదంటే మా నాన్న చంపేస్తాడు,"

"అనవసరంగా ఇక్కడ అల్లరి చెయ్యకు. ముందు నువ్వు

పరిస్థితిలో ఉంది. ఇక్కడ నుంచి వెంటనే వెళ్ళిపో!"

"నేను వెళ్ళను. నువ్వు పెళ్ళిచేసుకుంటానంటే తప్ప , ను కదలను. మీ అత్తయ్య ఉంటే నాకేం! ముందు నా సంగతి చెప్పు?"

"రోహిణీ! ముందు వెడతావా! వెళ్ళవా?"

"నేను వెళ్ళను. ఏం చేసుకుంటావో చేసుకో?"

"రోహిణీ! నే వస్తానంటున్నాగా. నువ్వు వెళ్ళు?"

"పెళ్ళి సంగతి ముందు చెప్పు?"

"అలాగే చేసుకుందాం! సాయంకాలం మాట్లాడుకుందాం సరేనా?"

"సరే."

తర్వాత రోహిణి తలుపు తీసుకుని గబగబా నడుచుకుంటూ బయటకు వెళ్ళిపోయింది.

శ్రీకాంత్ తిరిగి తలుపులు పెట్టుకున్నాడు.

లోపల ఏం చేస్తున్నాడోనని తొంగిచూసింది కార్తీక.

చేతులు వెనక్కి కట్టుకుని అటు ఇటు తిరుగుతున్నాడు.

అభిరామ్‌కి రోహిణి విషయం చెప్పాలా వద్దా అనే విషయం తేల్చుకోలేక తికమకపడుతూ కిందకి వచ్చేసింది కార్తీక. తల్లికి మాత్రం ఆ విషయం చెప్పకూడదనుకుంది.

తర్వాత తల్లి దగ్గరకు వెళ్ళి కూర్చుంది.

మెలకువ వచ్చిన ఆవిడ కళ్ళు విప్పి కూతురుకేసి చూసింది. చేత్తో కార్తీక చేతులు నిమిరింది. ఇంకా బాగా నీరసంగావుండి ఎక్కువ మాట్లాడలేకపోతోంది. అయినా కూతురు ఎలా వుందోనని ఆవిడ భయం.

"అన్నం తిన్నావా?" అడిగింది.

"శ్రీకాంత్ నువ్వు భోజనం చెయ్యండి." పాత సంఘటన ఎక్కడా గుర్తులేనట్టే చెప్పింది.

కాని సర్వయ్య మాత్రం ఆ విషయం మర్చిపోలేదు. శ్రీకాంత్ రోహిణుల స్నేహం అతను కొంతవరకు అర్థంచేసుకున్నాడు. రోహిణంటే అతనికి సరియైన అభిప్రాయం లేదు. శ్రీకాంత్ కార్తీకను వివాహం చేసుకుంటేనే సుఖపడతాడని అతని నమ్మకం. కాని మధ్యలో ఈ గొడవ వచ్చిపడింది. శ్యామసుందరీదేవి కోలుకోగానే శ్రీకాంత్ కార్తీకల వివాహం జరగడం చాలా అవసరమనుకున్నాడు సర్వయ్య.

వంట పూర్తిచేసి అన్నీ టేబులుమీద సర్ది శ్యామసుందరీదేవి పడుకున్న గది గుమ్మం దగ్గరకు వచ్చి ఆగాడు.

"అమ్మా! వంట పూర్తయింది. వడ్డించమంటారా!" కార్తీకను చూస్తూ అడిగాడు.

"బావను పిలు ఉదయం టిఫిన్ కూడా తినలేదు. నేను కొంచెం సేపున్నాక తింటాలే?" సమాధానమిచ్చింది కార్తీక.

కార్తీక మనస్సులో ఏముందో అతనికి అర్థం కాలేదు. మెట్లెక్కి పైకి వెళ్ళాడు వేసున్న గదితలుపులు కొడుతూ అన్నానికి రా బాబూ" పిలిచాడు.

అసలే చికాకుగా వున్న శ్రీకాంత్‌కు సర్వయ్య పిలుపు మరింత కోపాన్ని తెచ్చిపెట్టింది. "యు గెటవుట్" అంటూ అరిచాడు. శ్రీకాంత్‌కు అంత కోపం రావటానికి కారణం తెలియని సర్వయ్య మరేమీ అనకుండా మెట్లుదిగి వచ్చేశాడు.

* * *

యూనివర్సిలో చేరుతానని పట్టుపట్టింది కార్తీక. ఎకనామిక్స్‌కు అప్లయి చేసింది. అనుకున్నట్టుగానే అందులో సీటు వచ్చింది. ఎకనామిక్స్ ఎమ్.ఏలో చేరింది. రోజూ యూనివర్శిటీకి వెళ్ళి రావడానికి

ఎంతో సరదాపడింది కార్తీక.

అప్పటికి శ్యామసుందరీ వి బాగా కోలుకుంది. కాని పెళ్ళి విషయం మళ్ళీ అడగలేదు. ఆవిడ బలవంతం చెయ్యలేకపోయింది. ఇద్దర్నీ చూస్తుంటే ఆవిడకు ఏదో అనుమానం నలిగింది. బలవంతకగా పెళ్ళి చేయడం అంత మంచిది కాదనుకుంది. అందుకే తొందర పడ కుండా ఆగడం చాలా మంచిది. అనవసరంగా తను ఆరాటపడటం అర్థంలేని దనుకుంది. మనస్సును కాస్త దిటవుపరచుకొని ప్రశాంతత ఏర్పరచుకుంది

మరోపక్క "ఏది ఎలా జరగాలో జరుగుతుంది. తాను నిమిత్త మాత్రురాలు వాళ్ళు అనుకున్ననా పెళ్ళి చేస్తాను." అని కాస్త వైరాగ్యధోరణి కూడా అలవాటు చేసుకుంది. మిగిలిన సమయంలో భగవద్గీత చదువుకుంటోంది.

కారు సాధారణంగా శ్రీకాంత్ తీసుకువెడుతున్నాడు. కార్తీక యూనివర్సిటీకి బస్సుమీదే వెళ్ళివస్తోంది.

ఎన్నోసార్లు ...కాంత్ రోహిణులు కార్లో వెళ్ళడం చూసింది ...ర్తీక. వర్తించుకోవడం మా... సింది. తాను విన్న విషయం అభిరామ్‌కు ...లేకపోయింది కార్తీక. ఏ చెల్లెలికి అలా జరిగిందని తెలిస్తే ఏ అన్న ...ంచగలడు. అందుకే కొన్నాళ్ళు తను బయటపడటం మంచిది దనుకుంది. అభిరామ్ కొత్తగా నర్సింగ్‌హోమ్ మొదలుపెట్టాడు. అందుకే మునుపటిలా కార్తీకను కలుసుకోలేకపోతున్నాడు. ఆమెను చూడకుండానూ ఉండలేకపోతున్నాడు.

పైగా కార్తీక ఆరోజు పెళ్ళి చేసుకోనంటే శ్యామసుందరీదేవి గుండె నొప్పిలో పడిపోవడం వివరంగా చెప్పింది. అందు యింటికి వెళ్ళడం మంచిది కాదనుకున్నాడు. తన మూలంగా ఆ యింట్లో గొడ వలు జరగకూడదనుకున్నాడు. ఎవరిని నొప్పించడం అతనికి ఇష్ట

ముందదు. ఆమెకు జబ్బు చేసిందనీ విన్నప్పుడు డాక్టరుగా తన విధి నిర్వర్తించాలనుకున్నాడు కాని తనను చూడగానే ఆమె తిరిగి పడి పోతే ప్రమాదం మనిషే దక్కదు. అందుకే కాస్త తగ్గి స్థిమిత పడ్డాకే శ్యామసుందరీదేవిని చూడాలనుకున్నాడు.

ఆరోజు ఎందుకో కార్తీక కళ్ళముందు ప వ కనబడతోంది నర్సింగ్‌హోమ్‌లో పెద్దపని కూడా లేదు. ఎవరైనా వస్తే చూడమని జూనియర్‌కి అప్పచెప్పాడు. ఆ టైమ్‌లో కార్తీక యూనివర్సిటీలో ఉంటుందని తెలుసు. అక్కడే ఆమెను కలుసుకుని మాట్లాడాలను కున్నాడు. అందుకే కారు సుకుని యూనివర్సిటీ వైపు బయలు దేరాడు.

కార్తీక క్లాసులో ఉంది. క్లాసులోంచి పిలవడం అతనికి ఇష్టం లేదు. క్లాసు రూమ్‌కి బయటగా నిలబడ్డాడు. చెల్లెలు రోహిణి కూడా అక్కడే చదువుతోందని గుర్తుకు వచ్చి ఆమె డిపార్టుమెంటు వైపు వెళ్ళాడు. అక్కడ ఒక అబ్బాయిని పిలిచి అడిగితే ఆమె క్లాసుకే రావడంలేదని చెప్పాడు. పైగా 'ఆవిడకి చదు మిటండి' అంటూ పళ్ళికిలించాడు. అభిరామ్‌కు ఆ క్షణంలో అతనిమీద చెప్పలేని కోపం వచ్చింది.

అయినా కంట్రోల్ చేసుకున్నాడు. అతనిని తిడి ఏం పయో జనమనుకున్నాడు. అందుకే తిరిగి కార్తీక దగ్గరకు వచ్చాడు.

ఆమె క్లాసునుంచి రాగా ఇద్దరు బయటకు వచ్చారు. చాలా రోజులకు చూడ్డంవల్ల ఇద్దరిలోను సంతోషం పొంగి ఉరకలేసింది. అందు ఏవో కాలేజీ కబుర్లు చెబుతూ ఇద్దరు చెయ్యిపట్టుకు నడుస్తు న్నారు, ఇద్దరు అలా నడుచుకుంటూ వెళ్ళి ఎదురుగా ఉన్న గార్డెన్‌లో కూర్చున్నారు. వారిద్దరిని శ్రీకాంత్ గమనిస్తూనే ఉన్నాడు. ్రకాంత్ అభిరామ్ చెల్లిలితో అంత చనువుగా ఉంటున్నా అతని

మనస్సంతా కార్తీక మీదేఉంది. ఆమె. వివాహం చేసుకోవాలని అతని ఉద్దేశం అభిరామంటె చెప్పలేని కోపంగాఉంది. వారిద్దరు కలుసుకో కుండా ఉండాలన్న అతని ధ్యేయం అందు అభిరామ్‌ని గమనిస్తు న్నాడు. శ్రీకాంత్ ఆ వేళప్పుడు అభిరామ్ యూనివర్సిటీ వైపు వెళ్ళడం చూసాడు. తప్పకుండా కార్తీకను కలుసుకోడానికే వెడుతున్నాడని నిశ్చ యించుకున్నాడు. అందు అభిరామ్ వెనక బయలుదేయరాడు.

ఈర్ష్య మనిషిని పతనం చేస్తుంది. మనిషిని దిగజారుస్తుంది. శ్రీకాంత్ విషయంలో అదే జరిగింది. అతను ఫారెన్ వెళ్ళి మెడిసిన్ చేసి వచ్చాడు. కాని ఈర్ష్య అతని వివేకాన్ని నాశనం చేసింది. వైద్యు డననే విషయం మరిచిపోయాడు. ఆ యిద్దరుచేతులు పట్టుకుని హాయిగా వెడుతుంటె చూసి సహించలేక పోయాడు. ఆమెను ఎవరుతాకినా అతని హృదయం తల్లడిల్లిపోతుంది. గుండెలు పట్టుకుని ఎవరో పిండేస్తు న్నట్లుగా బాధపడ్డాడు. చిన్నతనంనుంచి ఆమె తన భార్య అందరు అనడంవల్ల ఆమె నిజంగా తన భార్యే అనుకున్నాడు. చిన్న తనంలో ఆమెమీద పెత్తనం చెలాయించేవాడు. కార్తీక పసితనంవల్ల ఃవిషయం తెలుసుకోలేకపోయింది. అందు అతను చెప్పిన పసల్లా సేది.

అతనివెంటే తిరిగేది. శ్రీకాంత్ ఫారిన్‌నుంచి తిరిగివచ్చాక కూడా ఆమె తన భార్యగానె ఊహించుకున్నాడు. కాని కార్తీకలో మార్పు వచ్చింది. ఆమెకు వయస్సురాగా అభిరామ్ అందంగా ఆమెకంట పడ్డాడు. అతని శ్రీకాంత్‌ని పోల్చిచూసుకుంది. అభిరామ్ గుణాలు ఆమెకునచ్చాయి. అతనివైపు ఆమె మనస్సు మొగ్గుచూపింది. ˣమంగా శ్రీకాంత్‌లోని అవలక్షణాలను ఆమె పసికట్టింది. అతనికి దూరంగా ఉండడానికి ప్రయత్నిస్తోంది. శ్రీకాంత్ వివాహం కాకుండానె కొన్ని సుఖాలు చవిచూడాలనుకున్నాడు. అభిరామ్ చెల్లెలు అతనికి చేరువయింది

అది అవకాశంగా తీసుకుని ఆమెను మోసం చేసాడు. అది తెలిసిన కార్తీక అతన్ని మరింత ద్వేషించుకుంటోంది. కాని శ్రీకాంత్ ఎలాగైన ఆమె వివాహం చేసుకోవాలనుకుంటున్నాడు.

అందుకే కార్తీక అభిరామ్ చేయిపట్టుకుని నడవడం చూడలేక పోయాడు. వారిదగ్గరకు వెళ్ళి కార్తీకను తీసుకుని యింటికి వెళ్ళిపోవా లనుకున్నాడు. కాని కార్తీక రానంటుందని తెలుసు అందుకే, కోపంతో అక్కడనుంచి బయటకు వెళ్ళిపోయాడు.

కార్తీక అభిరామ్ కూడా అతన్ని గమనించలేదు. వారికబుర్లలో వారున్నారు. పసిపిల్లల్లా కబుర్లు చెప్పకుంటూ నవ్వుకుంటున్నారు. పల్లీ లమ్మేవాడు వస్తే పిలిచికొన్నాడు అభిరామ్. కార్తీక వళ్ళో ఆ పొట్లం పెట్టి ఇద్దరు ఒలుచుకు తింటున్నారు.

"కార్తీ! ఇప్పుడు మీబావ చూస్తే ఏమంటాడు"?

"తోక తెగిన కోతిలా గంతులేస్తాడు?" ఆమాటలు చెబుతూ పకపక నవ్వింది కార్తీక.

తోక తొక్కిన పాములా బుస్సలు కొడతా మో?"

"ఆ! ఆ! భయపడేవాళ్ళుంటే మరింత బుస్సలు కొడతాడు. నాకేం భయం" మరింత నవ్వింది కార్తీక.

నవ్వుతుంటె సొట్టలుప ఆమె బుగ్గలను కళ్ళు వాల్చకుండా చూసాడు అభిరామ్. అది గమనించిన కార్తీక "చూపులు మార్చుకో" అని కళ్ళతో బెదిరించింది.

"చిత్తం. దేవి దయ. అలాగె మార్చుకుంటా! అయినా ఇంతకీ మీ బావ ఈవేళప్పుడు నిన్ను వెతుక్కుంటూ వస్తాడా?"

"కాదు అభిరామ్. అతనెప్పుడూ నాకోసంరాడు. నువ్వు నిదా నంగా ఆలోచిస్తానంటె ఒక్క మాట. అతనెప్పుడు మీ చెల్లెలికోసం వస్తాడు. ఇద్దరు చనువుగా తిరుగుతున్నారు. మీ చెల్లెలికి అతన్నిచ్చి

పెళ్ళి చెయ్యడం మంచిదనుకుంటా!"

"కార్తీ! నేనూ అదే అనుకుంటున్నాను. మా నాన్నగారితో, మా అమ్మతో మాట్లాడుతాను వాళ్ళ పెళ్ళిలోనే మన పెళ్ళికూడా జరిగే టట్టు చూస్తాను. అమ్మాయిగారు పెళ్ళి పీటల మీద ఎంత అందంగా ఉంటుందో చూసుకోవాలని ఉంది! తెలిసిందా!" రెండు చేతులలో ఆమె

నెకెత్త బోయాడు. కార్తీక తప్పించుకుని దూరంగా జరిగింది.

ఇంక లే లే!" కార్తీక తొందరచేసింది. అభిరామ్

పట్టుకుని లేచాడు. కార్తీకను ఇంటి దగ్గర వదలి

మ్. కార్తీకను వదలి ఇంక ఎక్కువకాలం ఉండ

* * *

ర్సిటీలో చేరాక కాస్త ఆలస్యంగా వచ్చినా తల్లి

కంలేదు. జ్ఞానంవచ్చిన పిల్ల ఆమెకే అన్నీ

గా తానొకటి తలిస్తే వేరొకటి జరుగుతోంది.

కూడా ఏమీ అడగలేదు.

మార్చుకుని వచ్చి తల్లిపక్క కూర్చుంది.

వద్దీత పక్కకు పెట్టింది.

ు వచ్చి వెళ్ళారు."

ళ్ళట!"

పెళ్ళా? ఎప్పుడు? ఎవరితో?" ప్రశ్నలవర్షం కురి

స్వాతితో కరాటే ర్చుకున్నాట్ట. పైగా బ్యాంకులో ఉద్యోగం

కారేకింవెట. అందరి పెళ్ళిళ్ళు అవుతున్నాయి. మీ పెళ్ళి సంగ తేలడం లేదు." కాస్త బాధగా అంది ఆ తల్లి.

"ఇలాగే ఎప్పుడో నా పెళ్ళి ముహూర్తాలు పెట్టేదుపుగాని. నా పెళ్ళికోసం బెంగ పెట్టుకుకోకు - స్వాతిని చూసి ఇప్పు వస్తా" ఆవిడ చెప్పే మాటలు వినకుండానే కార్తీక బయటకు పరుగెత్తింది.

"ఏమిటో పసితనం పోలేదు. పిచ్చి పిల్ల." "శ్యామసుందరినేవి ఆమాటలు పైకే అంది.

* * *

స్వాతి గుమ్మంలో ఎదురయింది.

"హాయ్‌స్వాతీ" అంటూ కార్తీక స్వాతిని కౌగలించుకుని నుదుటిమీద ముద్దు పెట్టుకుంది.

"నాతో చెప్పకుండా పెళ్ళికుదుర్చుకున్నావా? అమ్మ దొంగా! నిన్ను గుంజీలు యిస్తానుండు" స్వాతి చెవి మెలేసింది.

"నన్నేం గుంజీలుతీయిస్తావే? మీబావని తీయిస్తున్నావుగా చాలు? చాలు?" అంటు చెవిని విడిపించుకోడానికి ప్రయత్నించింది.

అంతలో ఇద్దరిని చూస్తున్న ఉత్తర అక్కడకు వచ్చింది.

"కార్తీ! స్వీటు, నోరుతెరు" అంటూనే కార్తీకనోటికి స్వీటు అందించింది. కార్తీక స్వాతిచెవి వదలి వేసింది.

స్వాతి పకపకా నవ్వుతూ దూరం జరిగింది. ఉత్తర దెబ్బలు పూర్తిగా మానాయి. స్కూలుకి వెడుతోంది. అయినా ఇంకా బాగా నీరసంగా ఉంది. కార్తీకను చెయ్యి పట్టుకు తీసుకువెళ్ళింది. మంచంమీద పక్కనే కూర్చోపెట్టుకుంది. మరోపక్క స్వాతి కూర్చుంది. ఉత్తర స్వాతి పెళ్ళి సంగతంతా వివరంగా చెప్పింది. అంతలో బామ్మగా

అక్కడకు వచ్చారు. బామ్మగారు ఏవిధంగా పెళ్ళి కుదిర్చింది మరో సారి చెప్పింది. కార్తీక సంతోషంగా వింది.

తర్వాత స్వాతి కొనుక్కోవలసిన పట్టుచీరలు, మామూలు చీరలు వస్తువులు అన్ని నిర్ణయించుకున్నారు.

"ఉత్తరా! స్వాతి అత్తవారింటికెళ్ళి పోతుందా?" కార్తీక భయంగా అడిగింది.

"రాజా తల్లితండులు ఈ వూరినుంచి వెళ్ళిపోతున్నారు. వాళ్ళకి కూడా సొంతయిల్లులేదు. ఎక్కడో అద్దెకు సుకోవాలి. మాది సొంత యిల్లేకదా! అందుకని ఇక్క ఉంటారు" సమాధానమిచ్చింది ఉత్తర.

"స్వాతి ఇక్క వుంటుందన్నమాట." కార్తీక సంతోషం పట్ట లేక స్వాతి రెండుచేతులు పట్టుకుని ఊపేసింది.

స్వాతి పెళ్ళయ్యేవరకు బామ్మగార్ని అక్కడే ఉండమన్నారు. ఆవిడ సరేనంది. అందుకే ఆవిడ వాళ్ళను తనింటికి తీసుకెళ్ళే ఉద్దేశం విరమించుకుంది. స్వాతి అందరికి టీ కలిపిఇచ్చింది. బామ గారు ఏదో పుందని బయటకు వెళ్ళింది.

"కార్తీ! నీ పెళ్ళివిషయం ఏంచేసావు?" ఉత్తర మెల్లిగా డిగింది.

"ఇంకా ఏమీ ఆలోచించుకోలేదు ఉత్తరా! నేను అభిరామ్ ని చేసు కుంటానన్నది నిజం, కాని మాబావ రోహిణితో అలా విచ్చలవిడిగా తిరుగుతూ నన్ను పెళ్ళిచేసుకుంటాననడం ఆశ్చర్యంగా లేదూ?"

"ఆశ్చర్యంగానె ఉంది?కాని శ్రీకాంత్ రోహిణితో అంతచనువుగా ఉంటాడా? అంటే!" రెట్టించింది ఉత్తర.

"అవును ఉత్తరా? రోహిణి గర్భవతి! ఆమె పెళ్ళిచేసుకోమని మాయింటికే వచ్చి మా బావను బతిమాలింది. కాని మా బావ అంగీక రించలేదు. పైగా ఆమెను తప్పించుకు తిరుగుతున్నాడు.

"ఈ విషయాలన్నీ మీ అమ్మగారికి తెలుసా?" స్వాతి అడిగింది.

"మా అమ్మగారికి తెలీవు. వాళ్ళవాళ్ళకి తెలియనివ్వను. రోహిణీ మా బావ పెళ్ళి చేసుకుంటె నాకు సమస్య తీరిపోతుంది. మా అమ్మ మనసు నొప్పించకుండా మా పెళ్ళి జరుగుతుంది. దానికోసం నేను, అభిరామ్ ఎదురుచూస్తున్నాము. మాబావ ఏంచేయదలుచుకున్నాడో తెలీడం లేదు."

"ఎన్నాళ్ళు రోహిణిని తప్పించుకు తిరుగుతాడు. ఆమె సామాన్యురాలు కాదు. అందుకే సమయంకోసం ఎదురుచూడు కార్తీ! తప్పకుండా నీ పెళ్ళి త్వరలోనే జరగాలని కోరుకుంటున్నా!" స్వాతి మాటలకు పకపకా నవ్వింది కార్తీక.

"ఏదైన అవసరముంటే కబురు చేయండి. వెంటనే వస్తా" అంటు వాళ్ళిద్దరికి చెప్పి ఇంటికి బయలుదేరింది కార్తీక

* * *

రోహిణికి మూడోనెల వచ్చింది. సన్నగాఉండె మనిషి కొంచెం లావెక్కింది. వేళకాని వేళల్లో ఆమె ఇంటికి రావటం బయటకు వెళ్ళడం రోహిణి చెల్లెలికి, తల్లికి కాస్త చిరాకనిపించింది. ఒకరోజు బయటకు వెడుతున్న రోహిణిని నిలదీసింది తల్లి.

"రోహిణీ! ఏమిటే ఆ తిరుగుడు. ఎక్కడికి వెడుతున్నావు?"

"కాలేజీకమ్మా!" కాస్త తడబడింది రోహిణి.

"ఈరోజు శెలవురోజు కదా! కాలేజీ ఏమిటే?"

"స్పెషల్ క్లాసుందమ్మా! ఒక గంటలో వచ్చేస్తాను."

పుస్తకాలు తీసుకుని బయటకు వెళ్ళిపోయింది.

"స్పెషల్ క్లాసులేమిటో? ఈ తిరగటాలేమిటో!" ఆమె వెళ్ళ

పోగానే తల్లి విసుక్కుంది.

"ఎవరిని విసుక్కుంటున్నావు?" అంటు ఆమె భర్త కామేశ్వర రావుగారు లోపలికి వచ్చారు.

"ఆ! ఎవరినీ లేదు? రోహిణికి పెళ్ళీడు వచ్చిందన్న విషయం మీరు మర్చిపోయినట్లున్నారు? ఎక్కడైన మంచి సంబంధం చూసి రోహిణికి పెళ్ళి చెయ్యడం చాలా మంచిది?"

"దానికే అలాగె చేద్దాం! నా ఫ్రెండ్ రామూర్తి తమ్ము నికొడుకు ఒకడున్నాడు. అతను ఇంజనీరు. రోహిణి రాగానే మాట్లాడుదాం!" ఆయన తన గదిలోకి వెళ్ళారు. ఆయన సాధారణంగా యింటి విషయాలు కలుగజేసుకోడు. ముఖ్యమైన విషయాలుంటేనే మాట్లాడుతాడు. ఆయన మాటంటె అందరికీ భయము భక్తి కూడ ఉన్నాయి. భర్త అలా అనడంతో ఆవిడ మనస్సు కాస్త స్థిమితపడింది. రోహిణి రాగానే పెళ్ళి విషయం మాట్లాడి ఏదో ఒక సంబంధం కుదుర్చుకుంటే బాగుండునను కుంది. అలా అనుకోగానే ఆమె మనస్సు కాస్త కుదుటపడింది. రోహిణి ప్రవర్తనలో ఏదో మార్పు ఆమెకు కనబడింది. అది ఎటువంటి మార్పో ఆమె గ్రహించలేకపోయింది. ఆమె మనస్సులో ఏదో ఆందోళన బయలు దేరింది. ఇప్పుడు కాస్త స్థిమితపడింది.

* * *

శ్రీకాంత్ కోపంపట్టలేక క్లబ్ కెళ్ళి కూచున్నాడు. ఎంత ఆలోచించినా అతనికి మార్గం దొరకలేదు. అభిరామ్‌ను కార్తీకనుండి దూరం చెయ్యాలనుకుంటె వారిద్దరు మరింత దగ్గరయ్యారు. కార్తీకను ఎలాగైన తాను దక్కించుకోవాలి, రోహిణిని దగ్గరకు రాకుండాచూడాలి.

కోపంతో అతని చేతులు బిగుసుకున్నాయి. పక్కసీట్లో కూర్చున్న ఆతని స్నేహితుడు గ్లాసు అందించాడు. ఇదివరకెన్నోసార్లు అతను అందించినా తిరస్కరించాడు. కాని ఈరోజు గ్లాసు అందుకుని గటగటా తాగాడు. ఒకసీసా ఖా చేసిన తరువాత తూలుతూ ఇంటికి బయలుదేరాడు

తలుపు సిన సర్వయ్య శ్రీకాంత్‌ను చూసి ఆశ్చర్యపోయాడు. ఆస్థితిలో కార్తికగాని, శ్యామసుందరిదేవికాని చూస్తే అతని జీవితం యింక బాగుపడదనుకున్నాడు. అందుకే మెల్లిగా అతన్ని మీదికి సుకు వెళ్ళి అతని రూములో పడుకోపెట్టాలనుకున్నాడు.

"శ్రీకాంత్ బాబూ" అంటు చెయ్యిపట్టుకోబోయాడు.

"ఎవడివిరా నువ్వు, తప్పుకో: నాచెయ్యి పట్టుకోడానికి నీకెన్ని దమ్ములురా: రాస్కెల్" అంటూ చెయ్యి విదిలుంచుకున్నాడు. అతని మాటలు ముద్దుముద్దుగా వున్నాయి. తూలుతూ లోపలకివచ్చి మెట్లెక్కడం మొనలు పెట్టాడు.

వారి సంభాషణ విన్న కార్తీక అక్కడకువచ్చింది. శ్రీకాంత్‌ను ఆస్థితిలో చూసి ఆశ్చర్యపోయింది. అతన్ని తల్లిచూస్తే మ ళ గుండెలో నొప్పి రాకమానదు. అప్పుడే ఆవిడకు నిద్రపట్టింది. మెల్లిగావెళ్ళి ఆవి గది తలుపులు దగ్గరగా వేసింది.

కార్తికను చూసిన సర్వయ్య తలవంచుకుని అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

"అభిరామ్" ఎన్నాళ్ళు అలా తోటల్లో తిరుగుతావో చూస్తారా; కార్తీని అమాయకురాలిని చేసి ఆట ఆడిస్తున్నావు నీ ఆట నేకట్టిస్తా" అభిరామ్‌ను తిడుతూ గదిలోకి అడుగుపెట్టాడు. ఆమాటలు విన్న కార్తీక మరింత ఆశ్చర్యపోయింది.

"ఉదయం పార్కులో తనతో ఉన్న అభిరామ్‌ని చూసి ఉంటాడు ఏదైన ఇంక పతనం ప్రారంభమైంది; అనుకుంది. అభిరామ్‌ని ఏమి

చెయ్యడుకదా!" ఆ భయంకూడా ఆమెకు కలిగింది. అతను గదిలోకి వెళ్ళాడని తెలియగానె వెళ్ళి తలుపులు మూసుకుని తనగదిలో పడుకుంది. ఆరాత్రి ఆమెకు నిదరాలేదు. ప్రకాంత్ తన జీవితంలో భయంకరమైన సమస్యగా తయారయ్యాడు అతను ఇండియాకు రాకపోయినా బాగుండేదనుకుంది. ఈకథ ఎలా ముగుస్తుందోనని భయపడింది. ఒకపక్క తల్లి అనారోగ్యం మరోపక్క చిన్నతనంనుంచి అంతగా ఉన్న సర్వయ్య ముసలివాడయ్యాడు. బయట చీకటి అంధకారం కీచురాళ్ళ ధ్వనులు చీకటంటే కార్తీకకు చాలా భయం తనకుటుంబంలో కూడా అలాగె చీకటి ప్రవేశించింది." అనుకుని మరింత భయపడింది. రాత్రి గడిచేగానే చీకటిపోయి లోకమంతా వెలుగుతో నిండి కలకలలాడుతుంది. ఈ ప్రకాంత్ తమ జీవితాలనుంచి తప్పుకుంటె తమకుటుంబంలో కూడా చీకటిపోయి వెలుగువస్తుంది" అనుకుని కాస్త ఆశతెచ్చుకుంది. అలా ఆమె ఆలోచనలు సాగుతున్నాయి. ఎప్పటికో నిదలోకి జారింది.

* * *

స్వాతి రాజాల వివాహం ఎంతో నిరాడంబరంగా జరిగిపోయింది. [illegible]రు కలిసి స్వాతి ఇంటిదగ్గర పార్టీ ఏర్పాటుచేసారు. అందరూ [illegible]ంతోషంగా విందుకువచ్చారు. రాజా స్నేహితులకు, స్వాతి స్నేహితురాండ్రకు కూడా వారికోపాలు ప్రేమగా ఎలా మారాయొ మాత్రం అర్థం కాలేదు.

ఏదైన ఇద్దరు పెళ్ళిచేసుకోడం చాలా బాగుందన్నారు. అన్ని విషయాలలోను ఈడు జోడు బాగుందనుకున్నారు. కరాటె రాణీ, రాజాలకు జిందాబాద్ అంటు అరిచారు స్నేహితులు ఇద్దరు హాయిగా కాపురం చేయాలని దీవించారు.

స్వాతి, రాజా ఆయింట్లోనే ఉండడానికి అంగీకరించారు. ఉత్తర

సంతోషానికి అంతులేదు. స్వాతి, రాజాలను చూసి మురిసిపోయింది. తన జీవితం నాశనమయినా చెల్లెలు జీవితం మూడు పువ్వులు, ఆరు కాయలుగా ఉన్నందుకు తన విితం ధన్యమయిందనుకుంది. తల్లి దండులులేని స్వాతిని తానే త్ల్లి, తండ్రియై పెంచుతోంది. తను కన్న కలలు ఈనాటికి ఫలించాయనుకుంది.

అన్ని తంతులు పూర్తిచేసి బాను గారు ఇంటికి వెళ్ళిపోయింది. అక్కచెల్లెళ్ళిద్దరూ తమతో పాటె ఉండమని బతిమాలారు కాని బాము గారు వారి మాట వినలేదు. "పక్క ఉంటాను కద రా! చిటికెవేస్తే తలుపు ‹సుకు వస్తాను" అంటూ వారికి సమాధానం చెప్పింది. ‹రాయింటికి వెళ్ళాక ఆవిడ మనస్సు విలవిల్లాడింది. నా కన్నపిల్లలు - కపోయినా ఉత్తర, స్వాతిని చూసుకుని తన వాళ్ళే అనుకుంది. తండ్రి కూడా పోయిన తరువాత వారికి మరింత చేరువయింది, పెళ్ళికుదిరింది. మొదలు అక్క వుండిపోయింది. మరింటికి రాలేదు. వంటరిగా ఇంట్లో అడుగుపెట్టేటప్పటికి ఆవిడ మనస్సు వికలమయింది. తన గుండె. దూరం చేసుకున్నాననుకుంది.

"ఏమిటో ఈ మమకారాలు. ఓ పక్క వయస్సు వచ్చి మీదపడ తోంది. మరోపక్క ఈ మమకారాల బంధాలేమిటో? ఎప్పటికైన ఇవన్నీ తెంచుకొనిపోవలసిందే కదా. ఇప్పటినుంచే అలవాటు చేసుకోవాలి" అను కుంది.

"మమకారాలే జీవితంలో తీపి మిఠాయిలు. ఉన్నన్ని రోజులు కావలసిన వారి మధ్యలో సంతోషంతో వికసించిన మల్లెపూవులా ఉండాలి. సుఖంగా చనిపోవాలి. చనిపోయే వరకు సంతోషంగా కాల వం చేయాలి. వారికి దూరంగా ఉండలేనా? ఏ చెయ్యో కాలో విరిగితే వాళ్ళే దిక్కు" అనుకుంది. ఇల్లంతా దులిపించుకుని కడిగించుకుంది.

ఆవిడ పనిలోకి దిగాక రుబ లేకుండాపోయింది ఆవిడగారికి.

* * *

రోహిణి చెరిగిన జుట్టుతో వాడిన ముఖంతో నీరసంగా ఇంట్లో అడుగు పెట్టింది.

"అలావున్నావేం రోహిణీ!" ఎదురు వచ్చిన తల్లి ఆదుర్దాగా అడిగింది.

"ఏం లేదమ్మా! కాస్త తలనొప్పిగా ఉంది అం " మంచం మీద వాలిపోయింది. వికారంగా ఉందన్న విషయం తల్లితో చెప్పలేకపోయింది.

అన్నం తినమని తల్లి ఎంత బతిమాలినా రోహిణి తినలేదు.

"కాస్త - డి కాఫీ యియ్యమ్మా!" అంది మూలుగుతూ. ఎప్పుడూ చలాకీగా తిరిగే కూతురు అలా ఉం టప్పటికి ఆ తల్లి గిలగిల్లాడింది.

వేడివేడి కాఫీ కలిపి అందించింది. రోహిణి బద్ధకంగా లేచి కాఫీ తాగి ఖాళీకప్పు తల్లికి అందించింది. తిరిగి మంచం మీద వాలి యింది. తల్లి దుప్పటి సరిచేసి గది తలుపులు దగ్గరగా పెట్టివెళ్ళింది.

రోహిణికి మొదటిసారిగా దుఃఖం పెల్లుబికి వచ్చింది. "నెల ప్పన పిల్లను ఎంత జాగ్రత్తగా చూసుకుంటారో. మామిడి పిందెలు రికి తినాలని, చింతకాయలు తినాలని ఉబలాటపడతారని తానువింది. ఈనాడు తనకి ఏవో రుచులు కావాలనిపిస్తోంది. నిమ్మకాయ ఊరగాయి చప్పరించాలనిపిస్తోంది. పుల్లద్రాక్షలు తినాలపిస్తుంది. కాని తాను ఎంత దురదృష్టవంతురాలు. తాను పైకి ఏమి అనలేదు. ఎవరికి తనబాధ చెప్పలేదు. తన రుచులు ర్చమని కోరలేదు. కాంత్ మాయలోపడి మోసపోయాను" తలగడ తడిసేలా ఏడ్చింది. తన దుఃఖాన్ని ఎవరికి పంచలేదు. శ్రీకాంత్ చాలా దుర్మార్గుడు. తనను మోసంచేసి కార్తీక నే

మా పెండు కొడుకు ఒకడున్నాడు. ఇంజనీరు ఇదిగో ఫొటో॰" అంటు భార్య చేతికి అందించాడు.

"అప్పు ఫొటో ఎలావచ్చిందండీ! ఇందాకేగా అన్నారు" భార్య ఆశ్చర్యంగా అడిగింది.

"ఎప్పుడో ఇచ్చివెళ్ళారు. మనింట్లోనెఉంది. ఇందాక ఫొటోచూసి అడిగాను. అబ్బాయి ఫారిన్ వెడుతున్నాట్ట. పెళ్ళిచేసుకుని అమ్మాయిని •సుకుని వెడతాట్ట."

ఆ ఫొటో అందుకుని తల్లి రోహిణి చేతిలోపెట్టింది. ఆ ఫోటో చూడకుండా, టేబులుమీద పెట్టింది రోహిణి.

"నాన్నగారూ! నా చదువు పూర్తిఅయిన తరువా నేపెళ్ళి చేసుకుంటానం. ప్లీజ్! ఇప్పుడు నన్నేమి బలవంతం చేయకండి" వచ్చే దుఃఖాన్ని అపుకుంటూ రోహిణి గదిలోకి వెళ్ళి మంచంమీద వాలి పోయింది.

ఆపిల్ల అంతబారంగా ఎందుకుందో అ తల్లికి అర్థంకాలేదు.

"రోహిణి అన్నమాటలు నిజమే చదువు పూర్తిఅయ్యాకె పెళ్ళి చెయ్యవచ్చు" కామేశ్వరరావుగారు ఒక నిర్ణయానికి వచ్చినట్లుగా ్కడనుంచి లేచి వెళ్ళిపోయారు. అ తల్లికికూడా అమాటలు నచ్చాయి ం వనిలో మునిగిపోయింది. అంతలో అభిరామ్ ఇంటికి వచ్చాడు. హిణి పెళ్ళివిషయం తల్లిలో చెప్పాలనుకున్నాడు. ఆ తల్లి జరిగిన ంతా కొడుకుతో చెప్పింది.

"అమా ! రోహిణికి ప్రకాంత్ అంటే కాస్త యిష్టంకదా అతన్ని చేసుకుంటుందేమో?"

"అభిరామ్ మొన్న కార్తీక తల్లిని కలిశాను. కార్తీక ప్రకాంతుల పెళ్ళికి ముహుర్తాలు పెట్టారు." ఆ మాటలు అభిరామ్ వినలేకపోయాడు. మెల్లిగా అక్కడనుంచి కదిలాడు. అభిరామ్ ప్రైవేటు నర్సింగ్ హామ్ పారంభించాక •రిక లేకుండా ఉన్నాడు. మధ్యమధ్యతో వెళి

శ్యామసుందరీదేవిని పరీక్షచేసి వెడుతున్నాడు. వేరుగా హాస్పటల్ కట్టటం ప్రారంభించాక మరింత ఖాళీలేకుండా ఉన్నాడు.

ఒకసారి శ్యామసుందరీదేవిని హాస్పటల్‌కి రమ్మని బతిమాలాడు అన్నిపరీక్షలు చెయ్యాలని అతని ఉద్దేశం.

"నా జబ్బులేదు బాబు! నన్నిలా ఉండనియ్యి" ఆవిడ హాస్పటల్‌కి వెళ్ళడానికి నిరాకరించింది.

అభిరామ్ కార్తీక పక్కపక్క తిరుగుతుంటె ఆవిడలో కొత్త ఆశ చిగురించింది." వీరిద్దరికి వివాహంచేస్తేనె బాగుంటుందనుకుంది. అభిరామ్ మీద ఆవిడకు చెప్పని అభిమానం ఏర్పడడం మొదలు పెట్టింది.

* * *

స్వాతి, రాజాలు ఎంతోసరదాగా ఉంటున్నారు. రాజా బ్యాంకులో లోను సుకుని స్కూటర్ కొన్నాడు. ఆరోజు అతని సంతోషానికి అంతులేదు. ఆ రోజు స్కూటర్ ఇంటికివచ్చినరోజు స్వాతీ స్కూటర్‌కి పసుపురాసి బొట్టుపెట్టు" వీధిలోంచె అరిచాడు.

స్వాతి ఆశ్చర్యపోయింది "ఈయన గారికి ఇటువంటి విషయాలు కూడా తెలుసా" అనుకుంది. పసుపు, కుంకుమ, అగరుబత్తులు, పూలు పట్టుకుని వీధిలోకి వెళ్ళింది.

అప్పటికే స్వాతి తలంటుకుని కొత్తచీర కట్టుకుంది. పొడవైన కురులు దువ్వుకుని వదలుగా జడ సుకుంది. కనకాంబరాలు, మరువం, మల్లెపూలు కలిపి కట్టిన మాల జడ నిండుగా పెట్టుకుంది. స్వాతిని చూడగా రాజా మనస్సు ఉప్పొంగిపోయింది.

"స్వాతి అప్సరసలా ఉన్నావు? దివి నుండి భువికి దిగివచ్చిన నా పణయ వతలా వున్నావు" అన్నాడు.

"దేవతలా ఉన్నావు అంటున్నారు. ప్రతను కానా?"

"ఆ-శంతో మాట తప్పిందేమో? నువ్వు నాదేవతవు" అన్నాడు కాస్త బతిమాలే ధోరణిలో.

స్వాతి పకపకా నవ్వుతుంటే అతను శృతి కలిపాడు.

స్వాతి స్కూటర్‌కు పసుపురాసి, కుంకుమ పెట్టి పూలు వేసింది. హారతి వెలిగించి గంట వాయించింది.

"స్వాతి మనం ఈ స్కూటర్ మీద అలా తిరిగివద్దాంరా! అంటూ ఆమె వద్దంటున్నా వినిపించుకోకుండా స్కూటర్ స్టార్ట్ చేశాడు. వెనక సీట్లో స్వాతిని చెయ్యి అందించి కూర్చోమన్నాడు. ఆమె భయ పడుతూనే కూర్చుంది. రాజా స్కూటర్‌ని ఎక్కడెక్కడికో పోనిచ్చాడు. అరగంటలో ఊరంతా చుట్టపెట్టాడు.

"నా ప్రేయసీ! నా డ్రైవింగ్ చూసావా"

"ఓ! చూసా! అద్భుతం" పకపకా నవ్వుతూ చెప్పింది.

"అయి సాయంకాలం సినిమా ప్రయాణం"

"ఓ! దాని ం అలాగే"

ఇంక ఇంటికి పోనీయండి స్వాతి బతిమాలింది. స్కూటర్ ఇంటి ందు ఆపాడు.

ఉత్తర, బామ్మగారు వాళ్ళ కోసం ఎదురుచూస్తూ నిఁబడ్డారు. ్కూటర్ దిగి ఇద్దరు లోపలికి వస్తూంటే ముచ్చటగా చూసింది ఉత్తర. ి కొత్త దంపతుల్ని అంత సంతోషంగా చూడ్డం తన అదృష్టమను ుంది.

"చూశావా ఉత్తరా! స్వాతి ఎంత అదృష్టవంతురాలో అంది బామ్మగారు.

"ఇదంతా మీ చలవ బామ్మగారు. మీరు పెళ్ళి కుదిర్చిదగ్గరుండి చేయించారు. అందుకె ఇంత సుఖంగా ఉన్నారు. వాళ్ళు ఉత్తర మాట

లకు బామ్మగారికి నిజంగానే సంతోషమనిపించింది. ఉత్తరకి మాటి మాటికి స్వాతి జీవితం తనతో పోల్చుకోడం ఇష్టంలేదు. అందుకే తన వసక్తి ఎత్తడం మానేసింది.

"ఏమిటోనమ్మా ఇదంతా నీ మంచితనం నా చేతుల్లో ఏముంది? మనం నిమిత్తం మాత్రులం. వాళ్ళిద్దరికి పెళ్ళి జరిగే యోగముంది. అందుకే నే కలగజేసుకున్నా! పైగా కన్న తల్లితండ్రులకి ంసబంధమే. లేదు. వాళ్ళు ఎప్పుడో చనిపోయారు. ఆ భారమంతా నీమీద వుంది ఎవరు తప్పించగలరు? నీ బాధ్యత నువ్వు సక్రమంగా నిర్వహించావు నీ జీవితానికి సరిపడ భారం మోసావు?"

"ఏమిటో బామ్మగారు. నాదేముంది. స్వా అంత చక్కటి ఉత్తమ్ముణ్ని వెతుక్కి తెచ్చుకుంది. మీ సహాయంతోనే పెళ్ళి చేసాను. ఇద్దరు చిలక గోరింకల్లా ఉండటం వారి అదృష్టం అంతే. మనకి ఆ సంతోషం పంచుకునే యోగముంది. అది నా అదృష్టం బామ గారూ."

"నిజం! ఉత్తరా! నిజం. అన్నీ తెలుసున్నదానివి? నీకు ఎవరు చెప్పేదేముంది."

వాళ్ళిద్దరు అలా మాట్లాడుకుంటు వీధుల్లో నిలబడే వున్నారు. స్వాతి, రాజీ భోజనాలు పూర్తి చేసి బయటకు వచ్చారు.

ఉత్తర, బామ్మగారు కబుర్లు ఆపి వారివైపు ప్రేమగా చూసారు!

"అక్కా! మేము సినిమాకి వెడుతున్నాము. నువ్వుకూడా!" స్వాతి మాట పూర్తికాలేదు.

"మీరిద్దరు స్కూటరు మీద వెళ్ళిరండి. మీరు వచాక సినిమా బాగుంటె నేను, బామ్మగారు వెడతాంలే" ఉత్తర మాటలకు స్వాతి ముసిముసి నవ్వులు నవ్వుతూ వెళ్ళి రాజా వెనక సీట్లో కూర్చుంది.

"రాజా! ఈ టైములో రష్ ఎక్కువగా ఉంటుంది. జాగ్రత్త" బామ్మగారు మరోసారి హెచ్చరించింది.

"అలాగేనండి" రాజా, స్వాతి అక్కగారికి, బావ గారికి "బై బై" అంటూ చేతులు ఊపారు. కనుచూపుమేర స్కూటరు కనపడేవరకు వాళ్ళిద్దరు అక్కడే నిలబడ్డాడు.

" నీకైన పెట్టి పుట్టాలె తల్లీ! నీ చెల్లెలు అదృష్టవంతురాలు" అంటూనే బామ గారు లోపలకి వెళ్ళి తలుపులు మూసుకుంది.

ఉత్తర లోపలికి నడిచి వంటిల్లు సర్దుకుని వచ్చి వారపత్రిక తీసి చదువుకోడం మొదలు పెట్టింది.

* * *

శ్రీకాంత్ క్రమంగా క్లబ్బుకి వెళ్ళి యింటికి ఆలస్యంగా రావడం మొదలు పెట్టాడు. సాధారణంగా సర్వయ్యే మెలకువగా వుండి తలుపు తీస్తున్నాడు. అతను గదిలోకి వెళ్ళేవరకు వెనకే వుంటున్నాడు.

ఆరోజు సర్వయ్యకు నిద్రపట్టింది. కార్తీక వెళ్ళి తలుపు తీసింది. కాంత్ లోపల అడుగు పెట్టబోయి తూలి పక్కకు పడబోయాడు. ర్తీక అతని చెయ్యి పట్టుకుని పడకుండా ఆపింది.

"పెళ్ళి చేసుకుంటానని నన్ను నమ్మించి వాడితో కులుకు తున్నావు కదూ! నిన్ను బతకనివ్వను కార్తీకా" అతని మాటలు ముద్ద ముద్దగా వున్నాయి. అతని చేతిలో వున్న కోటూ విసురుగా సోఫా మీద పడేసాడు. కార్తీక పట్టుకున్న చెయ్యి విడిపించుకున్నాడు. రెండు చేతులతో కార్తీక కంఠం పట్టుకున్నాడు. అతని రెండు చేతులు బిగుసు కుంటున్నాయి. అనుకోని ఆ సంఘటనకు కార్తీక గజగజా వణికి పోయింది. అతని చేతులనుండి విడిపించుకోడానికి ప్రయత్నించింది.

కాని అతని బలంముందు ఆమె నిలవలేకపోయింది. అయినా గొంతు పెగల్చుకొని "వదులు! వదులు" అంది. ఆమె కంఠం కీచుగా ఉంది. మాట పైకి రాలేదు.

"అమ్మా! అమ్మా!" అంటు అరవబోయింది.

"అ" అక్షరము మాత్రమే పైకి వచ్చింది.

మెళుకువ వచ్చిన సర్వయ్య చటుక్కున లేచి అక్కడకు వచ్చాడు. ఆ దృశ్యంచూసి కొయ్యబారిపోయాడు. కర్తవ్యం గుర్తుకు వచ్చిన సర్వయ్య "అమ్మా!" అంటూ గట్టిగా కేక పెట్టి ఒక్క అంగలో అక్కడకు పరుగెత్తాడు.

"శ్రీకాంత్ వదులు! వదులు" అంటు అతని చేతులు రెండు వేరు చెయ్యడం ప్రారంభించాడు.

ఆ కేకలకు మెలకువ వచ్చిన శ్యామసుందరీదేవి మంచం దిగి మెల్లిగా అక్కడకు చేరుకుంది. ఆ దృశ్యం చూసి "కార్తీ" అంటు అరిచింది.

యువకుడైన శ్రీకాంత్ బలం ముందు ముసలివాడైన సర్వయ్య బలం చాలలేదు. అయినా ప్రయత్నిస్తునే ఉన్నాడు. "శ్రీకాంత్ వదులు; వదులు" అంటు కార్తీక కంఠం విడిపించడానికి మరింత ప్రయత్నించాడు. కాని ప్రయోజనం లేకపోయింది. సర్వయ్య కోపం తారాస్థాయికి చేరింది. శ్రీకాంత్ జుట్టు పట్టుకుని దవడలు రెండు వాయించాడు.

"శ్రీకాంత్ నీకి ఇంట్లో స్థానంలేదు వెళ్ళిపో" అంటు అరిచాడు. సర్వయ్య కంఠం ఉరుములా వినబడింది. ఆ దెబ్బలతో ఆ అరుపుతో మత్తు వదిలిన శ్రీకాంత్ చేతులు కార్తీక కంఠం మెల్లిగా వదిలినేసాయి. పులిపట్టు తప్పిన మేకలా వణికిపోతూ కార్తీక తల్లి మీద వాలిపోయింది.

"పవిత్రదేవాలయంవంటి యీ ఇంట్లో నీకు స్థానంలేదు. కుక్కని సింహాసనం ఎక్కించినట్టుంది. ముందు నాకళ్ళముందునుంచి వెళ్ళిపో"

సర్వయ్య కంఠం కోపం పట్టలేక జీరపోయివణికింది.

అతని మాట అర్థం కాక కార్తీక తికమక పడింది. నెప్పిగా ఉన్న కంఠం రెండు చేతులతో పాముకుంది శ్యామసుందరీదేవి కూతుర్ని చంటిపిల్లలా పొదివి పట్టుకుని నిలబడలేక వెళ్ళి సోఫాలో కూలబడింది.

అంత కోపంలోను సర్వయ్య ఫ్రిజ్జి తెరచి చన్నీళ్ళు ఆమెకు అందించాడు.

మంచి నీళ్ళు గటగటా తాగిన ఆవిడకు ప్రాణం కాస్త కుదుట పడింది.

"ఇంకా యిక్కడే వున్నావేం! కదులు!" శిలా ప్రతిమలా నిల బడిన శ్రీకాంత్‌కు తిరిగి విన్న ఆమాటలతో మరింత చలనం వచ్చింది.

"తొందరపడకు సర్వయ్యా! తొందర పడకు."

శ్యామసుందరీ వి కంగారుగా అంది.

"అప్ట్రాల్ ఒక వంట మనిషివి? నువ్వు ఎవడవురా నన్ను ఆజ్ఞా పించడానికి! రాస్కెల్ కోపం పట్టలేని శ్రీకాంత్ గట్టిగా అరుస్తూ చెయ్యి గాడు.

"నిన్ను కన్న దౌర్భాగ్యుణ్ణిరా! కొట్టు!" సర్వయ్య కొంచెం ందుకు జరిగాడు. ఆ మాటలు శ్రీకాంత్ చెవికి శూలాల్లా తగిలాయి. పంతో ఊగిపోయాడు.

"రాస్కెల్! ఏమి కూసావురా!" రెండు చేతులతో సర్వయ్యను త్తి గోడవైపు తోసాడు. సర్వయ్య తల గోడకు కొట్టుకుని చివ్వున క్తం చిమ్మి ధారలు కట్టింది. సర్వయ్య అచేతనంగా నేలమీదికి వరిగి పోయాడు.

"శ్రీకాంత్ ఎంతపని చేసావు?" అంటూనే శ్యామసుందరీదేవి సర్వయ్యకు దగ్గరగా వెళ్ళింది. కాస్త తేరుకున్న కార్తీక గ్లాసుతో నీళు

అందించింది. ఆవిడ అతని మొహంమీద నీళ్ళుజల్లి తుడిచింది. గాయానికి తడిగుడ్డ తడిపి కట్టింది.

"కార్తీ! డాక్టరుకి ఫోన్ చెయ్యమ్మా!"

కార్తీక వెంటనే ఫోన్ దగ్గరకు వెళ్ళింది.

శ్యామసుందరీదేవి అచేతనంగా పడి వున్న సర్వయ్య దగ్గరగా కూర్చుంది. ఆమె కళ్ళనుండి నీటి ధారలు కారుతూనే వున్నాయి. పమిటకొంగుతో వాటిని వత్తుకుంటోంది.

"డాక్టరుగారు బయలుదేరుతున్నారమ్మా!" కార్తీక తిరిగి వచ్చి తల్లి పక్కనే కూర్చుంది.

"ఏడవకమ్మా!" అంటూ తల్లి కన్నీళ్ళు తుడిచింది.

"సర్వయ్య లేకపోతే యీ ప్రపంచంలో తనకు ఎవ్వరున్నారు" శ్యామసుందరీ దేవికి పపంచమంతా అగమ్యగోచరంగా అనిపించింది. కార్తీకను కౌగిలించుకుని బావురుమంది.

తల్లిని ఎప్పుడూ ఆ స్థితిలో చూడని కార్తీక మరింత బెంబేలు పడిపోయింది.

ఆవేశం నుండి తేరుకుని నిజస్థితికి వచ్చిన శ్రీకాంత్‌కు సర్వయ్య మాటలు చెవుల్లో గింగురుమన్నాయి. "అత్తయ్యా! ఇదంతా అబద్ధమని చెప్పు అత్తయ్యా!" శ్రీకాంత్ కూడా వెక్కి వెక్కి ఏడవడం మొదలు పెట్టాడు.

కలకలలాడే యిల్లంతా ఏడుపులతో చిందరవందరగా ఉంది.

"అవి అబద్ధమని ఎలా చెప్పను బాబూ! సర్వయ్య నిజమే చెప్పాడు!"

"అత్తయ్యా!" అంటూ రెండు చేతులతో ముఖం కప్పుకుని వెక్కి వెక్కి ఏడ్చాడు శ్రీకాంత్. అతని కాలికింది భూమి కదిలినట్లయింది. ఆకాశం కూలి నెత్తిన పడినట్లయింది.

"అమ్మా! నిజమా! అయితే సర్వయ్య ఎవరు?" కార్తీక ఆశ్చర్యంగా అడిగింది.

అంతలో డాక్టరు రావడంతో ఆ సంభాషణ ఆగిపోయింది.

"రండి డాక్టరుగారు రండి" శ్యామసుందరీదేవి పక్కకు జరిగింది.

డాక్టరు సహాయంతో కార్తీక సర్వయ్యను మంచంమీద పడుకోబెట్టింది. శ్రీకాంత్ ఏమీ పట్టనట్టే దూరంగా నిలబడ్డాడు.

డాక్టరు కట్టుకట్టి మందులు ఇచ్చి వెళ్ళిపోయాడు. సర్వయ్యకు మెలకువ వచ్చింది. శ్యామసుందరీదేవి కార్తీక సహాయంతో వేడివేడి కాఫీ తాగించి మందులు వేసింది. సర్వయ్యకు తిరిగి నిద్ర పట్టింది.

"శ్రీకాంత్! ఎంతసేపని నిలబడతావు. భోజనం చేసి పడుకో" శ్యామసుందరీదేవి మాటలు వినని శ్రీకాంత్ "నాకాకలి లేదు, అయినా భోజనం చెయ్యాలనిలేదు" అన్నాడు.

"ఎందుకని" ఆవిడ రెట్టించింది.

"సర్వయ్య ఎవరో చెప్పలేదు?"

"ఇప్పుడు చెప్పలేను శ్రీకాంత్. నాకు కాస్త అలసటగా ఉంది. ఇప్పు అర్ధరాత్రి అయింది. రేపు చెబుతాలే! వేడివేడి పాలు తాగి పడుకో!"

"నాకు ఏదీ తాగాలని లేదు!" శ్రీకాంత్ మేడమీదికి వెళ్ళిపోయాడు. అతని కంఠం జీరపోయింది. శ్యామసుందరీదేవి, కార్తీక ఆ పక్క ఉన్న మంచం మీద నడుం వాల్చారు.

* * *

స్వాతి, రాశాలు సినిమా చూచి ఇంటికి తిరిగి వస్తున్నారు.

స్కూటర్ గాలిలో ఊలుతూ వస్తోంది.

"ఎలా వుంది సినిమా?"

"చాలా బాగుంది! రాజా పక్కన వుంటే రాణిగారికి స్వర్గసుఖాలు. అయినా సినిమా సుప్పు చూసావా?" స్వాతి మాటలకు రాజా సమాధానం చెప్పలేకపోయాడు

"స్వాతి పకపకా నవ్వింది".

"ఏదీ మరోసారి నవ్వు" రాజా రెట్టించాడు.

పకపకా నవ్వింది స్వాతి.

అంతలో రోడ్డుకు అడ్డంగా ఎదరనుంచివస్తున్న లారీ ఢీకొట్టింది. స్కూటర్ లారీకింద ఇరుక్కుపోయింది. స్వాతి, రాజాలు ·లమీద పడిపోయారు. వంటికి తలకు కూడా బలమైన గాయాలు తగిలాయి.

జనం పోగయ్యారు కాని వారిని హాస్పటల్‌కి చేర్చటానికి ఎవరు ముందుకు రాలేదు. పో ·సు కేసని భయపడ్డారు.

రక్తం కారుతోంది. ఇంకా ఆలస్యమయితే చనిపోతారు ఆ దంప తులు. జనం సానుభూతి చూపేవారే కాని సహాయం చెయ్యడానికి ముందుకు రాలేదు. కాని కొంతమంది యువకులు బయలుదేరి లారీని ఆపుచేసారు. డ్రైవరు పారిపోయాడు.

అంతలో ఒకబ్బాయి పరుగెత్తుకుంటూ వచ్చాడు. ఎవరో కారులో వెళ్ళిపోతుంటే బతిమాలి కారాపాడు. ఆ కారులో ఆ దంపతు లిద్దరిని హాస్పటల్‌కి తీసుకువెళ్ళాడు. ప్రైవేటు నర్సింగ్‌హోమ్ వారు వారిని తీసుకోడానికి నిరాకరించారు. గవర్నమెంటు హాస్పటల్‌కి తీసుకువెళ్ళ మని సలహా యిచ్చాడు.

"అది కాదండి! ఇప్పటికే చాలా ఆలస్యమయింది. చాలా ఆలస్య మయింది. చాలా రక్తం పోయింది? ఇంకా ఆలస్యమైతే ప్రమాదమండీ" ఆ అబ్బాయి మాటలు వారు వినలేదు.

"చెబుతోంటె నీక్కాదయ్యా! వెళ్ళు! వెళ్ళు!

ఎవరి పనులలోకి వాళ్ళు వెళ్ళిపోయారు.

"కోర్టుకు కళ్ళు లేవంటారు. హాస్పిటల్‌కి చెవులుండవండి" ఆ అబ్బాయి వాపోయాడు.

"అర్జంటుగా వెళ్ళిపోవాలయ్యా! బాబూ! వీళ్ళు నాకార్లో ఏమయి పోతారో ఏమో" కారు ఓనరు మరింత కంగారుపడ్డాడు.

"మీరే అలాగంటె ఎలా సార్. మీరు లేకపో రెండు నిండు ప్రాణాలు దక్కవండి. మీరు వారి పాలిటి దేవతలండి" అన్నాడు.

కాస్త పొగిడి మెత్తప లక్షణమున్న ఆయన "సరే అలాగె నయ్యా బాబూ" అంటు కారును వేగంగా గవర్నమెంటు హాస్పిటల్ వైపు పోనిచ్చాడు. అక్కడ వారితో సంప్రదించి హాస్పటల్లో చేరిపించేటప్పటికి రా ని పదయింది.

డాక్టరు వచ్చి పరీక్షలు చేసారు. రాజాకి ఎక్కువ దెబ్బలు తగ ల్లేదని ప్రమాదమేమి లేదని చెప్పారు. స్వాతికి తలకి కాస్త బలమైన గాయం తగిలినప్పటికి అపాయంలేదని చెప్పారు.

ఆ అబ్బాయి అక్క ఉండిపోయాడు. కారతను పళ్ళు, బ్రెడ్, బిస్కట్లుకొని అతని చేతిలోపెట్టి వాడుకోమని వంద రూ॥ చేతిలో పెట్టాడు.

"ఇవన్నీ ఎందుకం ? పైగా ఈ డబ్బేమిటం ?"

ఆ అబ్బాయి మొహమాటపడ్డాడు.

"ఉంచు బాబూ! ఎందుకైన అవసర మొస్తుంది."

మనస్సులోనే అతనికి నమస్కరించాడా అబ్బాయి.

"మీరెంత మంచివారం !" మధ్యలో చెప్పడం ఆపిన అతన్ని చూసి కారతను "ఏమిటి బాబు! చెప్పు" అన్నాడు.

"ఏంలేదం ! వాళ్ళు ఎవరి తాలూకో తెలిస్తే! కాస్త వాళ్ళకి

తెలియచేస్తారని" అతను నసిగాడు

"వాళ్ళెవరో తెలియదు గదా!" అన్నాడాయన. ఏదైన ఆచూకి తెలుస్తుందేమోనని బులు వెతికారు. అందులో స్కూటర్ లైసెన్సు ఉంది. ఇంటి ఎడ్రస్సు ఉంది. ఆ అబ్బాయిని చూసి ఏమనుకున్నాడో ఆ కారతను "నేను వాళ్ళింటికి వెళ్ళి చెప్పి వెడతాను బాబూ! ఇంత నీ పేరు చెప్పలేదయ్యా!" అంటూ అడిగాడు

"అనిల్ కుమార్? నా పేరుతో ఏంపనం..!" అన్నాడు సిగ్గు పడుతూ.

"అదేంలేదయ్యా! వాళ్ళతో చెప్పాలిగా! సరే వస్తాను బాబూ! ఇంత నువ్వెక్కడ పని చేస్తున్నావయ్యా! అడగడం మర్చిపోయాను" సం హంగా అడిగాడు

"నేను ఇంజనీరింగ్ చదువుతున్నానండి. ఇంకా చదువు పూర్తి కాలేదం !"

సమాధానం విన్న కారతను నిజంగా ఆశ్చర్యపడ్డాడు. మనస్సులో దాచుకోలేక పైకే అనేసాడు.

"ఏంలేదు బాబూ! ఈ రోజుల్లో స్వార్థం రాజ్యమేలుతోంది. అవసరముంటెగాని ఎవరు ఏపని చెయ్యరు. నువ్వు ఏ స్వార్థం లేకుండ వాళ్ళని రక్షించాలని తాపత్రయపడుతున్నావు? నాకు నమ్మ బుద్ధి కావడం లేదు నీలా ప్రేమాభిమానాలున్న వాళ్ళు అరుదయ్యా! అందుకే నిన్ను గురించి అడిగాను. ఏమీ అనుకోకు. నీకు శుభం జరగాలి బాబు!" నిజంగా ఆ కారతను కళ్ళలో నీళ్ళు తిరిగాయి. ఆ డ్రైవింగ్ లైసెన్సు తీసుకుని వాళ్ళ ఇల్లు వెతుక్కుంటు బయలుదేరాడు. ఈలోపుగా పోలీసులు యాక్సిడెంటు జరిగిన ప్రాంతానికి వెళ్ళి తుక్కుతుక్కయిన స్కూటర్‌ని స్టేషన్‌కి తీసుకువచ్చారు. డ్రైవర్ మాత్రం కనపడలేదు. జరగవలసిన ఎంక్వైరి అంతా చురుగ్గా ప్రారంభించారు పోలీసులు.

*　　　*　　　*

ఇంటి దగ్గర ఉత్తర స్వాతి,రాజాలు రాలేదని వెక్కి వెక్కి ఏడ్వ సారంభించింది. బామ్మగారు ఓదారుస్తూనే ఉంది. ఏ చప్పుడైనా వీధి గేటు చప్పు అనుకుంటోంది.

ఏ స్కూటర్ చప్పుడైనా వాళ్ళదే అనుకుంటోంది. ఏడుస్తూ, వీధిగేటు వైపు చూస్తోంది. అంతలో ఇంటి ముందు కారాగిన చప్పుడైంది. అంతలో గేటు తీసిన చప్పుడయింది.

"బామ్మా! అదిగో వాళ్ళొచ్చేశారు?" అంటూ తలుపు తీసుకొని బయటకు వచ్చింది. ఆమె వెనకే బామ్మగారు కూడా వచ్చింది

అంత ఆశగా వచ్చిన ఉత్తర ఎదురుగా కొత్త వ్యక్తిని చూసి నీరుకారిపోయింది. బామ్మగారు వచ్చి చటుక్కున ఆమెను పట్టుకుంది.

"రాజా! వాళ్ళు ఇక్కడే ఉంటారా!"

"అవును బాబూ! మీకు ఎవరు కావాలి" బామ్మగారే అడిగింది.

"కంగారేం లేదండి! రాజా వెడుతున్న స్కూటర్ కి యాక్సిడెంటు యింది. పెద్ద దెబ్బలేం తగల్లేదు. గవర్నమెంటు హాస్పటల్లో ఉన్నా ,డి".

"ఇప్పుడెల్లా ఉన్నారండి" ఉత్తర వెక్కి వెక్కి ఏడుస్తూ అడిగింది.

"హాయిగా పడుకున్నారు. మరేం భయంలేదండి"

"బామ్మగారికి ఎందుకో కాస్త అనుమానం కలిగింది. "ఈరోజుల్లో ఇలాటి మోసగాళ్ళు కూడా ఉన్నారు. ఒంటరిగా ఆడవాళ్ళు ఉన్నారని తెలిసి ఇలా మోసంచేసి తీసుకుపోయినట్లు ఎన్నో సార్లు వింది. ఎందుకైనా మంచిది. మరిన్ని వివరాలు తెలుసుకోవాలనుకుంది. ఒకవేళ ఉత్తర భర్త చలపతి పంపించాడేమో? మోసంచేసి తీసుకుపోయి ఇల్లు రాయించు కుంటా మో?'' మరో అనుమానం కలిగిందావిడకు. అతన్ని అన్ని

కోణాలలోంచి చూసింది. మనిషి మోసగాడులా లేడు. మాటలో స్వచ్ఛత ఉంది. మనిషిలో పొందిక ఉంది.

''ఇంతకీ నువ్వెవరు బాబూ?''

నేను మీకు కొత్తవాణ్నే! కాని ఆ రోడ్డు మీద వెడుతూంటే యాక్సిడెంటు కళ్ళార చూసాను. కాని నేను కారాపలేదు. ఒక యువకుడు ముందుకు వచ్చి నన్ను బతిమాలాడు. అతని మాటలకు కరిగిన నేను వాళ్ళని హాస్పటల్లో చేర్పించాను. మీకు వార్త చెప్పమని అతను పంపించాడు. అందుకే వచ్చాను నేను వ్యాపారం చేసుకుంటాను. నన్ను చూసి భయపడకండి. మీకు అభ్యంతరం లేకపోతే హాస్పటల్లో దిగబెడతాను''

''నీకెందుకు బాబూ శ్రమ! ఆ హాస్పటల్ ఎక్కడ ఉందో చెబితే మేం వెడతాం నాయనా!''

''నన్ను చూసి భయపడకండి. మీరు అర్ధరాత్రి ఒంటరిగా బయలుదేరితే మీరు భయపడినంతా జరుగుతుంది! రండి నాతో! అంత పెద్దవారు మీరు అలా అనుమానిస్తే ఎలాగండి!''

''వీడెవడో అసాధ్యుడిలా ఉన్నాడు! కాని మోసగాడులా లేడులే'' మనస్సులో అనుకుంది బామ్మగారు.

"సరే ఉత్తరా! అలాగే వెడదాం లేమ్మా! తాళాలు పెట్టు'' అంటూ ఆవిడ ఉత్తరను వదలి సామాను సర్దడం మొదలుపెట్టింది.

ఫ్లాస్కు, వాటర్ బాటిల్, మొదలైనవి తీసుకుని ఇంటికి తాళం పెట్టారు.

''ఏంతైన ఆ దేవుని దయ'' అనుకుంటూ బామ్మగారు ఉత్తరతో కారు ఎక్కింది.

వారిద్దరిని అతను గమనిస్తూనే ఉన్నాడు. తనని అనుమానిస్తున్నా ఉన్నాడు. తనని అనుమానిస్తున్నారని గ్రహించాడు. కాని కోపం తెచ్చుకోలేదు. సమయం కాని సమయంలో, వేళకాని వేళలో మంచితనం

కూడా అవమానింపబడుతుందని సమాధానపడ్డాడు. వారిద్దరిని రూము వరకు తీసుకెళ్ళాడు.

"అమ్మా! నేను వస్తాను!" అంటూ వెనుతిరిగాడు.

"ఎంత మంచివాడివి బాబు. నీలాటివారు ఇంకా వున్నారంటే ఆశ్చర్యంగా ఉంది. నీ ఋణం తీర్చుకోలేము." ముసలమ్మ కళ్ళలో నీళ్ళు నిలిచాయి.

"మీ ఋణం తీర్చుకోలేమండి." ఉత్తర రెండు చేతులు జోడించి నమస్కరించింది.

"ఋణం తీర్చుకోడం ఏమిటండీ! నేనేం చేసానని. నా చేతనైన సహాయం చేసానంతే." అతను ఇద్దరికి నమస్కరించి వెళ్ళిపోయాడు.

గదిలో అడుగుపెట్టింది ఉత్తర. ఎదురుగా మంచంమీద స్వాతి పడుకుని ఉంది. తలకు, చేతులకు, కాళ్ళకు తెల్లటి బట్టతో కట్లు. ఉత్తరకు బతుకున్నట్లు అనిపించలేదు. "స్వాతీ!" అంటూ ఒక్కసారి కెవ్వుమని దగ్గరకు వెళ్ళింది.

నర్సులు పరుగెత్తుకొచ్చారు. "ఏమిటండీ! నిద్రపోతున్న పేషెంటుని లేపుతారు? బయటకు నడవండి." ఉత్తరను బయటకు పంపించారు.

ఉత్తర మరింత ఏడ్చింది. బామ్మగారు ఉత్తరను ఓదార్చింది. "ఆమె ఆ పిల్లకు అక్కగారు. తల్లిదండ్రులు లేరు. అన్నీ ఆమెయై పెంచింది. ఆమెను అలా చూడగానే దుఃఖం ఆగలేదు. అంతే! ఏడవకుండానే చూస్తా! మీరు ఆమెను వెళ్ళమనకండి" బామ్మగారు నర్సులను బతిమాలింది. వాళ్ళు ఆమె మాటలకు కాస్త మెత్తబడ్డారు.

"ఇంతకీ ఆ పిల్లకెలావుందమ్మా!" బామ్మగారు నెమ్మదిగా అడిగింది.

"పెద్ద దెబ్బలేమీ తగల్లేదండి. కాస్త కొట్టుకుపోయినచోటల్లా

కట్లు కట్టామంతె." నర్సులు అక్కడనుంకి కదిలారు. ఉత్తర గుండె దిటవు చేసుకుంది. మెల్లిగా వెళ్ళి చెల్లెలు పక్కలో కూర్చుంది. బామ్మ గారు పక్కనే కూర్చుంది.

ఉత్తర చెల్లెలు వచ్చురాసింది. పైకి ఏడవడానికిలేక ఏడుపు ఆపుకుంది. బామ్మగారు ఆమెను మరోసారి ఓదార్చింది.

అప్పుడు వాళ్ళకి రాజా సంగతి గుర్తుకొచ్చింది.

"బామ్మగారూ! రాజా ఏడీ!" కంగారుగా అడిగింది. అతను బతికున్నాడో లేడో అనే అనుమానం వచ్చిందామెకు.

"బతికున్నాడంటారా?" ఉత్తర దుఃఖం ఆపుకోలేకపోయింది.

"అతనికేం భయంలేదు. బహుశా పక్కరూములో పడుకో పెట్టారేమో? అడుగుతానుండు." బామ్మ గారు బయటకువచ్చి నర్సు నడిగింది.

"ఈ గదిలో వున్నారమ్మా." కర్టెన్ తప్పించి చూపించిందామె. బామ్మగారు గదిలోకి వెళ్ళింది. రాజా కొత్తబ్బాయితో మెల్లిగా మాట్లాడుతున్నాడు. అతనికి ఎక్కువ దెబ్బలు తగల్లేదు. తగిలినవి కూడా ప్రమాదకరమైనవి కావు. కాస్త నీరసంగా ఉన్నాడంతే. బామ్మగారి ప్రాణం కుదుటపడింది. ప్రక్కన కూర్చున్న ఆ అబ్బాయిని వివరంగా అడిగి తెలుసుకుంది.

"ఉత్తరా! రాజాని చూశాను. చక్కగా మాట్లాడుతున్నాడు. పక్క గదిలోనే ఉన్నాడు." నేనిక్కడ వుంటాను. నువ్వెళ్ళి చూసిరా!" తిరిగివచ్చిన బామ్మగారు విషయాలన్నీ చెప్పింది.

"అలాగా! రాజా మాట్లాడుతున్నాడా?" ఆనందంతో ఆశ్చర్యంతో ఉత్తర ఉక్కిరిబిక్కిరయింది. అతని రూముకువెళ్ళి అతన్ని చూసింది. నిజంగానే ఆనందమనిపించింది. ఫ్లాస్కులో పాలు అతనికి అందించింది. రాజా వద్దంటున్నా కొత్తబ్బాయి బలవంతంగా తాగించాడు. తిరిగి

రాజాకు నిద్రపట్టింది. ఆ అబ్బాయి అతని గదిలో సాయంగా పడుకున్నాడు. అమ్మాగారు, ఉత్తర స్వాతిగదిలో పడుకున్నారు.

మధ్యమధ్యలో డాక్టర్లు, నర్సులు వచ్చి పేషెంట్లను చూసి వెడుతున్నారు. బామ్మగారు, ఉత్తర కూడా మగత నిద్రలోనే ఉన్నారు. అలా లేచిచూస్తూనే ఉన్నారు. రాజాను, మొదట జనరల్ వార్డులో, పడుకోపెట్టారు. ఆ కారతను ఇద్దరిని స్పెషల్ వార్డుల్లోకి మార్పించాడు.

తెల్లవారింది. స్వాతికి బాగా మెలకువ వచ్చింది. అక్కగారూ, బామ్మ పలకరించగానే ఏకధాటిగా ఏడ్చింది ఇద్దరూ ఓదార్చారు.

''రాజా ఎలా వున్నాడు" బాధగా అడిగింది.

''పక్క రూములో ఉన్నాడు పెద్ద దెబ్బలు కాదుట. నీవు బెంగపడకు. చూసుకోడానికి మేమంతా ఉన్నాముగా'' బామ్మగారి మాటలకు స్వాతి మనస్సు కుదుటపడింది.

అంతలో డాక్టర్లు పరీక్షచెయ్యడానికి వచ్చారు. స్వాతికి మందులు రాసిచ్చి యింటికి తీసుకు వెళ్ళవచ్చని చెప్పారు.

అలాగే రాజాను పరీక్షచేసి యింటికి తీసుకువెళ్ళమన్నారు.

ఆ అబ్బాయే టాక్సీ మాట్లాడి తీసుకొచ్చాడు. బామ్మగారు ఉత్తర ట్టుకొచ్చిన సామానులు అందులో పెట్టాడు. రాజాను నడిపించుకు ళ్ళి టాక్సీ ఎక్కించాడు. స్వాతిని ఉత్తర, బామ్మగారు కలిసి టాక్సీ ఎక్కించారు.

'' నింక వెడతానండి'' అన్నాడు రాజాతో ఆ కొత్తబ్బాయి.

''ఇంటివరకు వచ్చి వెళ్ళు నాయినా'' బామ్మగారే బతిమాలింది.

అతను కూడా టాక్సీ ఎక్కాడు. ఇంటిముందు టాక్సీ ఆగగా రాజాను లోపలికి తీసుకొచ్చాడు. బామ్మగారు, ఉత్తర స్వాతిని గదిలో నెమ్మదిగా పడుకోపెట్టారు.

ఉత్తర వెళ్ళి అందరి కాఫీ కలిపి పట్టుకొచ్చింది.

''ఇంక నే వెళతానండి'' ఆ కొత్తబ్బాయి అందరి దగ్గర శలవు తీసుకున్నాడు.

''అప్పుడప్పుడు వస్తూండుబాబు'' బామ్మగారు మరీమరీ చెప్పింది.

'వస్తుండవయ్యా!'' రాజా మాటలకు ''అలాగేనండీ'' అన్నాడు ఆ అబ్బాయి.

''దేవుడిలా వచ్చి నా చెల్లెలిని, రాజాని కాపాడవయ్యా! నీ ఋణం తీర్చుకోలేము'' ఉత్తర కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

''అంత పెద్ద మాటలు మాట్లాడకండి'' అంటూ అతను బయలు దేరాడు.

ఆత్మబంధువును పోగొట్టుకున్నట్లుగా బాధపడ్డారు అందరు. అతను కూడా వదల్లేక వదల్లేక వెళ్ళాడు

''ఈ కాలంలో కూడా ఇంతటి ఈ ప్రేమానురాగా లేమిటో ఆశ్చర్యంగా ఉంది'' మనస్సులో బామ్మ గారు అనుకున్న మాటలు పైకే వినిపించాయి.

ఇంట్లో స్వాతిని, రాజాను చూడగా, ఉత్తర ఊపిరిపీల్చుకుంది. ఆ పూట బామ్మగారు అక్కడే వుండిపోయింది. ఉత్తర అందరికి వంట చేసింది. పనులయ్యాక శ్యామసుందరీదేవికి చెప్పిరావాలనుకుంది బామ్మ గారు.

* * *

సర్వయ్య తెల్లవార్లూ మూలుగుతూనే ఉన్నాడు. శ్యామసుందరీ దేవి లేచి వేళమించకుండా మందులు వేస్తూనే ఉంది. తల్లి లేచినప్పుడల్లా కార్తీక మెళకువ తెచ్చుకుని తల్లికి సహాయం చేసింది. శ్యామసుందరీ దేవికి, కార్తీకకు కూడా తెల్లవార్లు నిద్రలేదు. సర్వయ్యను కాపాడు కోవాలన్న వారి ధ్యాస.

ప్రకాంతుకు కూడా రాత్రి నిద్రపట్టలేదు. సర్వయ్యకోసం కాదు.

తనకు సర్వయ్యకు ఉండే సంబంధం తెలుసుకోడానికి. అది ఆందోళన. బాధాకరమైన ఆందోళన. తనగొప్పతనం దిగజారుతోందన్న ఆందోళన. ఒక వంటవాడి కొడుకునన్న విషయం నిజమవుతుందనే ఆందోళన. అంతలో తెల్లవారింది.

"అత్తయ్యా! రాత్రి దాటబెట్టావు? ఇప్పుడైనా నిజంచెప్పు." శ్యామసుందరీదేవిని నిలదీసి అడిగాడు.

"అలాగే చెబుతా కూర్చో శ్రీకాంత్!" ఆవిడ మాటలు ప్రశాంతంగా ఉన్నాయి.

సర్వయ్యచేత మందులు మింగించి కాఫీ తాగించింది. కార్తీకకు, శ్రీకాంత్‌కి కూడా కాఫీలిచ్చింది. శ్రీకాంత్ కాళ్ళు ఎర్రగా చింతనిప్పుల్లా ఉన్నాయి. కార్తీక అతన్నిచూసి భయపడింది. తప్పతాగి ఉన్నాడనుకుంది.

"రాత్రి నిద్రలేదా శ్రీకాంత్! కళ్ళు వాచి ఉన్నాయి. మొహం ఉబ్బి ఉంది." శ్యామసుందరీదేవికి అతను సమాధానం ఇవ్వలేదు. శ్యామసుందరీదేవి కూడా కాఫీగ్లాసు తెచ్చుకుని శ్రీకాంత్ పక్కనే కూర్చుంది.

శ్రీకాంత్ నేను చెప్పేది జాగ్రత్తగా వింటానంటే నే చెబుతాను. ఆవేశాలు, కోపాలు తెచ్చుకుంటే మాత్రం నే చెప్పను. యధార్థం ఎప్పుడూ చేదుగానే ఉంటుంది. అయినా చెప్పక తప్పదు. వినకాతప్పదు ఆవిడ మాటలు సీరియస్‌గా ఉన్నాయి.

''అలాగే అత్తయ్యా! ముందు చెప్పు'' శ్రీకాంత్ సర్దుకుని కూర్చున్నాడు. కార్తీక మరింత శ్రద్ధగా వింటోంది.

సర్వయ్య మనింట్లో మొదటినుంచి వంట చేసేవాడు. అతనిభార్య కూడా మనింట్లో పనిచేసేది. ఇద్దరు ఇంట్లో మనుష్యుల్లా ఉంటారు

మన పెరటి గదిలో ఉండేవారు. అతని భార్య చంద్రావతి గర్భవతి అయింది. అందరం ఎంతో అపురూపంగా చూసుకున్నాము. చక్కటి మగపిల్లాణ్ణి కంది. కాని పురిటిలోనే ఆవిడ మరణించింది. ఎంత వైద్యం చేయించినా బతకలేదు. ఆ పిల్లాణ్ణి పెంచడమే కష్టమైపోయింది. అస్తమానం పాలకోసం ఏడ్చేవాడు. పనిమనిషి సరసమ్మే సీసాపాలు పట్టేది. స్నానం చేయించేది. ఎవరిదగ్గరా ఉండేవాడు కాదు. అంత కష్టంలోను సర్వయ్య ఇల్లు వదల్లేదు. మరో వంటవాణ్ణి పెట్టుకుంటామంటె అతను మానలేదు.

అంతలో మా ఆడబడుచు రాజేశ్వరి పురిటికి పుట్టింటికి వచ్చింది. ఆమె సర్వయ్య కొడుకును చూసి, ముచ్చటపడింది. ఆ పిల్లవాని లాలన పాలన చూసేది. ఎత్తుకు మోసేది. ఎవరెత్తుకున్నా ఊరుకోని ఆ పసివాడు ఆమె ఎత్తుకోగానే ఠక్కున ఏడుపు ఆపేవాడు.

ఆమెకు నెలలు నిండాయి. అది మూడవ కాన్పు. రెండు కాన్పులకు ఆపరేషన్ చేసి కడుపులో చనిపోయిన పిల్లల్ని తీసేశారు. మూడవసారి చాలా ఆశతోఉంది. కాని ముందులాగే జరిగిపోయింది. ఆమె ఏడుపుకి అంతులేదు. సర్వయ్య తన కొడుకును ఏడుస్తున్న ఆమెకు అందించాడు.

"అదేమిటి సర్వయ్యా! నీకు ఒక్కగానొక్క కొడుకు. వాణ్ణి నాకిస్తా-మిటి!" మా ఆడబడుచు మాటలు అతను వినలేదు.

"నన్ను చూడ్డానికి మీరంతా ఉన్నారుకదమ్మా!" అన్నాడు. ఆ పిల్లవానికి శ్రీకాంత్ అని నామకరణం చేసి బారసాల చేసుకున్నారు. ఆమె భర్తకూడా ఎంతో మురిసిపోయాడు.

అంతలో వాళ్ళ వ్యాపారం దివాళా ఎత్తింది. అనుకోకుండా ఆయన గుండెపోటుతో మరణించాడు మా ఆడబడుచు పిల్లవాణ్ణి తీసుకుని ఇక్కడకు వచ్చేసింది. సర్వయ్య కళ్ళముందే పిల్లవాడుంటాడని

ముడిసిపోతూంది. ఆ చంటిపిల్లాడు మాత్రం సర్వయ్య దగ్గరకు వెళ్ళే వాడు కాదు సర్వయ్యను వంటమనిషని ఎన్నోసార్లు బతిమాలాము. కాని అతను అంగీకరించలేదు. ఆ పిల్లాడంటే అందరికి ముద్దే. తర్వాత నాకు కార్తీక పుట్టింది. ఆ పిల్ల పుట్టింది మొదలు తన కోడలని అందరికి చెప్పేది. కార్తీకను చూసి మురిసిపోయేది రాజేశ్వరి.

అనుకోకుండా ఆమెకు జబ్బుచేసింది. ఎంత వైద్యం చేసినా తగ్గలేదు. చివరకు లంగ్ క్యాన్సరని చెప్పారు. ఆమె చావు బ్రతుకుల మధ్య ఊగిసలాడుతోంది. మా యిద్దరిని దగ్గరకు పిలిచింది. అప్పుడు శ్రీకాంత్‌కి 5 సం॥ ఉంటాయి. కార్తీకకు ఒక్క సంవత్సరం.

"అన్నయ్యా! నావెంట ఆస్తి తీసుకురాలేదు. ప్రేమాభిమానాలు తీసుకువచ్చాను. ఈ శ్రీకాంత్‌కు కార్తీకను వివాహం చేయండి. అయినా ఇద్దరికి నచ్చితే. బలవంతంగా మాత్రం కాదు." ఆమె మాటలకు నేను, మీ మామయ్య తలయూపాం. ఆ పసివాణ్ణి మా ఒళ్లో పెట్టి ఆవిడ కన్నుమూసింది. అప్పటినుంచి ఇద్దర్ని మా పిల్లలాగే పెంచడం మొదలుపెట్టాం కార్తీకకు 10 ఏళ్ళు వచ్చేటప్పటికి వాళ్ళ నాన్నగారు కూడా హఠాత్తుగా మరణించారు. నేను, సర్వయ్యా మిగిలాం. సర్వయ్య వాడూ నిన్ను కొడుకనే మమకారంతో చూడలేదు. వంటవానిగానే మిగిలిపోయాడు. మిగిలిన సంగతులన్ని నీకు తెలిసినవే?" చెబు తున్నంతసేపు ఆవిడ శ్రీకాంత్‌ను గమనిస్తూనే ఉంది. కొంతసేపు చికాగ్గా మొహంపెట్టాడు. కొంతసేపు కోపంతో ఊగిపోయాడు చివరకు వెక్కివెక్కి ఏడుస్తూ మేడమీదికి వెళ్ళిపోయాడు. వింటున్నంతసేపు ఒక్క ప్రశ్నకూడా అడగలేదు.

"ముందే చెప్పవలసిందమ్మా! ఇప్పుడు శ్రీకాంత్ ఈ విషయం విని తట్టుకోలేకపోతున్నాడు. అయినా అహంకారమంతా కరిగిపోయిం దితే" అంది కార్తీక.

సర్వయ్యే చెప్పద్దన్నాడు కార్తీకా! అందు చెప్పలేదు. ప్రకాలత్ ఇలా మారుతాడని అనుకోలేదు."

అంతలో సర్వయ్య మూలుగు వినబడింది. శ్యామసుందరీదేవి దగ్గరకు వెళ్ళి నుదిటిమీద చెయ్యివేసి చూసింది. వళ్ళు కాలిపోతోంది.

"కార్తీ! అయ్యో ఇంత జ్వరం వచ్చిం మిటే? అంతా అయోమయంగా ఉందే!" అంది బాధగా.

"డాక్టరికి ఫోన్ చేస్తానుండమ్మా!" ఫోను దగ్గరకు పరుగెత్తింది కార్తీక.

"పొద్దుట బాగానె ఉన్నాడు కదమ్మా! ఇంతలో ఈ జ్వరమేమిటే."

"కంగారుపడకమ్మా! డాక్టరు వస్తున్నాడు. నువ్వు స్థిమితంగా కూర్చో!' డాక్టరుకి ఫోను చేసిన కార్తీక తల్లికి ధైర్యం చెప్పింది.

"సుందరమ్మా! సుందరమ్మా!" అంతలో బామ్మగారు లోపలికి వచ్చింది.

"రండి బామ్మ గారు" కార్తీక ఎదురువచ్చి తల్లి దగ్గరకు ఆవిడను తీసుకు వెళ్ళింది.

"ఇ మిటమ్మా! సర్వయ్య మయింది" బామ్మగారు కంగారుగా అడిగింది.

"విపరీతమైన జ్వరమండి. నిన్న బాతురూము దగ్గర కాలుజారి పడిపోయాడు," అసలు సంగతి చెప్పలేకపోయింది.

"అయ్యో! పాపం అలాగా! నిన్నరాత్రి స్వాతి రాజాలకు ఎంత గండం తప్పిందో తెలుసామా! ఆ సంగతి చెప్పి నిన్ను చూసిపోదామని వచ్చాను సుందరమ్మా!"

"అలాగా! మా ఇబ్బందుల్లో మేమున్నాము. ఇంతకీ ఏం జరిగింది" శ్యామసుందరీ వి కాస్త భయంగా అడిగింది.

"స్వాతి రాజాలకు ఏం జరిగింది బామ్మగారూ" కార్తీక దగ్గరకు వచ్చి అడిగింది.

"నిన్న వాళ్ళు సినిమాకు వెడుతుంటే వెనకనుంచి లారీ వచ్చి గుద్దేసిందిటమ్మా! దెబ్బలు తగిలాయి. రాత్రల్లా ఆస్పటల్లోనే ఉన్నారు. పొద్దుటే తీసుకువచ్చాము!"

"ఇప్పు వస్తానమ్మా !" ఆవిడమాటలు పూర్తి కాకుండానే పరు గెత్తింది కార్తీక.

అంతలో డాక్టరు వచ్చి సత్యయ్యను జాగ్రత్తగా పరీక్ష చేసాడు. మూసిన కన్ను తెరవకుండా పడుకునే ఉన్నాడు. పైగా జ్వర తీవ్రతతో మూలుగుతున్నాడు.

"సత్యయ్యా! సత్యయ్యా!" డాక్టరు నెమ్మదిగా పిలిచి వంటి మీద చెయ్యివేసి కుదిపాడు.

కళ్ళు తెరచినట్టే తెరచిన సత్యయ్య తిరిగి కళ్ళు మూసేసాడు.

"ఎలా ఉందండి! డాక్టరుగారూ!" శ్యామసుందరీదేవి కంగారుగా అడిగింది.

"వెంట హాస్పిటల్లో చేర్పించడం మంచిదమ్మా!"

"అలాగేనండి!" శ్యామసుందరీదేవికి చెప్పలేని కంగారు కలిగింది. ం చెయ్యాలో తోచలేదు.

"డాక్టరుగారూ! మరి ప్రమాదం ఏంలేదు కదా!" శ్యామసుందరీ దేవి మళ్ళీ అడిగింది.

"ఏ ప్రమాదం రాకుండానే కదండీ! హాస్పటల్లో చేర్పించ మంటున్నాను."

"కంగారు పడకమ్మా ! సుందరీ! మేమంతా ఉన్నాముగా" బామ్మ గారు ఓదార్చడానికి ప్రయత్నించింది.

అప్పటి డాక్టరు వెనుతిరిగాడు. శ్యామసుందరీదేవి సత్యయ్య

మంచం దగ్గరగా నిలబడి ఉంది.

"ఏదేమిటమ్మా! సుందరీ! సర్వయ్య ఆయాసపడుతున్నాడమ్మా! డాక్టర్ని పిలు! అదిగో కన్ను తేస్తున్నాడు" బామ్మగారు కంగారుగా అరిచింది.

అటువంటి ప్రాణాపాయ సంఘటనలు ఆవిడ ఎన్నో చూసింది. అందుకే ప్రమాద పరిస్థితిని ఇట్టే గ్రహించి చెప్పింది.

బామ్మగారు గొంతు విన్న డాక్టరు అక్కడే ఆగిపోయాడు.

"డాక్టరు గారూ! రండి! రండి! సర్వయ్య కాళ్ళ చేతులు చల్లబడిపోతున్నాయి." బామ్మగారు మళ్ళీ అరిచింది. శ్యామసుందరీదేవి ఆ కంగారుకి కుప్పలా కూలిపోయింది. డాక్టరు గబగబా వచ్చి సర్వయను పరీక్షించి చూసాడు.

"అమ్మా! సర్వయ్య ఇంక లేడమ్మా!" డాక్టరు గబగబా నడుచుకుంటు బయటకు వెళ్ళిపోయాడు.

"సర్వయ్యా!" కెవ్వుమని అరిచింది శ్యామసుందరీదేవి. పైనున్న శ్రీకాంత్ ఆ అరుపుకి భయపడి కిందికి దిగి వచ్చాడు.

"సుందరమా! అలా బెంబేలు పడితే ఎలాగ! నువ్వు కంగారు పడకు" బామ్మగారు ఆవిడను కుర్చీలో బలవంతంగా కూర్చోపెట్టింది.

శ్రీకాంత్! మాయింట్లో కార్తీక వుంది. పిలుచుకురా!" బామ్మగారు ఎదురు వచ్చిన శ్రీకాంతుకు చెప్పింది.

మారుమాటడకుండా శ్రీకాంత్ వాళ్ళింటికి వెళ్ళాడు. తలుపు కొట్టి సంగతి చెప్పాడు. అక్కడ ఒక్కక్షణం నిలబడకుండా తిరిగి వచ్చేసాడు. కార్తీకకు ఆ వార్త వినగానే చెప్పలేని దుఃఖం కలిగింది. వెక్కి వెక్కి ఏడ్చుకుంటు ఇంటికి వచ్చింది.

"కార్తీ! ఇంక సర్వయ్య మనకి లేడమ్మా!" కూతుర్ని కౌగలించుకుని గుండెల్లోని బాధ పంచుకుంది శ్యామసుందరీ దేవి. తలుపులు

దగ్గరగా -సి ఉత్తర ఆయన వెన వచ్చింది.

శ్యామసుందరీదేవి చెప్పిన వారందరికి ఉత్తర ఘోసులు చేసింది. శ్రీకాంతుకు ఆపని చెప్పలేకపోయారు.

శ్రీకాంత్ ఎవరో కార్తీకకు, శ్యామసుందరీదేవికీ తెలుసు. ఎంత కాదనుకున్నా సర్వయ్యే తండ్రీ అవుతాడు. పైకి చెప్పకపోయినా కడుపులో బాధపడుతూనే ఉంటాడనుకున్నారు అత్త కూతుళ్ళు. అందుకే అతనికి ఏపనీ చెప్పలేకపోతున్నారు. పైగా కార్తీక మాటి మాటికి అతని మొహంవైపు చూస్తోంది. ఎక్కడైన ఏడుపు కనబడు తుం మోనని అమెనుకుంటోంది. కాని శ్రీకాంత్ కళ్ళల్లో ఎక్కడా నీటి చుక్క కనబడలేదు. ముఖం మాత్రం వాడిపోయి ఉంది.

శ్యామసుందరీ వి మాత్రం బాధతో మెలికలు తిరుగుతోంది. అంత హఠాత్తుగా సర్వయ్య చనిపోతాడనుకోలేదు. ఇంట్లో వంటపని చేసినా అన్ని రకాల సలహాలు అత. ఇచ్చేవాడు. ఇంటిక్షేమం కోరే వాడు. అతను లేడనుకు. సరికి శ్యామసుందరీదేవి బాధతో మెలికలు తిరిగింది. యధా విధిగా కర్మకాండలన్నీ చెయించి అతని ఆత్మకు శాంతి కలిగించాలనుకుంది. రావలసిన వాళ్ళంతా చేరుకున్నారు. దహన సంస్కారం ఎవరు చెయ్యాల. అనుమానం అందరికి కలిగింది. సర్వ య్యకు కావలసిన బంధువులు చేస్తే బాగుంటుందన్నారు కొందరు. అతనికి అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళు లేరు.

"శ్రీకాంత్! సర్వయ్య మనింటి మనిషిలా ఉం వాడు కనక నువ్వే దహన సంస్కారం చేస్తే బాగుంటుందయ్యా!" శ్యామసుందరీ దేవి మాటలకు శ్రీకాంత్ ఉలిక్కిపడ్డాడు.

". చెయ్యలేనత్తయ్యా!" ఇలాటివి . నెప్పుడూ చూడ-దు కూడా!" శ్రీకాంత్ కళ్ళలో ఇప్పుడు నీళ్ళు నిలిచాయి.

"గుండె ఉందన్నమాట" కార్తీక మనస్సు కాస్త చల్లబడింది.

"శ్రీకాంత్! ఇలాంటి దృశ్యాలు ఎవ్వరూ చూడరు. కాని జీవితంలో తల్లి పోయినప్పుడు, తండ్రి పోయినప్పుడు, చూడాలి. కర్మకాండలు చెయ్యాలి కూడా! అది తనయుల బాధ్యత. నీకు చిన్నతనంలోనె తల్లి, తండ్రి చనిపోయారు. ఇప్పుడు నీకు వయస్సు వచ్చింది. నిన్ను చిన్నతనంనుంచి ఎత్తుకు మోసాడు. నీకు నీళ్ళుపోసాడు. అన్నం పంపి పెట్టాడు. నీకు తండ్రి అంతటివాడు సర్వయ్య. నువ్వు చేస్తేనే అతని ఆత్మకు శాంతి కలుగుతుంది శ్రీకాంత్" శ్యామసుందరీదేవి మాటలు అక్కడున్నవాళ్ళందరికి నచ్చాయి.

"అవును శ్రీకాంత్! ఆవిడ చెప్పినట్లు చేస్తే బాగుంటుంది." అన్నారు పెద్దలు.

సర్వయ్య కొడుకని అందరిముందు హేళన చెయ్యకుండా కాపాడింది శ్యామసుందరీదేవి." ఆవిడకు మనస్సులోనే నమస్కరించాడు శ్రీకాంత్. ఈ తతంగమంతా పూర్తికాగానే అక్కడనుంచి వెళ్ళిపోవాలనుకున్నాడు.

"మీరు చెప్పినట్టే చేస్తాను." శ్రీకాంత్ ముందుకువచ్చి నిలబడ్డాడు.

సర్వయ్యను తీసుకువెడుతుంటే శ్యామసుందరీదేవి దుఃఖ పట్టుకోలేకపోయింది. ఎప్పుడో ఒకప్పుడు అందరు చనిపోతారని తెలుసు. కాని ఎప్పటికప్పుడు కొత్త కార్తీక తల్లిని పట్టుకుని ఏడ్చింది.

బామ్మగారు, ఒకరిద్దరు వాళ్ళని ఓదార్చారు. ఆ సాయంకాలం కర్మకాండలన్నీ పూర్తిఅయ్యాయి. శ్రీకాంత్ నిర్వికారంగా ఇంటికి తిరిగివచ్చాడు ఇలంతా కడిగి శుభ్రం చేయించాడు. బామ్మగారు

"బాధపడకు నాయనా! ఏది ఎలా జరగాలో అలా జరుగుతుంది." అతను నిజంగా బాధపడుతున్నాడనుకున్న శ్యామసుందరీదేవి అతన్ని ఓదార్చింది.

"పాపం చిన్నతనం. పైగా ఎప్పుడూ చూసి ఎరగడు. ఎలా బెంబేలుపడిపోయాడో" అంది బామ్మగారు.

"ఇదంతా నటన." మనసులో అనుకుంది కార్తీక. అభిరామ్ ఊళ్ళోలేడట. అప్పుడే వచ్చాడుట. ఆ సాయంకాలం తల్లి, తండ్రి, చిన్నచెల్లెల్ని తీసుకుని పలకరించడానికి వచ్చాడు. అన్నపూర్ణమ్మగారు, భర్త శ్యామసుందరీ విని ఓదార్చారు.

"కార్తీక! భయపడకమ్మా! పోనీ మా యింటికివచ్చి రెండు రోజులుండమ్మా!"

"మా అమ్మగారు ఒక్కరూ ఉండలేరండి!" అన్నపూర్ణమ్మ గారికి సమాధానమిచ్చింది కార్తీక.

అభిరామ్ మేడమీదికి వెళ్ళి శ్రీకాంత్‌ను పలకరించాడు. అతనంత ముభావంగా ఎందుకున్నాడో అభిరామ్‌కి అర్థంకాలేదు. కొంచెం సేపుండి కిందికి దిగివచ్చేసాడు.

అభిరామ్‌ను చూడగా కార్తీకకు మనసులోని బెంగంతా తీసేసినట్లనిపించింది. అభిరామ్ ఎంతో ఆప్యాయంగా చూసాడు. కార్తీక మరింత అభిమానంగా చూసింది. అందరు అక్కడే ఉండడంవల్ల అతనితో మాట్లాడలేకపోయింది. ఇద్దరు చూపులోనే ప్రేమను పంచుకున్నారు.

"ఆంటీ! అవసరముంటే కబురుచేయండి." అంటూ బయలుదేరాడు అభిరామ్.

అన్నపూర్ణమ్మగారు కూడా శ్యామసుందరీదేవిని ఎన్నో విధాల ధైర్యం చెప్పింది. కార్తీకను ఎంతో ఆప్యాయంగా పలకరించింది.

తరువాత అభిరామ్ వెంట తల్లిదండ్రులు, చిన్నపిల్లలు కూడా బయలు దేరారు.

రోహిణి సంగతి అడగాలనుకుంది కార్తీక. కాని అంతమందిలో అడగటానికి భయపడింది. నెమ్మదిగా అభిరామ్‌తో తాను విన్న విషయాలన్నీ చెప్పాలనుకుంది.

*　　　*　　　*

వాళ్ళు వెళ్ళిన తరువాత శ్యామసుందరీదేవికి కాస్త ధైర్యం వచ్చింది. సర్వయ్య లేకపోతే ఎలాగా అనుకుంది. కాని ఇప్పుడు ఏదో చెప్పలేని ధైర్యం వచ్చింది.

కాని అభిరామ్, అన్నపూర్ణమ్మ లాంటివాళ్ళు తనకు ఉన్నారు. ఒకవక్క బామ్మగారు, ఉత్తరవాళ్ళు ఉన్నారు. చీకటిలో చిరుదీపంలా అనిపించింది. బామ్మగారు అక్కడే ఉండిపోయారు. స్వాతి రాజా వంటరిగా మంచంమీద ఉన్నారని ఉత్తర ఇంటికి వెళ్ళిపోయింది. శ్యామసుందరీదేవి బంధువులు కూడా కొంతమందిని ఆవిడ బలవంతంగా ఆపింది. ఇల్లు కాస్త కలకలలాడుతుందనుకుంది.

ఆ రాత్రి శ్రీకాంత్ కంటికి నిద్రలేదు. ఇక్కడ తనకు ఆ లేదు. నాఅన్నవాళ్ళు లేరు. ఇల్లు, కారు, హోదా ఏమీ లేవు. తానిక్కడ నుండి వెళ్ళిపోవాలి. అమెరికాలో డాక్టర్లకి సంపాదనెక్కువ. ఇక్కడ కార్తీకను పెళ్ళి చేసుకోవాలనివచ్చాడు తాను. తాను వంటవాని కొడుకుగా ముద్ర వేయించుకోడు. అందుకే తిరిగి అమెరికా వెళ్ళి పోడానికి ప్రయత్నం చేయాలనుకున్నాడు. రోహిణికి తెలీకుండా వెళ్ళి పోవాలనుకున్నాడు. తెల్లవారే సమయంలో కాస్త కునుకుపట్టింది.

సర్వయ్య లేనిలోటు ఆ ఇంట్లో బాగా కనబడుతోంది. కుడి భుజం పడిపోయినట్లయింది శ్యామసుందరీదేవికి. వంటింట్లో ఎక్కడ ఏది సరుకులున్నాయో ఆవిడకే తెలియదు.

"సర్వయ్యా! ముందు నన్ను పంపించి తర్వాత నువ్వు వెడతా వనుకున్నాను!" అంటూ వాపోయింది శ్యామసుందరీదేవి.

బామ్మగారు మరో వంటావిడను మాట్లాడి తీసుకువచ్చింది. ఆవిడకు కూడా నలుభై ఏళ్ళు దాటాయి. భర్త ఎప్పుడో వదిలేశాడు. పిల్లలు లేరు.

"నాలాటి వాళ్ళకోసమే ఇటువంటి ఇళ్ళు నిలిపాడేమో ఆ భగవంతుడు" అనుకుంది ఆ వచ్చిన వంటావిడ.

"సుందరమ్మా! ఇదిగో వెలికి వెతికి వర్ధనమ్మను తీసుకొచ్చాను. నీ పని చేయించుకుని కడుపులో పెట్టి ఆదరించుకో. ఇక్కడ పడి వుంటుంది. నా అన్నవాళ్ళు ఎవ్వరూ లేరు." అప్పచెప్పింది బామ్మగారు.

కార్తీకకు, శ్యామసుందరీదేవికి కూడా ఆవిడను చూడగానే గౌరవభావం కలిగింది.

"ఈవిడను పెట్టుకుని ఎలాగో అలాగ కాలక్షేపం చేసుకోవచ్చని సరిపెట్టుకుంది శ్యామసుందరీదేవి."

* * *

స్వాతి, రాజాలు బాగా కోలుకున్నారు. ఇద్దరూ తిరిగి ఉద్యోగాల్లో చేరారు. స్కూటర్‌కు మాత్రం బాగా రిపేరువచ్చింది. రాజా చాలా బాధపడ్డాడు. "నయం ప్రాణాలు దక్కాయి. పైగా ఏ కాలు చెయ్యి వంకరపోలేదు. అందుకు సంతోషించు. అయినా నీకు భార్య ముఖ్యమా! స్కూటర్ ముఖ్యమా?" నిలదీసి అడిగింది స్వాతి.

"అమ్మో! నువ్వే ముఖ్యం స్వాతి. హాయిగా నువ్వూ నేను తిరగాలనుకున్నాను. ఆ సుఖం తప్పిపోయిందని బాధపడుతున్నా! అంతే." రాజా మరాసంగతి ఎత్తలేదు. స్కూటర్ రిపేరుకు పంపించాడు. ఇద్దరూ ఆటోమీద బయలుదేరుతున్నారు. ఆ దంపతుల్ని తిరిగి అలా చూసాక ఉత్తర మనస్సు కాస్త కుదుటపడింది.

"బామ్మగారూ! అన్నీ బాగున్నాయి కాని మా స్వాతి ఇద్దరు పిల్లల్ని నాకప్పచెబితే అంతేచాలు."

"ఉత్తరా! అంత కంగారుపడితే ఎలా? పెళ్ళై మూడునెలలు కాలేదు కదా!"

"అదికాదు బామ్మగారూ! నాకు ఎలాగూ ఈ జీవితానికి ఆ అదృష్టం లేదు. కనీసం దానికైనా ఆ అదృష్టం కలగాలని నా కోరిక. మాకు తల్లి లేదు తండ్రి లేదు. నా అన్నవాళ్ళు లేరు. కనీసం ఆ పిల్లల్లో అందరిని చూసుకుని ఆనందించాలని. అంతే బామ్మా!" ఉత్తర కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"అయ్యో! పిచ్చిపిల్లా! బాధపడకమ్మా! తప్పకుండా త్వరలో, నీ కోరిక నెరవేరుతుందమ్మా! కళ్ళు తుడుచుకో" ఆవిడ తన కొంగుతో ఉత్తర కళ్ళు తుడుచుకుంది. ఉత్తర వెక్కివెక్కి ఏడుస్తూ ఆవిడ వడిలో వాలిపోయింది.

"ఇప్పుడెందుకమ్మా! ఈ ఏడుపు! అన్నికష్టాలు తీరాయికదా!"

"అదికాదు బామా ! ఆయన్ని అలా పాడైపోమ్మని , చెప్పానా! ఇదంతా నాఖర్మ బామ్మా!" ఆయన సవ్యంగా ఉంటే ఎంత బాగుం ది చెప్పు!"

"పిచ్చిదానా? ఎందుకు బాధపడతావు? తల్లితండ్రులు లేక పోయినా నీ చెల్లెలినోయింటిదాన్ని చేసేవుకదా! నువ్వో ఉద్యోగం చేస్తున్నావు కదా! మీకో యిల్లుంది. వాకిలుంది. అతనొక్క కదా వంగాఉంటా! అతనుకూడా ఒక-ళ మారి తిరిగి వస్తాడేమోనమ్మా! నీ వితంలో తిరిగి వసంతమొస్తుందేమో ఉత్తరా! బాధపడకు. లే!"

బామ మాటలు నిజంగానే ఉత్తరకు ఉత్తేజాన్ని కలిగించాయి. చెల్లెలి భర్త అంత సంతోషంగా తిరుగుతుంటే తమ జీవితంలో పోగొట్టు కున్న మిటో కళ్ళముందు కనబడుతోంది. తన భర్త అలా దుర్మార్గు డిలా మారిపోబట్టే ఎండిన మ్రోడులా తను బతుకుతోంది. అన లోప మేమీ లేదు. ఏనాడూ భర్తను ఎదురించలేదు. ఎందరో భర్తలను ఎది

రించే ఆపవాళ్ళున్నారు. వారివి భర్తలు ఎంతో బాగా చూసుకొంటున్నారు. తను భర్తను ఎంతో గౌరవించేది. ప్రేమించేది. అడగకుండానే అన్నీ అమర్చేది. కాని తన జీవితం నాశనమైపోయింది. తనదోషమేమిటో ఎంత ఆలోచించినా ఆమెకు అర్థంకాలేదు. ఎప్పటికైన మంచి రోజులు వస్తాయేమో? ఏదో ఆశ గుండెపొరల్లో మెదిలింది.

* * *

శ్రీకాంత్ ఎవరికి చెప్పకుండా తిరిగి వెళ్ళిపోవానికి ఏర్పాట్లన్నీ చేసుకుంటున్నాడు. ఆరోజు వీసాకి వెళ్ళాలనుకున్నాడు. ఇంట్లోవాళ్ళతో సరిగా మాటలులేవు. వంటావిడ వర్ధనమ్మ వండిపెడుతోంది. వెళ్ళి తిని తిరిగి రూముకు వెళ్ళిపోతున్నాడు.

అభిరామ్ రోజూ వెళ్ళి శ్యామసుందరీదేవిని కార్తీకను పలకరించి రావాలనుకున్నాడు. శ్రీకాంత్ కొత్తగా ఏమైనా అల్లరిచేస్తాడేమోనని భయపడి వెళ్ళలేదు. బలవంతంగా కార్తీకను చూడాలనే కోరిక అణచుకుంటున్నాడు.

సర్వేయ్య పోయిన తరువాత కార్తీక ఇల్లువదలి బయటకు వెళ్ళానికే భయపడుతోంది. తను ఇంట్లో లేకపోతే ఆ శ్రీకాంత్ తల్లిని ఏంచేస్తాడోనన్న భయం పట్టుకుంది. అందుకే అభిరామ్‌ను చూడాల. కోరిక బలవంతంగా అణచుకుంటోంది.

* * *

ఆరోజు అప్పుడే చీకటిపడుతోంది. రోహిణి తలుపు తీసుకుని లోపలికి వచ్చింది. చేతిలో పెట్టెవుంది ఆమె మెట్లెక్కి శ్రీకాంత్ గదిలోకి వెడుతూండటే కార్తీక చూసింది. వెంటనే తల్లితో ఆ విషయం

చెప్పింది. "అదేమిటే కార్తీ: ఆపిల్ల పెట్టె తీసుకుని రావడమేమిటమ్మా! ఏం జరిగిందే అసలు."

"అమ్మా! కంగారుపడకు. రోహిణి గర్భవతి. శ్రీకాంత్ పెళ్ళి చేసుకుంటానని మోసం చేసాడమ్మా!"

"కార్తీ! రోహిణి సంగతి ఇంట్లో వాళ్ళకి తెలుసా"

"తెలీదమ్మా! నాక్కూడా మొన్న మొన్ననే తెలిసింది. ఇద్దరు చేసుకుంటారేమోనని ఎదురు చూస్తున్నానామ్మా! అభిరామ్‌తో చెప్ప డానికి నాకు నోరు రావడంలేదు."

"ఇప్పుడెందుకు వచ్చిందో! కాస్త కనుక్కో కార్తీ! వాడిని పిలిచి మెళ్ళో తాళికట్టిస్తాను! అంతేకాదు. అభిరామ్‌ని పిలిచి ఈ విషయం మాట్లాడుతాను."

"ఆపని చెయ్యమ్మా! రా! రా!"

శ్యామసుందరీదేవి చెయ్యి పట్టుకుని మేడ మెట్లవరకు తీసుకు వచ్చింది. మేడ ఎక్కించి శ్రీకాంతు దగ్గరకు తీసుకువెళ్ళాలని కార్తీక తాపత్రయం.

ఒక్క మెట్టు ఎక్కింది శ్యామసుందరీదేవి. అంతలో పెట్టె తీసు కుని రోహిణి వేగంగా వస్తోంది. కన్నీళ్ళు తుడుచుకుంటూ పరుగున వస్తోంది. శ్యామసుందరీదేవి పక్కకు జరగబోయింది. రోహిణి ఆమెను తోసుకుంటు ముందుకు వెళ్ళిపోయింది.

"రోహిణీ! ఆగు! రోహిణీ! ఆగు!" కార్తీక పిలుపు రోహిణికి వినపడలేదు. వినే ఆగలేదో ముందుకు వెళ్ళిపోయింది పడిపోయిన తల్లిని లేవ సింది. నడిపించుకుంటు వెళ్ళి గదిలో పడుకోపెట్టి చల్లని నీళ్ళు తాగించింది కార్తీక.

"అమ్మా! నేను అభిరామ్‌తో చెప్పివస్తాను. ఈమె యింటికి వెడుతుందోలేదో?"

"అలాగె కార్తీ! నువ్వు వెంట వెళ్ళు. అతను లేకపోతే ఇంటికి వెళ్ళి చెప్పు?"

కార్తీక వర్ధనమ్మను తల్లి దగ్గరే కూర్చోమని చెప్పింది.

"కార్తీ! ఎందుకేనా మంచిది ఫోను చెయ్యి ఆలస్యంకాకూడదు."

"అవునమ్మా! నిజమే!" కార్తీక ఫోను దగ్గరకు పరుగెత్తింది.

"హలో! అభిరామ్" అభిరామ్‌తో జరిగినదంతా చెప్పింది. ఇంటికి ఫోను చేసి అడుగుతానని పోను పెట్టేసాడు. ఉండబట్టలేని కార్తీక వాళ్ళింటికి ఫోను చేసింది రోహిని లేదని తెలిసి కార్తీక కంగారు పడింది.

"అమ్మా! ఉత్తరను, స్వాతిని తీసుకుని . నుకూడా వెతకడాని వెడతానమ్మా!"

"నువ్వెక్కడ వెతుకుతావే కార్తీ!"

"అలా అనకమ్మా! రోడ్లు, పార్కులు, బస్సుషాపులు, రైలు స్టేషనులు వెతుకుతామమ్మా!"

అది సరే ప్రకాంత్ సంగతేమిటి? అతను పారిపో ? వెళ్ళి గదికి తాళం పెట్టి రమ్మని వర్ధనమ్మకు చెప్పు."

వర్ధనమ్మ వెళ్ళడానికి భయపడింది. కార్తీక మెట్లు ఎక్కి చూసింది. ప్రకాంత్ మంచంమీద బోర్లా పడుకుని ఉన్నాడు. అదే సమయమనుకున్న కార్తీక దగ్గరగా ఉన్న తలుపులను లాగి బయట గడియవేసి తాళం పెట్టింది. మెళకువ వచ్చిన ప్రకాంత్ "ఎవరది? తలుపు తీయండి. నేను బయటకు వచ్చానంటే చంపేస్తాను." అతని మాటలు ముద్దగా ఉన్నాయి. కార్తీక భయంతో వణికిపోతూనే క్రిందికి దిగివచ్చేసింది. "బాగా తాగినట్టున్నాడు. ఏం భయంలేదు. మెల్లిగారా! శ్యామసుందరీదేవి ఎదురువెళ్ళి ఆమెను చెయ్యి పట్టుకుని దింపింది. తరువాత కార్తీక స్వాతిని, ఉత్తరను తీసుకుని తన కార్లో అభిరామ్‌ని కలుసుకోడానికి బయలుదేరింది.

* * *

అభిరామ్ వచ్చే దుఃఖాన్ని ఆపుకుని పో స్టేషన్‌లో కంప్లైంట్ చేసాడు. తరువాత తన ముఖ్యమైన స్నేహితులతో కలిసి రోడ్లమ్మట వెతకడం మొదలుపెట్టాడు. కావలసిన వాళ్ళంతా తలో ప్రాంతానికి వెళ్ళారు. బస్సు స్టాపులు, రోడ్లు, రైల్వేస్టేషనుకు అన్నీ వెతకడం మొదలుపెట్టారు. పోలీసులు మరోపక్క వెతుకుతున్నారు. ఎక్కడా ఆమె జాడ లేదు. స్నేహితుల ఇళ్ళకు వెళ్ళి అడిగాడు. రేటాకి రోహిణికి మంచి స్నేహం. వాళ్ళింటికెళ్ళి అడిగాడు.

"అభిరామ్! మునపటి రోహిణికాదు ఆమె. ఆమె కాలేజీలో క్లాసుకి వచ్చి మూడు నెలలయింది. కాలేజీకి రాగానే శ్రీకాంత్‌తో సినిమాలు, షికార్లు. ఎన్నోసార్లు మేము మందలించాము. కాని ఆమె మా మాట వినలేదు. నిన్న తెలిసింది ఆమెకు మూడో నెల. పెండ్లి కాకుండానే గర్భవతి అయింది. ఎబార్షన్ చేయించుకోమన్నా వినలేదు. శ్రీకాంత్‌ను ఒప్పించి పెళ్ళి చేసుకోవాలని ఆమె తాపత్రయం. కాని శ్రీకాంత్ చాలా చెడ్డవాడని తెలిసింది. ఇదంతా ఆమె తప్పేకాదు. ఇంట్లో వాళ్ళ తప్పుంది అభిరామ్. ఆమెకు భయంలేదు. ఇంట్లో వాళ్ళంటే గౌరవం లేదు. అందుకే ఈ పరిస్థితి వచ్చింది. మేం కూడా మా ప్రయత్నం చేస్తాం! మీరూ వెతకండి".

అభిరామ్ నీరసంగా యింటికి బయలుదేరాడు. ఎన్నో లంఖణాలు చేసినంత నీరసపడ్డాడు. నడవలేక నడవలేక ఇంట్లో అడుగు పెట్టాడు. తల్లిదండ్రులు ఇద్దరు బెంగగా మంచాలమీద పడివున్నారు. వారితో అన్ని విషయాలు చెప్పాడు.

"నాయనా! ఎక్కడైన వార్త తెలిసిందిరా!" తల్లి అడిగింది.

"వద్దురా! వెతక్కండి! పెండ్లి కాకుండా కాలుజారింది. అది ఇంటికి వచ్చినా దాన్ని యింట్లోకి రానియడం ఎలాగరా! దాన్ని

వదిలేయండి. నా దృష్టిలో అది చనిపోయినట్టే లెక్క. నాకు ఒక త్తె ఆడపిల్లని చెబుతారా:" ఆయన మాటలు దీనంగా ఉన్నాయి వర్షారంభ మైన మేఘంలా ఉన్నాయి ఆయన కళ్ళు.

"బాధపడకండి నాన్నగారూ: అది ఎక్కడ వున్నా తీసుకువచ్చి ఆ శ్రీకాంత్‌తో పెళ్ళి జరిపిస్తా నాన్నగారు. మీరు అంత మాటనకండి నాన్నగారూ!" అభిరామ్ దుఃఖాన్ని ఆపుకోలేకపోయారు. అన్నపూర్ణమ్మ గారి దుఃఖానికి అంతేలేదు.

చీకటిపడింది. రోహిణి జాడలేదు. అభిరామ్ స్నేహితులు, పోలీసులు వెతికినచోట వెతక్కుండా వెతుకుతూనే ఉన్నారు. మరో పక్క కార్తీక, స్వాతి, ఉత్తర వెదుకుతూనే ఉన్నారు. రాత్రి 10 గం. కాగానే ఉత్తర, స్వాతి కార్తీకవెంట యిల్లు చేరుకున్నారు.

జరిగిన సంగతంతా కార్తీకమరోసారి అభిరామ్‌తో చెప్పింది. తర్వాత శ్రీకాంత్‌ను గదిలో పెట్టి తాళంపెట్టిన సంగతికూడా చెప్పింది.

"నిజమా! నిజంగా మీరు పోలీసులకంటే ముందుజాగ్రత్త తీసుకోడంలో ముందున్నారు." అంత దుఃఖంలోను వారిని అభినందించాడు అభిరామ్.

ఇంటికి మరోసారి ఫోనుచేసాడు. రోహిణి జాడ తెలియలేదు. ఎటువెళ్ళిందో ఎవ్వరూ చెప్పలేకపోయారు. అభిరామ్‌కి అనుమానం బయలుదేరింది. రోహిణి ఇంక బతికిలేదనుకున్నాడు. ఆ భారంతో యింటికి బయలుదేరాడు.

* * *

తెల్లవారింది. రోహిణి జాడలేదు. శ్రీకాంత్‌ను ఏంచేయ్యాలో ఎవరూ ఊహించలేకపోయారు. కాని పొద్దుటే పోలీసులు జీప్పులో యింటిముందు దిగారు. ఏ వార్త వినవలసివస్తుందోనని కార్తీక,

శ్యామసుందరి వి వణికిపోయారు. అంతకుముం స్వాతి, ఉత్తర యింటికి వెళ్ళిపోయారు.

"శ్రీకాంత్ ఎక్కడ?"

"ఎందుకూ?" కార్తీక నోరు పెగలించుకుని అడిగింది.

"నిన్నటినుంచి రోహిణి అ. అమ్మాయి ఇంటికి వెళ్ళలేదు. ఆమె ఇక్కడకు వచ్చి శ్రీకాంతును కలుసుకున్నట్లు తెలిసింది. అతనిని కొన్ని ప్రశ్నలడగాలి."

"అలాగే!" కార్తీక తలూపింది.

వర్ధనమ్మ రూము తాళం తీసుకుని పోలేసులవెంట పైకివెళ్ళింది.

"ఇదేమిటి? రూముకు తాళం ఎవరు వేసారు?" ఇనస్పెక్టర్ కంఠం ఖంగుమంది.

"అయ్యగారు ఎక్కడకైనా పారిపోతారని అమ్మగారే వెయ్య మన్నారు?"

తాళం •సి లోపలికి వెళ్ళారు.

"రోహిణితో పరిచయం ఎన్నాళ్ళనుంచి."

"ఆరు నెలలనుంచి" శ్రీకాంత్ సమాధానమిచ్చాడు."

"నిన్న మిమ్మల్ని కలిసిందా!"

"కలిసింది!"

"ఆమె ఇల్లు వదలి వెళ్ళిపోయింది. మీకు తెలుసా!"

"తె దు? నాకెవ్వరు చెప్పలేదు?"

"మిమ్మల్ని ఎందుకు కలిసింది? మీ యిద్దరికి సంబంధ మేమిటి!

"యువ యువకుల సంబంధం ఇద్దరం తొందరపడ్డాం! గర్భవతిఅయింది. ను పెళ్ళిచేసుకోనన్నాను. అం !"

పెళ్ళి చేసుకునే ఉద్దేశం లేనప్పుడు ఆమెతో ఎందుకంత చనువుగా ఉన్నారు?"

"ఆమె కోరింది కనుక? ఆమె పనుపుగా ఉంది కనుక."

"ఆమె కేమైనా ప్రమాదం జరిగితే."

"అది నా బాధ్యత కాదు? అయినా నేనుకుంటంలేదు?"

అతని సమాధానానికి పోలీసులు ఇనస్పెక్టరు కూడా ఆశ్చర్యపోయారు. ఎప్పుడు వచ్చి అభిరామ్ వెనకాల నిలబడ్డాడో అతను మరింత ఆశ్చర్యపడ్డాడు.

"నీవల్లె రోహిణి యిల్లు వదిలింది. ఆమె వచ్చేవరకు నిన్ను అరెస్టు చేస్తున్నాము."

పోలీసులు అతనిని తీసుకువెళ్ళాలనుకున్నారు.

అభిరామ్ వచ్చి అడ్డుపడ్డాడు. అతనిని ఇల్లు కదిలివెళ్ళకుండా చెయ్యమన్నాడు.

"శ్యామసుందరీ వి కూడా అదేమాట చెప్పింది.

అతను బయటకు వెళ్ళకుండా ఇద్దరు పోలీసులను కాపలా పెట్టి వాళ్ళు వెళ్ళిపోయారు.

శ్రీకాంత్ మనసులో ఏమనుకుంటున్నాడో ఎవరికీ తెలీదు. గదిలో రాగే ఉండిపోయాడు.

పాస్‌పోర్టు ఆఫీసుకి పోలీసులు కబురు చేసారు. అతని పాస్‌పోర్టును పోలీసులు స్వాధీనం చేసుకున్నారు.

* * *

అప్పుడే తెల్లవారింది. ఎప్పుడు కునుకు పట్టిందో కాని ఆ యింట్లో వాళ్ళకి మెలకువవచ్చింది. రోహిణి యింటికి వచ్చిందేమోనన్న ఆశ అందరిలోను కలిగింది. ఒకరికి తెలియకుండానని మరొకరు ఇల్లంతా వెతికారు. ఎక్కడా రోహిణి జాడలేదు. అన్నపూర్ణను గారికి నిరాశతో

కడుపు మరింత చెరువయింది.

"అమ్మా! రోహిణీ! నన్ను వొదిలిపెట్టి వెళ్ళిపోయావా తల్లీ!" అంటు ఘొల్లుమంది.

కామేశ్వరరావుగారు ఏమీ చెయ్యలేక ఆమె దుఃఖాన్ని ఆపే శక్తి లేక పడక కుర్చీలో వాలిపోయారు.

"ఏడవకమ్మా! ఏడవకు" తల్లిని పట్టుకుని అభిరామ్ ఓదార్చాడు.

అంతలో జీపువచ్చి యింటిముందు ఆగింది. పోలీసులు జీపు దిగి లోపలికి వచ్చారు.

కామేశ్వరరావుగారు. అభిరామ్ కంగారుగా చూసారు. తల్లి దగ్గర నుంచి లేచి అభిరామ్ వాళ్ళకి ఎదురు వెళ్ళాడు.

వెరీసారీ! మిస్టర్ అభిరామ్! ఒక యువతి రైలుకిందపడి మర ణించింది. మీరు చెప్పిన గుర్తుల ప్రకారం మీ చెల్లెలు రోహిణిలాగె ఉంది. మీరు వచ్చి ఒకసారి చూడాలి.

"అన్నపూర్ణమ్మగారు మరోసారి ఘొల్లుమంది.

"అమ్మా! నువ్వూరుకో! రేవతీ అమ్మను పట్టుకో' అంటూనె అభిరామ్ పోలీసుల వెనక బయలు రాడు.

రోహిణి లాగెఉంది. కాని తల పూర్తిగా ఆకారంలో లేకపోవడం వల్ల రోహిణి అనటానికి వీలులేదు. ఆ ఆకారాన్ని చూసగా. అభిరామ్ వెక్కి వెక్కి పడ్డాడు.

అంతలో కార్తీక, ఉత్తర, స్వాతి అక్కడకు వచ్చారు. కార్తీక చూడగానె భయంతో బిగుసుకుపోయింది. కాని పరిశీలించి చూసిన తరు వాత "రోహిణి కాదు! కాదు! ఆ చెప్పులు ఆమెవికావు. రోహిణి పాదం అలా ఉండదు. రోహిణి చేతికి గాజులు వేసుకోదు" అంటు అరిచింది. అందరు తలో విధంగాను చర్చలు జరిపారు.

"రోహిణి చేతిలో పెట్టి ఉండాలి." కార్తీక సందేహం వెలి బుచ్చింది.

"పెట్టినేముంటదమ్మా. ఎవరో దొంగలు పట్టుకుపోయి వుంటవచ్చు." ఒక పెద్దాయన సమాధానమిచ్చాడు.

"అందరిలో ఆఖరిసారి రోహిణిని చూసింది కార్తీక. అందుకే అవునో, కాదో ఆమె చెప్పమన్నారు.

"ఆ కంగారుతో కార్తీక ఒకసారి అవునని, మరోసారి కాదని చెప్పింది. అభిరామ్ ఏమీ చెప్పలేకపోయాడు.

"రోహిణేనండి! ఇంక అనుమానమేమిటండీ!" పోలీసులు తొందర చేసారు. కేసు మూసేయవచ్చని వారి తొందర.

శవ పరీక్షకు తీసుకువెళ్ళారు పోలీసులు. అభిరామ్ తల్లి తండ్రులతో అన్ని విషయాలు చర్చించాడు. అన్నపూర్ణమ్మ గారు ఆమె రోహిణి అయినా కాకపోయినా కర్మకాండలు జరిపించాలంది. ఆమె రోహిణి కాకపోతే ఒక అనాధకు దహన సంస్కారాలు చేయడం పాపం కాదని ఆమె వాదన. కామేశ్వరరావుగారు ఆమె మాట కాదనలేక దహన సంస్కారాలు చెయ్యడానికే నిశ్చయించుకున్నారు. శవ పరీక్షనుండి ఇంటికి తీసుకురాకుండా మరుభూమికి తీసుకువెళ్ళారు అభిరామ్ దగ్గరే ఉన్నాడు.

ఇంటికి తిరిగివచ్చిన తరువాత అందరూ మరోసారి స్నానాలు చేసారు. శ్యామసుందరీదేవి, కార్తీక, ఉత్తర, స్వాతి, బామ్మగారు కలిసి అన్నపూర్ణమ్మగారిని పలకరించడానికి వెళ్ళారు.

"కార్తీకా! ఇంక రోహిణి లేదమ్మా!" అంటూ అన్నపూర్ణమ్మ గారు గుండెలు బాదుకుంటూ ఏడ్చింది.

"పోయినవారు తిరిగిరారు. ఉన్నవారిని చూసుకోకుండా అలా ఏడవకండి" అంటూ శ్యామసుందరీదేవి, బామ్మగారు అన్నపూర్ణమ్మగారిని ఎన్నోవిధాల ఓదార్చారు. కాస్సేపుండి శ్యామసుందరీదేవి వాళ్ళు తిరిగి వచ్చేసారు.

ఆ రాత్రికి కావలసిన బంధువులంతా చేరుకున్నారు. పెళ్ళివారి ఇంటి సందడిలా వుంది. ఇంటికి చిన్న పెద్ద తేడా లేకుండా ఎవరు వచ్చినా అన్నపూర్ణమ్మగారు వెక్కి వెక్కి ఏడుస్తూనే ఉంది. ఆమెను ఓదార్చలేకపోతున్నారు. రాత్రి అయ్యేసరికి ఆమెకు ఏడ్చే ఓపిక తగ్గిపోయింది. కన్నీళ్ళు కారడమే ఆగిపోయాయి. దహన సంస్కారాలు చేసిన తరువాత ఆందోళన తగ్గిపోయింది. ఆ యింట్లో అందరిలోను నిస్తబ్ధత ఆవరించింది.

* * *

"శ్రీకాంత్! రోహిణి చనిపోయింది." శ్యామసుందరీదేవి మేడ మీదికి వెళ్ళి చెప్పింది. శ్రీకాంత్ ఒక్కసారి ఉలిక్కిపడి చాడు.

"రోహిణి చనిపోయిందయ్యా!" తిరిగి ఆవిడే చెప్పింది అతను ఎటో చూస్తూ అలాగే కూర్చున్నాడు. ఉలుకుపలుకులేదు.

"శ్రీకాంత్! రైలు కింద పడి చనిపోయిన ఆమె శవం దొరికింది దహన సంస్కారాలు కూడా జరిగిపోయాయి. ఆమె చనిపోయింది."

అతను అంత ధైర్యంగా ఎలా ఉన్నాడో శ్యామసుందరీదే అర్థం కాలేదు. ఏదైన శ్రీకాంత్‌ను మాత్రం నమ్మకూడదు. అతను ఒ మోసగాడు. హృదయంకాదది రాయి." ఆవిడ మెట్లుదిగి కింది వచ్చేసింది.

అతను పారిపోయే ప్రసక్తేలేదు. ఆ గదిలో ఉండిపోయాడు. కాపలా పోలీసులు యింక అవసరంలేదని అనుకుంది శ్యామసుందరీదేవి [illegible] ఎందుకో చెడునే శంకించింది. తను కార్తి వంటరిగా

నమ్మ వంట చేస్తూ ఇంట్లోనే ఉంటున్నా శ్యామసుందరీదేవి భయం తో ఉంది.

"వర్ధనమ్మా! వెళ్ళి బామ్మగారిని పిలుచుకురా! ఆవిడను ఇక్కడే రెండు రోజులు ఉండమన్నానని చెప్పు" ఆవిడ మాటలు పూర్తికాకుం డానే వర్ధనమ్మ బయలుదేరింది. మనస్సులో ఆమెకూ భయంగా ఉంది.

"ఇప్పుడు బామ్మగారెందుకమ్మా! భయపడుతున్నావా?" కార్తీక ఆశ్చర్యంగా అడిగింది.

"అవును కార్తీ! నాకెందుకో భయంగా ఉంది. శ్రీకాంత్ అర్ధ రాత్రి లేచి ఏ అల్లరి చేస్తాడోనని భయంగా ఉంది. అందుకే పోలీసుల్ని కూడా ఉండమన్నాను. నేను అనారోగ్యం మనిషిని అందు కబురు చేసాను."

"ఇందాక మనందరం కలిసి అభిరామ్ యింటికి వెళ్ళాంకదా! అప్పుడే బామ్మగారిని రమ్మనవలసింది."

"అప్పుడు నాకు ఈ ఆలోచన రాలేదు. పైగా చీకటిపడుతుంటె భయంగా ఉంది. అన్ని ఆందోళనలకు ఆలవాలం రాత్రేకదా!"

"నిజమేనమ్మా! నాకూ భయంగానే ఉంది. పైగా శ్రీకాంత్ తో ఈ విషయాలన్నీ చెప్పావు. అర్ధరాత్రి కోపంతో ఏమైనా చేయగలడు"

"అదే నాకూ భయంగా ఉంది."

అంతలో బామ్మగారిని వెంటపెట్టుకుని వర్ధనమ్మ వచ్చింది.

"సుందరమ్మా! కబురుపెట్టావు? అయ్యో తల్లీ! నీకు భయ మేమిటమ్మా!"

"ఏంలేదు బామ్మగారూ! శ్రీకాంత్‌ను చూసి భయపడుతోంది.'

నిజమేనమ్మా! కార్తీకా! అతన్నిచూసి ఎవరైన భయపడ వలసిందే? వీధుల్లో పోలీసులున్నారు. ఇంట్లో ఒకరికొకరు తోడున్నా ముగా! అయినా తలుపులు గడియలు పెట్టుకు పడుకుందాం పదండి.''

"నిజమే పిన్నిగారూ! బాగా చెప్పారు." శ్యామసుందరీదేవి తేలిగ్గా ఊపిరి పీల్చుకుంది.

"వర్ధనమ్మా! శ్రీకాంత్‌కి భోజనం పెట్టావా?"

"లేదమ్మా! మధ్యాహ్నం కూడా ఆ బాబు భోజనం చెయ్యలేదు. ఈపూట నాకెందుకో భయంగా ఉందమ్మా!" శ్యామసుందరీదేవికి సమాధానమిచ్చింది వర్ధనమ్మ!

"అదేమిటి వర్ధనమ్మా! అలా వణికిపోతున్నావు? నీకు తోడుగా నేనుంటాగా."

"అలాగే బామ్మగారూ!" వర్ధనమ్మ వెనకే బామ్మగారు బయలుదేరింది. గదిలోకి వెళ్ళి టేబులుమీద అన్నీ సర్దింది వర్ధనమ్మ. ఆమె కాళ్ళు చేతులు గడగడ వణుకుతున్నాయి. సర్దడం పూర్తిచేసి బయటకు రాబోయింది. పడుకున్న శ్రీకాంత్ చటుక్కున లేచాడు.

"దాని సంగతి నా దగ్గరెత్తితే చంపేస్తాను జాగ్రత్త. ముందిక్కడనుంచి పో!"

అతని అరుపులకి వర్ధనమ్మతోపాటు, బామ్మగారు కూడా వెను తిరిగి చూడకుండా కిందికి దిగివచ్చేసింది.

ఈసారి నిజంగానే అందరు భయపడ్డారు. అందరు కలిసి శ్యామసుందరీదేవి గదిలోనే తలుపులు గడియపెట్టుకుని పడుకున్నారు. చాలసేపటివరకు వారికి నిద్రపట్టలేదు. అతని గదికి బయటితాళం పెట్టవలసిందేమో అనుకున్నారు కాని తలుపులు మూసి తాళంపెట్టే ధైర్యం ఎవరికి లేదు. పైగా శ్రీకాంత్ మరింత పిచ్చిపోతాడనే అనుమానం కూడా కలిగింది. అలా ఎంతోసేపు చర్చించుకున్నవారికి నిద్రపడుతూ ఉంది.

"శ్రీకాంత్ గో! ఇన్‌సైడ్" అది పోలీసుగొంతు.

"నేను లోపలికి వెళ్ళను. మీరెవ్వరు నన్నాపటానికి." అది

శ్రీకాంత్ శాంతం.

ఆ మాటలు వినబడగా, అందరు లేచికూర్చున్నారు.

"ఇప్పుడెలా? శ్రీకాంత్‌తో ఇంకా ఎన్ని పాట్లుపడాలో పిన్ని గారూ!"

"కంగారుపడకు సుందరమ్మా! అన్ని గొడవలు అ- సర్దు కుంటాయి. పోలీసులు అతన్ని లోపలకి లాక్కువస్తున్నట్లున్నారు. చూడమ్మా!" తలుపులు కొంచెం తెరిచి తలుపు సందుల్లోంచి చూడ్డం మొదలుపెట్టారు.

పోలీసులు అతన్ని గదిలోకి తోసి తలుపులు మూసి తాళాలు పోట్టారు. పోలీసులు కిందికి దిగివస్తుంటే బామ్మగారు, కార్తీక, శ్యామ సుందరీ వీ తలుపులు -సి బయటకు వచ్చారు.

"అమ్మా! ఇతని ప్రవర్తన మారకపో పోలీసు కష్ట లో పెట్ట వలసి వస్తుంది. అతని బలంముందు మేమందరం ఆగలేకపోయాం. మాకు ని దపడి ఎంత ప్రమాదమైన జరిగేది. తలుపులు పెట్టుకుని పడుకోండి." పోలీసులు తిరిగి బయటకు వెళ్ళిపోయారు. వీధి తలుపు లకు కూడా తాళాలు-సి తిరిగి కార్తీకవాళ్ళు పడుకోడానికి వెళ్ళారు.

తలుపులు తియ్యండ రా? -ను బయటకు వచ్చానంటే మీపని చెబుతా?" శ్రీకాంత్ తలుపులు బాదుతూ అల్లరి చెయ్యడం మొదలు పెట్టాడు. ఎవ్వరూ ఏమీ మాట్లాడలేదు. శ్రీకాంత్ తలుపులు బాదుతూనే ఉన్నాడు. అందరు వినిపించుకోనట్టే పడుకున్నారు.

* * *

రోజులాగె తెల్లవారింది. ఆ యింట్లో వాళ్ళు మాతం మరింత కంగారుగా ఉన్నారు. శ్రీకాంత్ అరుపులు, కలు మరింత ఎక్కు

వయ్యాయి. పోలీసులుకూడా కంగారుపడ్డారు.

"అమ్మా! కార్తీక! మన డాక్టరుకి ఫోనుచేసి వెంటనే రమ్మను."

అమ్మా! నువ్వు కంగారుపడకు. స్థిమితంగా ఉండు. నేను డాక్టరుకి ఫోను చేస్తాను." తల్లి ఏదో బాధపడుతోందని కార్తీక ఇట్టే గ్రహించింది. కార్తీక ఫోను చెయ్యగా డాక్టరు వచ్చాడు. కాని శ్రీకాంత్‌ని పరీక్ష చెయ్యడరి అతని తరం కాలేదు

"ఇతన్ని మెంటల్ హాస్పిటల్లో చేర్చడం మంచిదమ్మా!" డాక్టరు తన పనైపోయినట్టు వెళ్ళిపోయాడు. తమకు విముక్తి కలిగిందని పోలీసులు సంబరపడ్డారు.

కార్తీక వెంటనే ఆవిషయం అభిరామ్‌కి ఫోనుచేసి చెప్పింది. అభిరామ్ మెంటల్ హాస్పటల్ అంబులెన్సులో బయలు దేరివచ్చాడు. శ్యామసుందరీదేవికి అంతా అయోమయంలా అనిపించింది.

"ఆంటీ! మీరనవసరంగా కంగారుపడకండీ!" ఆవిడ శోకానికి అంతులేదు. శ్రీకాంత్ తలఎత్తి ఆమెవైపు ఒక్కసారి చూసి తిరిగి చూపులు మార్చుకున్నాడు.

"నాయనా! అభిరామ్ హాస్పటల్లో శ్రీకాంత్‌ని కొట్టరు కదా! - వేళకి తిండి పెడతారా! కాఫీ అదీ ఇస్తారా? జాగత్తగా చూస్తారా? నిను నమ్మి అతన్ని పంపిస్తున్నానయ్యా!" ఆవిడ మాటలు విన్నవారికి గుండెల చెరువయ్యాయి.

"ఆంటీ! మీరేం భయపడకండి. హాస్పటల్లో ఎవ్వరూ శ్రీకాంత్‌ని కొట్టరు. జాగ్రత్తగా చూస్తారు. నేను వాళ్ళకి చెబుతాగా! మీరు అనవసరంగా కంగారుపడకండి "వాను బయలుదేరేవరకు అభిరామ్ ఆమెకు ధైర్యం చెబుతూనే ఉన్నాడు.

వ్యాను బయలుదేరి వెళ్ళిపోయింది.

"చూశావా పిన్నీ! వాడిని నేను కన్నకొడుకులా పెంచాను.

డబ్బు ఖర్చుపెట్టి చదివించి పెద్దవాణ్ణి చేసాను. వాడు ప్రయోజకుడై నా కూతుర్ని పెళ్ళిచేసుకుని నన్ను చూస్తాడనుకున్నాను. వాడి చేతుల్లో నా ఆఖరిశ్వాస వదలాలనుకున్నాను. కాని చూశావా? ఏం జరిగిందో? చిన్నతనంనుంచి మేనరికాలని, పెళ్ళిళ్ళని కోరికలు పెట్టుకోకూడదు. వారిలో కోరికలు పెంచకూడదు. దానివల్లే యిన్ని అనర్థకాలు జరిగాయి. ఇన్ని ప్రాణులు బాధకు గురిఅయ్యాయి. చూశారా పిన్నిగారూ? ఇప్పుడేమిటి చెయ్యడం. నా ఆడబిడ్డకు చనిపోతూ యిచ్చిన మాట నిలబెట్టుకోలేకపోయాను. ఆవిడ ఏ లోకంలో ఉందోకాని ఈ సంగతి చూసిందంటే నన్ను శపిస్తుంది పిన్నిగారూ? నన్ను శపిస్తుంది."

"సుందరమ్మా! ఇందులో నీ తప్పేముంది? అతన్ని కన్నబిడ్డలా పెంచావు. విదేశాలకు పంపి చదువుకూడా చెప్పించావు? కాని అతను మోసగాడని, ఒక రాక్షసుడని నీకు తెలియదుకదా! వారి మనస్సులు కలవనప్పుడు నువ్వేంచేస్తావు? అనవసరంగా బాధపడకు. ఏది ఎలా జరగాలో ఆలా జరుగుతుంది మన ప్రయత్నం కొంతవరకే. ఇక్కడ ఉండి నేచేయవలసిందేమీ లేదు. ఇంక నేవెళతాను సుందరమ్మా! నువ్వు ధైర్యంగా ఉండాలి."

బామ్మగారు మరోసారి ఆవిడకు ధైర్యంచెప్పి యింటికి బయలుదేరింది. శ్యామసుందరీదేవి నీరసంగా మంచంమీద వాలింది.

* * *

రోజులు గడిచిపోతున్నాయి. రోహిణి చనిపోయిందనే అనుకుంటున్నారు. ఆ సంఘటన జరిగిన తరువాత అన్నపూర్ణమ్మగారు లేచి తిరగడమేలేదు. మంచాన్ని అంటిపెట్టుకుని పడుకునే ఉంటోంది. వంటికి, ఇంటిపనికి మరో మనిషిని కుదుర్చుకున్నారు. రేవతి కాలేజికి వెళ్ళివస్తోంది. ఇంటర్ పరీక్షలు దగ్గరకు వచ్చాయి. అయినా ఎక్కువ

శ్రద్ధగా చదవలేకపోతోంది. అభిరామ్ దృష్టి తల్లిదండ్రులమీదే ఉంటోంది. హాస్పటల్‌కి వెళ్ళినా అక్కడ ఎక్కువసేపు ఉండలేక పోతున్నాడు. మధ్యలో రెండుసార్లు ఇంటికి ఫోను చేస్తున్నాడు.

ఆరోజు అభిరామ్ హాస్పటల్లో చాలా బిజీగా ఉన్నాడు. అర్జంటు కేసులతో బిక్కిరి బిక్కిరి అవుతున్నాడు. ఆ సమయంలో ఫోను మోగింది. అసిస్టెంటు ఫోను తీసుకున్నాడు.

"హలో! అభిరామ్ కావాలి."

వారు బిజీగా ఉన్నారు.

"అర్జంట్. మద్రాసునించి మాట్లాడుతున్నా! అభిరామ్‌ని లైను లోకి పిలవండి." అసిస్టెంటు ఇంక చేసేదిలేక వెళ్ళి అభిరామ్‌తో చెప్పాడు.

"మద్రాసునించా అర్జంటా!" అభిరామ్ ఒక సెకను ఆలో చించాడు. ఎవరు గుర్తుకు రాలేదు. ఫోను దగ్గరకు వడిగెత్తుకొచ్చాడు.

"హలో! అభిరామ్‌ని మాట్లాడుతున్నా."

అవలి మాటలు అతనికి ఆశ్చర్యాన్ని కలిగించాయి. ఆనందంతో ఉక్కిరి ఉక్కిరి అయ్యాడు.

అవతలనుంచి ఫోనుపెట్టిన చప్పుడు కాగానే వెంటనే కార్తీకను హాస్పటల్‌కి రమ్మని ఫోను చేశాడు.

హడావిడిగా కేసులు చూడ్డం మొదలుపెట్టాడు. కొన్ని కేసులు అసిస్టెంటుకి అప్పచెప్పాడు.

అంతలో కార్తీక లోపలికి వచ్చింది.

"డాక్టరుగారు వచ్చేవరకు లోపల రూములో కూర్చోమన్నారు" కార్తీక అడక్కుండానే అటెండరు తలుపుతీసి పట్టుకున్నాడు. కార్తీక లోపల కుర్చీలో కూర్చుంది. అతను ఎందుకు కలులుచేసాడో మాత్రం ఊహించుకోలేకపోయింది.

"హలో కీర్తీ!" అభిరామ్ లోపలకి వచ్చి వాష్‌బేసిన్‌లో సబ్బుతో చేతులు కడుక్కున్నాడు. టవల్‌తో తుడుచుకుంటూ వచ్చి కార్తీక ఎదురుగా సోఫాలో కూర్చున్నాడు.

"డాక్టరుగారు!ఆసీట్లో కూర్చోక తీరిగ్గా సోఫాలో కూర్చున్నారేం"

"నీ పక్కన కూర్చుంటే తప్పా" కార్తీక చెయ్యి అందుకుని గట్టిగా నొక్కి వదిలేసాడు.

అటెండరు వచ్చి ఫ్లాస్కులో కాఫీ ఇద్దరికి కప్పుల్లోపోసి అందించాడు

"అర్జంటుగా రమ్మని నెమ్మదిగా కాఫీతాగుతావేం. వెళ్ళిపోనా!"

"ఎలాగా వెళ్ళుదుగాని! ఆడవాళ్ళకి సహన మెక్కువంటారు ఇంతేనా?"

"ఏదేనా సమస్య వచ్చినప్పుడు ఓర్పు అవసరం. కాని అనవసరంగా కాలయాపన చెయ్యడం సహనంకాదు. మా ఆడవాళ్ళకి ఎంత సహనం లేకపోతే నీలాటి భర్తను భరించగలరు?"

"భర్తలను భరించేది భార్యలా? ఇదెక్కడి సిద్ధాంతం. ఇంతకు ముందు వినలేదు?"

"ఇక వింటారు?ఆలస్యంగా ఇంటికి వచ్చినా? మతిమరపు ఉన్నా? ఇంటి సంగతులు పట్టించుకోకపోయినా? పెళ్ళి సంగతె మర్చిపోయినా భర్తను భరించవలసింది భార్యేకదా?"

ఇంతకీ పెళ్ళే కాకుండా భార్య ఎక్కడిది?"

"ఇక్కడిది" కార్తీక మాటలకు నవ్వి అభిరామ్ ఆమె నెత్తిమీద ఒక మొట్టికాయ మొట్టాడు.

ఈ మధ్యలో అభిరామ్ సంతోషంగా ఉండడం కార్తీక చూడలేదు. ఆ మార్పు అంత సడెన్‌గా ఎలా వచ్చిందో మాత్రం ఊహించుకోలేక పోయింది.

"కార్తీ!" నవ్వుతున్న అభిరామ్ ఒక్కసారిగా సీరియస్‌గా మారి పోయాడు. ఏ వార్త చెబుతాడోనని కార్తీక కాస్త భయపడింది. త్వరగా చెప్పమన్నట్లుగా అతనివైపు చూసింది.

"కార్తీ! మద్రాసు నుంచి ఫోను వచ్చింది".

"అలాగా" ఆశ్చర్యంగా అడిగింది కార్తీక.

రేఖ ఫోనులో చెప్పినదంతా కార్తీకతో చెప్పాడు. వెంటె బయలుదేరి మద్రాసు వెళ్ళమని కార్తీక సలహా ఇచ్చింది.

పేషంట్లను జాగ్రత్తగా చూసుకోమని అసిస్టెంట్సుకు అప్పచెప్పి బయలుదేరాడు అభిరామ్. కారులో అతన్ని ఆనుకునేకూర్చుంది కార్తీక. అతనికి కార్తీక కొండంత అండగా అనిపించింది. కార్తీకను కారులో యింటి దగ్గర దింపి యింటికి వెళ్ళాడు అభిరామ్.

"నాన్నగారూ! అర్జంటుగా మద్రాసు వెళ్ళవలసివచ్చింది. ఫ్లైట్‌లో వెడుతున్నానం ?"

"అలాగా? మరి హాస్పటల్లో అర్జంటు కేసులున్నాయన్నావుకదా!"

"అవును నాన్నగారు అసిస్టెంట్సుకి అప్పచెప్పాను. రేపు తిరిగి వచ్చేస్తాను."

"అంత అర్జంటు ఏమిటా?"

"హాస్పటల్ పనేనమ్మా! రేపు వచ్చేస్తాగా?"

రోహిణి చనిపోయిన తరువాత అభిరామ్ తల్లిదండ్రులను ఒంటరిగా వదలి ఎక్కడకీ వెళ్ళలేదు. అతను ఒకరోజు ఉండనంటె ఆ యింట్లో వాళ్ళకి చెప్పలేని భయమేసింది. కామేశ్వరరావు గారి తోబుట్టువు వారిని కనిపెట్టుకుని ఉంటోంది. ఆవిడకు పిల్లలులేరు. వంట మనిషి వంటచేసిపెడి వాళ్ళకు సాయంగా ఉంటోంది. అన్నపూర్ణమ్మ గారు, రేవతి కూడా ఆమెతో చనువుగానే ఉంటారు.

"అత్తా! వీళ్ళను జాగ్రత్తగా చూస్తూ ఉండు!" "ఏ ! జాగ్రత్త"

మరోసారి చెప్పి బయలుదేరాడు అభిరామ్.

విమానం శరవేగంతో వెళుతున్నా అతనికి నెమ్మదిగా వెళు తున్నట్లే ఉంది. కార్తీకదగ్గర ఉన్నంతసేపు ఏదో ఉత్సాహం వచ్చింది. ఆమె వెళ్ళిపోగా, ఏదో దిగులు, నిరుత్సాహం. అంతలో ఫోనులో రేఖ చెప్పిన మాటలు నిజమా? అబద్ధమా? నిజమైతే తన కుటుంబానికి అంత కంటె అదృష్టం మరొకటిలేదు. మద్రాసు ఏర్‌పోర్టులో విమానం ఆగగానే అభిరామ్‌కి ఏదో కంగారు, ఆందోళన బయలుదేరాయి. సామాను బాధ లేదు. చేతిలో బ్రీఫ్ కేసు మాత్రమే ఉంది. వెంట బయటకు వచ్చి టాక్సీతో కూర్చున్నాడు.

* * *

స్వాతి, రాజాల జీవితం సరదాగా సాగిపోతోంది. రాజా తను నవ్వడమే కాదు ఇతరులను నవ్వించగల స్వభావం కలవాడు. ఏసమస్య నైన తేలిగ్గా తీసుకుంటాడు. నిధానంగా ఆలోచిస్తాడు. దాని మూలంగా స్వాతి, ఉత్తర కూడా చాలా సంతోషంగా ఉంటున్నారు. ఉత్తరకు మాత్రం చలపతి గుర్తుకు వస్తూనే ఉన్నాడు.

ఒకరోజు ఉదయమే పాలు పోయించుకోడానికి పొద్దుటే గేటు తియ్యడానికి వచ్చింది ఉత్తర. గేటు బయట ఎవరో ఒక వ్యక్తి పడు కున్నట్లు అనిపించింది. ఇంకా బాగా వెలుగురాలేదు. అయినా రోడ్డుమీద జనం ఎవరి పనులకోసం వాళ్ళు తిరుగుతూనే ఉన్నారు. గేటు తీసి బయటకు వచ్చిన ఉత్తర ఆకారానికి దగ్గరగా వెళ్ళి చూసింది. ఎవరో చిరుగుబట్టలతో ఉన్నాడు. మంచు చనిపోయాడనుకుంది. కాని కాస్త దగ్గరకు వెడితే అతను చలికి వణ్ణిగా వణుకుతున్నట్లు కనిపించింది. ఎందుకో భయంవేసింది. ఒక్క అంగలో వెనక్కువచ్చి బామ్మగారి తలుపుకొట్టింది. ఆవిడ అప్పు లేచి ముఖం కడుక్కుంటోంది.

''ఎవరూ?'' అంటూ వచ్చి తలుపుతీసింది.

''బామ్మగారూ! ఎవరో ముష్టివాడు మనగేటు పక్కన పడిఉన్నాడండీ?''

''అయ్యో! ఖర్మ! చావలేదు కదా?''

''బతికే ఉన్నాడు. చలికి వణుకుతున్నట్లున్నాడు.''

''పొద్దుటే ఇదెక్కడి గోలే తల్లీ! నడు చూద్దాం'' బామ్మగారి వెంట ఉత్తర తిరిగి అక్కడకు వచ్చింది.

ఉత్తర పరకాయించి చూసింది. మాసిన గడ్డంతో, అంటుకుపోయిన దవడలతో బక్కచిక్కిన ఆ మనిషిని చూసి జాలిపడింది

''పోనీ బామ గారూ! పాత దుప్పటిమీద వెయ్యమంటారా?''

ఏ మునిసిపాలిటీ వారికో కబురుచేసి గవర్నమెంటు హాస్పటల్లో పడేయడం మంచిదుత్తరా? వైద్యంచేస్తే బతుకుతామో? లేకపోతే నిష్కారణంగా మనింటి ముందు చస్తాడమ్మా!''

''మీరు చెప్పింది నిజమే బామ్మగారూ! ఈ లోపుగా ఓ పాత దుప్పటి అతని మీద వెయ్యనా?''

"దానికేం కానీయమ్మా! బామ్మగారు రోడ్లు తుడిచే మునిసిపాలిటీ వారికోసం అటు ఇటు చూస్తోంది. ఉత్తర లోపలికివెళ్ళి పాత దుప్పటి పట్టుకువచ్చింది. అతనిమీద వెయ్యాలని దగ్గరగా వెళ్ళింది. అప్పటికే వెలుగువస్తోంది. ముందు చూసినప్పుడు మసగ వెలుగులో ముఖం స్పష్టంగా కనబడలేదు. ఇప్పుడు వెలుగు బాగావచ్చింది. వెలుగు వచ్చేటప్పుడు ఒక సెకనులో మార్పు కనబడుతుంది. ఒక సెకనుకూడా కాలచక్రం ఆగదు.

రెండు చేతులతో దుప్పటి విప్పి పట్టుకుని అతనిమీద వెయ్యబోయిన ఉత్తర ఉలిక్కిపడి అలాగే ఉండిపోయింది.

"బామ్మా!" అంటూ కెవ్వుమంది.

"ఉత్తరా? ఏమయింది! ప్రాణంపోయిందా?"

"కాదు! బామ్మా! కాదు- అతను- అతను-"

"ఎవరూ?" బామ్మ గారు దగ్గరగావచ్చి వంగి అతని ముఖంలోకి చూసింది.

"ఇతను - చలపతికదా? మొహం అలాగే ఉంది."

"అవును బామ్మ గారూ!" ఉత్తర అతని పక్కగా మోకాళ్ళమీద వంగి చూసింది.

"అదే ముఖం బామ్మా!"

"అయ్యో! అయ్యో! ఇదెక్కడి ఖర్మ! ఆ ముసలావిడ అతని వంటిమీద చెయ్యివేసి చూసింది. వళ్ళు కాలిపోతోంది.

"ముందు లోపలికి సాయంపట్టమ్మా!" ఇద్దరు లోపలికి తీసుకు రావడానికి ప్రయత్నం చేసారు. అదేమిటో అర్థంకాక అక్కడ చాలా మంది పోగయ్యారు. వారిలో ఇద్దరు ముందుకువచ్చి అతన్ని మోసుకు వచ్చి హాల్లో మంచంమీద పడుకోపెట్టారు. పక్కింటబ్బాయి డాక్టరు దగ్గరకు పరుగెత్తాడు. ఆ అడావిడికి స్వాతి, రాజు లేచివచ్చారు.

"అక్కా? ఎవరే?" స్వాతి ఆశ్చర్యంగా అడిగి దగ్గరకు వచ్చింది.

"చలపతా! ఎందుకు లోపలకి సుకువచ్చావు? రోడ్డుమీద చావ నీయకపోయావా? ఈ నీచుడిమీదనా దయ? మంచంతో సహా బైటకు గిరవాటు పెకతా?"

"స్వా -! ఏమిటా మాటలు. అక్క మొగుణ్ణి పట్టుకుని అంతంత మాటలనవచ్చా. అతను తప్పులు చెయ్యొచ్చు. కాని ఇప్పుడు అపదలో ఉన్నాడు. అతనికి వైద్యం చేయించడం మనధర ం."

"నో! నో! - నొప్పుకోను. అతను మా అక్కకు భర్తకాడు. మా అక్కపాలిటి రాక్షసుడు. అతను చావవలసిం ? చేసిన మహా పాపాలు అనుభవంచవలసిం ."

"స్వా ! తప్పమ్మా! అలా అనకూడదు. ఎంతైన అతను మీ అక్కకు భర్త. అతను ఒకప్పుడు దుర్మార్గుడు కావచ్చు. కాని ఇప్పుడు అతనిలో పశ్చాత్తాపం రావచ్చు. మనం మానవులం కనుక క్షమించాలమ్మా!

"అతను బతికి మా అక్క అతనితో కాపురం చేస్తుందా?"

"ఎందుకు చెయ్యదు? మీ అక్క మరో పెళ్ళి చేసుకోలేదు? అంటే అతనికోసం ఎదురుచూస్తున్నట్టేకదా? అతను మారి వచ్చినప్పుడు క్షమించడం మన ధర్మం. స్వాతీ! మీ అక్క అలా మోడులా తిరుగుతుంటే నువ్వు కాపురం మా. సావా? సుఖంగా భర్తతో తిరుగుతున్నావు కదా! మోడైన ఆమె జీవితంలో తిరిగి వసంతం వస్తుంటే కాదనటానికి నువ్వెవరు? శిశిరం తరువాత వసంతకాలం రాకతప్పదు. అలాగే జీవితంలో కూడా!"

స్వాతి ఆశ్చర్యపోయింది. బామ్మగారు చెప్పింది నిజం. అక్క భర్త అతను. అతను మారితే కావలసిందేముంది. ద్వేషం అతని గుణం మీదకాని అతనిమీదకాదు. అక్కవైపు చూసింది. ఎంతో ఆందోళనతో భర్తకు సేవచేస్తోంది. గ్లూకోజునీళ్ళు పట్టిస్తోంది.

అంతలో డాక్టరు వచ్చింది. అన్ని పరీక్షలు జాగ్రత్తగా చేసింది. తిండిలేక బక్కచిక్కి అనారోగ్యం వచ్చింది. "వెంట హాస్పటలుకు తీసుకురండి. గ్లూకోజు బాటిల్సు ఎక్కించాలి. ఇప్పటికే ఆలస్యమయింది. వెంట. సుకురండి" డాక్టరు బయలు రింది. రాజా వెళ్ళి ఆటో సుకు వచ్చాడు. అతన్ని అందులో పడుకోబెట్టి హాస్పటల్‌కి తీసుకువెళ్ళారు.

* * *

"నా పేరు అభిరామ్. రేఖాదేవి ఉన్నారా?" బెల్లు కొట్టగానే తలుపు సిన అమ్మాయిని అడిగాడు.

"ఉన్నారు, కూచోండి" ఆమె లోపలికి వెళ్ళిపోయింది.

"అభిరామ్ వచ్చావా?" హాల్లోకి వచ్చిన రేఖాదేవి పలకరించింది.

"నువ్వా రేఖా! ఎవరో అనుకున్నా"

"అవును నేనే" రేఖ లోపలికివెళ్ళి రోహిణిని వెంటపెట్టుకుని వచ్చింది.

"అన్నయ్యా! రోహిణి అతని దగ్గరగా వచ్చి ఆగిపోయింది.

"రోహిణీ! ఎందుకిలా చేశావమ్మా? ఈ అన్నమీద నీకు నమ్మకం లేదా! నువ్వు ఏమైపోయావో తెలియక ఎంత క్షోభ అనుభవించామో నీకు తెలీదమ్మా! నీమీద బెంగతో అమ్మా నాన్నా మంచంపట్టారు. నువ్వు కనపడనప్పుడు, నువ్వు చనిపోయావనుకున్నప్పుడు పడిన బాధ నిజంగా నరకబాధమ్మా! శత్రువులకు కూడా అటువంటి బాధ రాకూడదమ్మా!"

"అన్నయ్యా! ప్రకాంత్ చేసిన మోసం భరించలేక మొదట చచ్చిపోవాలనుకున్నాను. కాని ఎందుకో చావాలనిపించలేదు. వెంటనే రైలు స్టేషన్‌కు వెళ్ళాను. మద్రాసు రైలు సిద్ధంగా ఉంది. రైలు ఎక్కగానే రేఖ సంగతి గుర్తుకువచ్చింది. ఇక్కడకు చేరాను. ఈనాడు ఇక్కడ ప్రసిద్ధి వహించిన క్రిమినలు లాయర్ రేఖ. ఆమెవల్లె తిరిగి జీవితంమీద ఆశ కలిగింది. ఎప్పటికప్పుడు ఆమె మీకు తెలియజేస్తా నంటూ ఉంది కాని నేనే వద్దన్నాను. కాలుజారిన నేను సమాజంలో పతితను. ఎవ్వరూ విలువ యివ్వరు. నాన్నగారు నన్ను యింట్లోకి రానివ్వరు అన్నయ్యా! నన్ను చూసి అమ్మ కుమిలికుమిలి యేడుస్తుంది. అందుకే ఇంటికి రాలేదన్నయ్యా! ఎప్పటికైన నా జీవితం చక్కబడి నేను తిరిగి ఆయింట్లో అడుగుపెడతానన్నయ్యా!"

"అంత మాటనకు రోహిణీ! ఇదంతా నీ తప్పుకాదు. ప్రకాంత్ తప్పు చాలా ఉంది."

"అందుకే అతనిమీద కేసు పెట్టాలనుకుంటున్నాను అభిరామ్

"అన్నయ్యా! నాకెందుకో రావాలనిలేదన్నయ్యా!" రోహిణి వెక్కి వెక్కి యేడ్చింది.

"రోహిణీ! ఏడవకమ్మా! పోనీ నే ముందు వెళ్ళి ఏర్పాట్లన్నీ చూస్తాను. నువ్వు రెండురోజుల తరువాత రేఖాదేవితో బయలుదేరిరా."

"రోహిణీ! ఆ పద్ధతి బాగుంది. మీ అన్నయ్య చెప్పినట్లే చేద్దాం! ఎందుకంటే నువ్వు చనిపోయావన్న వార్త ఊరంతా దావానలంలా వ్యాపించి ఉంది. మీఅన్నగారు వెళ్ళి నువ్వు బతికే ఉన్నావని, ఆఊరు వస్తున్నావని చెప్పగానే ఆవార్త పెనుతుపానులా ఊరంతా వీచి రెండు రోజులకు చల్లబడుతుంది. అప్పుడు నువ్వు అక్కడ అడుగుపెడితే కొందరు ఈసడింపుగా చూస్తారు అంతే".

"అలాగే అన్నయ్యా! నువ్వు చెప్పినట్లుగానే రెండు రోజులుండి బయలుదేరుతాం. నాసంగతి అమ్మా నాన్నలకు చెప్పావా? వాళ్ళేమన్నారు?"

"చెప్పలేదమ్మా! చనిపోయిన నువ్వు తిరిగి బతికివస్తే వారికంతకంటే సంతోషమేముంటుందమ్మా! నీకోసం వాళ్ళు వెయ్యి కళ్ళతో ఎదురుచూస్తూంటారు? నే బయలుదేరుతానమ్మా!"

"భోజనంచేసి వెళ్ళండి! మాయింట్లో భోజనం చెయ్యకూడదా అభిరామ్‌గారూ!"

"దానికేం! అలాగే?" అభిరామ్ స్నానంచేసి వచ్చేటప్పటికి భోజనం వడ్డించి ఉంది. రేఖాదేవి, రోహిణి, అభిరామ్‌తోపాటె భోజనాలు చేసారు. అభిరామ్ మరోసారి చెల్లెలికి, రేఖాదేవికి చెప్పి తిరుగు ట్రైన్‌లో కొండంత సంతోషంతో బయలు రాడు.

* * *

"అప్పుడే వచ్చేసావా?" త.. పలకరింపుకు అభిరామ్‌కు సంతోషం

ఆగలేదు.

"రోహిణి బతికే ఉందమ్మా!" తల్లి రెండు భుజాలు కుదుపుతూ చెప్పాడు.

"నా రోహిణి! బతికే ఉందా?" ఆవిడ నిలబడ-క వాలిపోతుంటే అభిరామ్, రేవతి పట్టుకుని కుర్చీలో కూర్చో పెట్టారు.

"నిజమా! ఎక్కడుందిరా?" కామేశ్వరరావుగారు ఆనందం పట్టలేక అడిగారు.

"అవును నాన్నగారూ!" అంటూ జరిగిందంతా చెప్పాడు. వాళ్ళు ఎల్లుండి బయలుదేరి వస్తున్నారని కూడా చెప్పాడు.

"ఫోను దగ్గరకు వెళ్ళి కార్తీకకు జరిగిన విషయంచెప్పి వాళ్ళింటికి బయలుదేరి వెళ్ళాడు.

శ్యామసుందరీదేవి అభిరామ్ చెప్పేదంతా ఆశ్చర్యంగా వింది.

"ఇదంతా ఆ తల్లిదండ్రుల అదృష్టం నాయనా? శ్రీకాంత్ కూడా మామూలు మనిషి అయితే అంతకంటే కావలసిందేముంది బాబూ!"

"హాస్పటల్ కి వెళ్ళాలాంటి! ఎందరో ఎదురుచూస్తూ వుంటారు." అభిరామ్ వెంట వీధి గుమ్మంవరకు నడిచింది కార్తీక. ఇద్దరు ఒకరి కొకరు తగులుతూనే నడుస్తున్నారు. వీరిద్దరు దంపతులైతే ఎంత బాగుంటుందో? ఆరోజు త్వరలో వస్తే బాగుండుననుకుంది శ్యామసుందరీదేవి.

"కార్తీ! నువ్వు కాలేజీకి వెళ్ళవా?" కారుడోరు తెరుస్తూ అడిగాడు అభిరామ్. ఆమెను వదలి వెళ్ళాలనిలేదు. ఆ వంకతోనైనా కాసేపు దగ్గర ఉంటుందని అతని ఆశ.

"వెళ్ళాలి. వస్తానుండు"

"అమ్మా! కాలేజీకి టైం అవుతోంది. అభిరామ్ దిగబెడతానంటున్నాడు"

"అలాగే వెళ్ళు కార్తీ!" శ్యామసుందరికిదేని ముసిముసి నవ్వులు నవ్వింది.

కార్తీక వెంట పుస్తకాలు తీసుకుని కారు ఎక్కింది.

"త్వరగా వచ్చెయ్యి కార్తీ!" తల్లి మాటలకు తలూపింది కార్తీక.

కార్తీక రోజూ కాలేజీకి వెళ్ళివస్తోంది. పరీక్షలు దగ్గరకు వస్తున్నాయని శ్రద్ధగా చదవడం మొదలుపెట్టింది.

* * *

హాస్పటల్లో చలపతి బాగానే కోల్కున్నారు. ఉత్తర సేవతో అతనికి విపరీతమైన పశ్చాత్తాపం బయలుదేరింది.

"ఉత్తరా! నన్ను క్షమించానను. ఈ నీచుడు నీ భర్త అంటే నీకు సిగ్గు వెయ్యడంలేదా?" ఆమె రెండు చేతులు పట్టుకుని పదే పదే అడుగుతున్నాడు.

"క్షమించడానికేముంది. మీతప్పు మీరు తెలుసుకున్నారు కదా! నా జీవితానికి అం చాలు. ఇంక నాకేమి అక్కరలేదండి!"

"అలాకాదు! ఉత్తరా! ముందు క్షమించానను"

"క్షమించకపోతే నీకోసం నిద్రాహారాలుమాని ఎందుకు సేవ స్తుంది బావా? క్షమించమని మాఅక్కయ్యను వేధిస్తున్నావా?" అప్పుక్కడకు వచ్చిన స్వాతి మాటలకు కాస్త భయపడ్డాడు చలపతి.

"అదేంలేదు స్వాతీ! నాతప్పు నేతెలుసుకున్నాను కదా! అందుకే క్షమించమని అడిగాను అం ."

"అలాగ! ఎన్నిసార్లు అడుగుతావు? మరోసారి అడిగి మాత్రం నేనూరుకోను.

"ఇంక అడగనులే స్వాతి"

"ఇలాటివాళ్ళకు స్వాతిలాంటి వాళ్ళే తగును. నాలాటి నెమ్మదస్తులు లాభంలేదనుకుంటాను" మనస్సులో అనుకుంది ఉత్తర.

ఆరోజు రోహిణీ, ఖాదేవి వచ్చేరోజు. అభిరామ్ కారు తీసుకుని స్టేషనుకి బయలుదేరాడు. అతనివెంట రేవతికూడా బయలుదేరింది. ఎప్పుడు హడావిడిగా ఉంటూ ఆడంబరంగా డ్రెస్సు చేసుకునే రోహిణి సింపుల్ డస్సులో నెమ్మదిగా రైలు దిగుతుంటే చూసిన అభిరామ్ రేవతికూడా ఆశ్చర్యపోయారు.

కష్టాలు మనిషిని మార్చేస్తాయి. ధనం మనిషిని రెచ్చగొడుతుంది అంటారు. ఇదేనేమో?" అభిరామ్ మనసులోనే అనుకున్నాడు.

"రేవతీ! అంటూ చెల్లెలిని చూడగానే వాటేసుకుని వెక్కివెక్కి యేడ్చింది రోహిణి. రేవతికి కూడా దుఃఖం ఆగలేదు. వర్షం కురిసిన తరువాత ఆకాశం ప్రశాంతమైనట్లుగా దుఃఖం పెల్లుబికి బయటకు వచ్చిన తరువాత ఇద్దరి మనస్సులు ప్రశాంతమయ్యాయి. అందరు కలిసి యింటికి బయలుదేరారు. తండ్రిని చూడగానే కాస్త భయపడిన రోహిణి తల్లిని కౌగలించుకుని వెక్కివెక్కి యేడ్చింది.

"రోహిణీ! ఊరుకోమ్మా!" తల్లి, మేనత్త ఓదార్పుడంతో తిరిగి మామూల మనిషి అయింది రోహిణి.

"నన్ను క్షమించండి నాన్నగారూ!" తండ్రికి దగ్గరగా వెళ్ళి అడిగింది.

"క్షమించడానికేముందమ్మా! ఏదైన సమస్యవస్తే ఇంట్లో వాళ్ళతో చెప్పి పరిష్కరించుకోడానికి ప్రయత్నంచాలి కాని పారిపోడం తప్పమ్మా! ఎప్పుడు తిని బయలుదేరారో వెళ్ళి స్నానాలుచేసి భోజనాలు చేయండి."

తండ్రి అలా మాట్లాడిన తరువాత రోహిణి మనస్సు కుదుటపడింది. రేవతి అందరికి కాఫీ కప్పులు అందించింది.

వీలయినప్పుడు కార్తిక, శ్యామసుందరీదేవి హాస్పటల్ కి వెళ్ళి శ్రీకాంత్ ను చూసివస్తున్నాడు. ఆరోజు కూడా వెళ్ళారు.

* * *

"అమ్మా! శ్రీకాంత్‌తో అన్ని విషయాలు చెప్పటం మంచిదమ్మా! అతనికి పూర్తిగా అర్థంకాకపోవచ్చు. కాని కొంతైన అర్థం కావచ్చమ్మా."

"నిజమే కార్తీ! అలాగే చెప్పిచూద్దాం!"

కార్తీకా, తల్లి అతనికి దగ్గరగా వెళ్ళారు. శ్రీకాంత్ ఎటో చూస్తూ మంచంమీద పడుకుని ఉన్నాడు.

బత్తాయిపండు వొలిచి రోజులాగే అతని చేతిలో పెట్టింది శ్యామసుందరీ వి. శ్రీకాంత్ పక్కకు పెట్టేసి లేచి కూర్చున్నాడు.

"పండు తిను శ్రీకాంత్! రోహిణి బతి వుంది శ్రీకాంత్. ఆమె చనిపోలేదు. నిన్ను చూడ్డానికి ఇక్కడకు వస్తోంది." శ్యామసుందరీ వి నిదానంగా చెప్పింది. శ్రీకాంత్ తలతిప్పి ఆవిడ మొహంకేసి ఒక్కసారి చూసాడు. తిరిగి తల పక్కకు తిప్పుకున్నాడు

"పండు తిను శ్రీకాంత్. తిను." శాంమసుందరీదేవి శ్రీకాంత్ పెట్టిన బత్తాయి తొనలు అతనిచేతిలో పెట్టింది.

అతను మనసులో ఏమనుకుంటున్నాడో ఎవరి తె దు. ఆమె చెప్పింది అర్థమయిందోలేదో కూడా తె దు. బత్తాయిపండు తొనలు తినడం మొదలుపెట్టాడు. ఆవిడ ప్లాస్కులోని హార్లిక్స్ ·సి గ్లాసులో పోసి అతనికి అందించబోయింది. అతను ఇష్టంలేనట్లుగా పక్కకు తిరిగి పడుకున్నాడు.

"నిన్నటికంటే నయమే. పండైనా తిన్నాడు." అనుకున్నారు ఆ తల్లీకూతుళ్ళు.

"అమా : మీ అబ్బాయా! పాపం మతిస్థిమితం తప్పినట్లుంది?" అక్కడున్న ఆయా అడిగింది.

శ్యామసుందరీదేవి అవును, కాదు అని నోటితో చెప్పకుండా తలూపింది. ఆయా ఏమనుకుందో తిరిగి ప్రశ్నించలేదు.

శ్యామసుందరీ వి, కార్తీక బయటకు వచ్చేటప్పటికి రోహిణి, రేఖాదేవి, అభిరామ్ ఎదురువచ్చారు.

"ఆంటీ! శ్రీకాంత్ ఎలా ఉన్నాడు?"

"ఈరోజు ప్రశాంతంగా పడుకుని ఉన్నాడు. అంకేదు రోహిణి వచ్చిందని చెప్పాను. ఏమనుకున్నాడో తలెత్తి నావైపు చూసి మళ్ళ చూపులు మరల్చుకున్నాడు. ఏదైన రోహిణి వచ్చిందికదా! అతనిలో మార్పు రావచ్చయ్యా!"

"ఈవిడ రేఖాదేవి ఆంటీ." అభిరామ్ రేఖను పరిచయం చేసాడు.

"రోహిణీ బాగున్నావా?"

"బాగున్నానాంటీ!" రోహిణి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. దుఃఖం ఆపుకుని కళ్ళు తుడుచుకుంది.

శ్యామసుందరీ వి, కార్తీక యింటికి తిరిగి వచ్చేసారు.

"హలో శ్రీకాంత్." రోహిణి వంటరిగా వెళ్ళి పడుకున్న అతని రెండు చేతులు పట్టుకుంది.

శ్రీకాంత్ చేతులు విడిపించుకోడానికి ప్రయత్నించకుండానే తలెత్తి ఆమెవైపు చూసాడు. అలా చూసిచూసి నవ్వడం మొదలు పెట్టాడు. ఆ నవ్వు ఆపలేదు. రోహిణి భయపడి దూరం జరిగింది. డాక్టర్లు ఒక్క పరుగుతో అతని దగ్గరకు వచ్చారు.

"శ్రీకాంత్! శ్రీకాంత్!" డాక్టరు చెయ్యిపట్టుకు కుదిపాడు.

కొంచెం సేపటికి శ్రీకాంత్ నవ్వు ఆపి మామూలు స్థితికి వచ్చాడు. "ఏం జరిగింది శ్రీకాంత్!" అటు ఇటు చూస్తున్న శ్రీకాంత్‌ని అడిగాడు. శ్రీకాంత్ సమాధానం అవ్వకుండానే పక్కకు తిరిగి పడుకున్నాడు. డాక్టర్ రోహిణిని దగ్గరకు పిలిచి వివరాలన్నీ అడిగాడు.

అభిరామ్, రోహిణి కలిసి జరిగినదంతా డాక్టర్‌కి తెలియ చేశారు వాళ్ళు చెప్పేదంతా జాగ్రత్తగా విన్నాడు డాక్టర్. "అమ్మా! రోహిణీ! నువ్వొకసారి శ్రీకాంత్‌ను పలకరించు. నేను దగ్గరలోనే ఉంటాను. నీకేం భయంలేదు. ఇక్కడకు వచ్చింది మొదలు శ్రీకాంత్ ఉలుకు పలుకు ఏమీ లేదు. నిన్ను చూసిన తరువాత అతనిలో చలనం వచ్చినట్లు కనబడుతోంది. ఇది సుగుణమే! భయపడకు. వెళ్ళి పలకరించు."

డాక్టర్ మాటలతో కాస్త ధైర్యంవచ్చిన రోహిణి తిరిగి అతనికి దగ్గరగా వెళ్ళింది. అతని చెయ్యి పట్టుకుని "హలో! శ్రీకాంత్" అంది. శ్రీకాంత్ ఆమెవైపు తీక్షణంగా చూశాడు. వెంటనే లేచి కూచున్నాడు.

"రోహిణీ! నువ్వెందుకొచ్చావిక్కడికి? నే వస్తానని చెప్పానుగా! ముందిక్కడనుంచి వెళ్ళిపో!"

"అలాగే వెళ్ళిపోతాను శ్రీకాంత్! కాని కాసేపు నీ దగ్గర కూర్చుని వెళ్ళనా!"

"నో! నో! నువ్వు వెంటనే యింటికి వెళ్ళిపో! చీకటి పడుతోంది, మీయింటికి వస్తాను."

"పోనీలే! నేవెళ్ళిపోతాను. పోనీ రేపురానా!"

"రేపటి సంగతి చూద్దాంలే! ముందిక్కడనుంచి వెళ్ళిపో!"

డాక్టరు సంజ్ఞచేసి "వెళ్ళిపోతున్నానని" చెప్పమన్నాడు.

సరే నేవెడుతున్నా శ్రీకాంత్! రేపు వస్తాలే! టా! టా!" తిరిగి అతను మంచంమీద పడుకుని కళ్ళు మూసుకున్నాడు. రోహిణి దుప్పటి సరిచేసి తిరిగి డాక్టరు రూములోకి వచ్చింది. రేఖాదేవి కూడా అక్కడ కూర్చుని ఉంది.

డాక్టరుగారూ! శ్రీకాంత్ మామూలు మనిషి అవుతాడంటారా?"

"తప్పకుండా! పూర్వపు జ్ఞాపకాలే అతనిలో ఉన్నాయి. తరువాతి సంఘటనలు మరచిపోయాడు. అతను మామూలు మనిషి

అవడానికి కొంచెం సమయం పడుతుంది. అంతే."

"నన్ను రోజూ రమ్మంటారా?" రోహిణి అడిగింది.

"అవునమ్మా! మీరు ఒంటరిగా మాత్రం రాకండి. ఎవరినైన వెంట పెట్టుకుని రండి. రోజూ అతన్ని వచ్చి పలకరించండి. కాసేపు దగ్గర కూర్చోండి మార్పు తప్పకుండా కనబడుతుంది."

అభిరామ్, రోహిణి, రేఖాదేవి అతని దగ్గర శలవు తీసుకుని యింటికి బయలుదేరారు.

గుమ్మంలో ఎదురువచ్చిన తల్లికి అభిరామ్ అన్ని విషయాలు చెప్పాడు. ఆ తల్లిదండ్రుల సంతోషానికి అంతులేదు

తన పనేమీలేవని రేఖాదేవి తిరిగి మద్రాసు పయాణమై వెళ్ళిపోయింది. రోజులు నెమదిగా గడుస్తున్నాయి. రోహిణి రోజూ హాస్పిటల్కి వెళ్ళివస్తోంది. ఆమె చెప్పేదంతా వింటున్నాడు. కాని సమాధానం యివ్వడంలేదు. అతన్ని వీల్ఛైర్లో కూర్చోపెట్టి చల్లగాలిలో తిప్పుతోంది. ఆతను అడ్డుచెప్పడం లేదు. అతనికి మామూలు మన స్థితి వస్తోందని డాక్టర్లు గ్రహించారు. డాక్టర్లు చెప్పినట్లుగా రోహిణి శ్రీకాంత్ని మామూలుస్థితికి తీసుకురావడానికి ప్రయత్నం చేస్తోంది. ఆమెలోని సహనం, నిధానం చూస్తే రోహిణేనని ఎవరు అనుకోరు. రోజులు గడుస్తున్నకొద్ది ఆమె కడుపుభారం పెరుగుతోంది. ఆమె గర్భవతని అందరికి తెలిసిపోయింది.

"ఆదేమిటమ్మా! రోహిణికి, శ్రీకాంత్కి పెళ్ళికాలేదు కదమ్మా! మరి రోహిణి...." పక్కింటావిడ మాటలను రేవతి మధ్యలోనే ఆపివేసింది.

"ఆదేమిటి పిన్నిగారూ! మా రోహిణికి, శ్రీకాంత్కి రిజిస్టర్ మారేజి అయిందని మీతో ఆవేళే చెప్పానుగా! మర్చిపోయారా? పైగా లడ్డూ కూడా ఇచ్చాకదం! ఆరోజు మీరు లడ్డు ఇక్క మర్చిపోయి

వెళ్ళారుగా! శ్రీమంతానికి మళ్ళీ పిలుస్తారులెండి" వతి మాటలకు పక్కింటావిడ సమాధానం చెప్పలేక అక్కడనుంచి లేచివెళ్ళిపోయింది.

రేవతి మాటలు అర్థంకాని అన్నపూర్ణమ గారు తెల్లబోయి చూసింది.

"అవునమ్మా! అలాగే చెప్పాలి. కాకుల వంటి లోకులు మాటలతో పొడుస్తుంటే భరిస్తూ ఊరుకోవాలా? ఆమాటలు తిరిగి వాళ్ళనే కొట్టాలి. తెలిసిందా అమ్మా!"

"ఎంతటి ఆరిందావయ్యావే నాతల్లీ!" అన్నపూర్ణమ్మగారు కూతుర్ని దీవించింది.

* * *

శ్యామసుందరీదేవి కాస్త అనారోగ్యంగా ఉంటోంది. రాత్రివేళ సరిగా నిద్రపట్టడంలేదు. నీరసంగా ఉంటోంది. డాక్టరు వచ్చి పరీక్షచేసి ఏమీలేదని కాస్త విశ్రాంతిగా ఉండమని చెప్పాడు.

కార్తీకకు పరీక్షలు ప్రారంభమయ్యాయి. నిద్రాహారాలు లేకుండా మవుతోంది అయినా తల్లిని ఓకంట కనిపెట్టిచూస్తోంది. రోహిణి ళ్ళిన తర్వాత ఆవిడ శ్రీకాంత్ దగ్గరకు ఎక్కువ వెళ్ళడంలేదు. పైగా పిక కూడా లేదు.

ఆరోజు బామ్మ గారు చూడాలని వచ్చింది.

"అదేమిటి సుందరమ్మా! అలా అయిపోయా విటి? మందులు వేసుకుంటున్నావా?" శ్యామసుందరీదేవిని చూడగా కంగారుగా అడిగింది.

"అన్నిరకాల మందులు మింగుతున్నా బామ్మగారూ?"

"ఏమిటో మాకాలం మనుషులే నయమమ్మా! చూడు ఉక్కు గుండులా ఉన్నానా? మాపక్కింటి కాంతమ్మ కూడా నాయాడుదేగా! వళ్ళంనిండా జంతికలు పెడితే అయిదు నిమిషాల్లో కరకర నమిలిమింగి

ఆరాయించుకుంటుంది. మీతరం వాళ్ళు మాకంటె ముసలివాళ్ళలా కన బడుతున్నారు అదిసరే కాని అమాయి పెళ్ళిచేసేస్తే బాగుంటుందికదా! నీకు ఈమాత్రం ఓపిక ఉండగానే ఆ మూడుముళ్ళు వేయిం- సెయ్యి సుందరమ్మా!"

"నేనూ అదే అనుకుంటున్నా పిన్నిగారూ! పిల్లకి పరీక్షలుకాగానే ముహూర్తాలు పెట్టిస్తే బాగుంటుందని"

"ఆ రోహిణి అన్నగారు అభిరామ్‌తోనే కదా!"

"అవును బామ్మగారూ"

"ఇద్దరు చిలకాగోరింకల్లా ఉంటారు సుందరమ్మా! ఈడుజోడు చక్కగా కుదిరింది. పైగా పిల్లాడు చాలా బుద్ధిమంతుడు!"

"అవును పిన్నీ! నువ్వే వాళ్ళింటికి వెళ్ళి వాళ్ళవాళ్ళతో మాట్లాడి రావాలి?"

"దానికేం సుందరమ్మా! ఇప్పుడే వెళతాను. ఆ ఉత్తరస్కూలు నుంచి వచ్చాక ఆపిల్లను కూడా తీసుకువెళతాను.

"మీరే దగ్గరుండి ఆ మూడుముళ్ళు వేయించాలి పిన్నీ!"

"దానిదేముందమ్మా! మనం నిమిత్తమాత్రులం. ప్రయత్నం మనది. దేనికీ ప్రయత్న లోపముండకూడదు సుందరమ్మా!"

బామ్మగారు బయలుదేరి యింటికి వెళ్ళిపోయింది. కార్తిక అన్నీ వింటూ ఉంది. ఆ యువతి మనస్సు సంతోషంతో ఉప్పొంగి ఉరకలేసింది ఆటంకాలు దాటుకుని తన కోరిక ఫలించబోతోంది. ఏవో మధురస్మృతులు ఆమె హృదయవీణను మీటి పులకింపచేసాయి.

* * *

"రా! ఉత్తరా! రండి బామ్మగారూ!" రేవతి గుమ్మంలో ఎదురు

వచ్చింది.

"ఏమ్మా! రేవతీ బాగున్నావా?"

"ఆ బాగున్నానండీ ఉత్తరను, బామ్మగారిని రేవతి తల్లి దగ్గరకు తీసుకువెళ్ళింది. అందరు కుశలప్రశ్నలు వేసుకుని సమాధానాలు చెప్పు కున్నారు. ఉత్తర బామ్మగారిని మెల్లిగా పెళ్ళి విషయం ఎత్తమని చెప్పింది.

"అన్నపూర్ణమ్మా! సుందరమ్మ వంటరిదై పోయింది. అభిరామ్‌తో కార్తీక వివాహం జరిపించాలని ఆమె తాపత్రయం! మీరందరు ఆలో చించుకు చెప్పండి. ముహూర్తాలు పెట్టిస్తాము".

"బామ్మగారూ! చాలా మంచిమాట చెప్పారు. మేమే ఆ విషయం కబురు చెయ్యాలనుకుంటున్నాము. వాళ్ళిద్దరి పెళ్ళి జరిపించాలని రోహిణి కూడా పట్టుబడుతోంది? అయినా అబ్బాయితో వారితో మాట్లాడి ముహూ ర్తాలు పెట్టిద్దాం!"

"అలాగే అన్నపూర్ణమ్మ! మరి మేము వస్తాము" బామ్మగారు ఉత్తర ఎక్కువసేపు కూర్చోకుండానే బయలుదేరారు.

* * *

అభిరామ్, కార్తీక కూడా పెళ్ళి సింపుల్‌గా చేయమని పట్టు పట్టారు. వాళ్ళకోరిక ప్రకారం పెళ్ళికి దగ్గర బంధువులని తప్ప ఎవరిని పిలవలేదు. సాయంత్రం పార్టీకి అందరిని పిలిచారు. ముఖ్యమైన స్నేహి తులు, బంధువులు అందరు వచ్చారు.

"అమ్మా! రోహిణేదమ్మా! రోహిణి కనపడకపోయేటప్పటికి అభిరామ్ ఎదురుగా ఉన్న తల్లిని అడిగాడు.

"ఇప్పటివరకు ఇక్కడే ఉంది. ఫ్రెండ్స్ ఎవరో వచ్చినట్లు

న్నారు" ఆవిడ సమాధానమిచ్చింది. అంతలో ఎవరో రావడంతో అటు పక్కకు వెళ్ళింది. ఆరోజు అందరు ఎంతో సంతోషంగా ఉన్నారు. అనుకోని సంఘటన జరిగి తిరిగి సర్దుకోడం ఎప్పుడో కాని ఎప్పుడో కాని సంభవించదు. చనిపోయిందనుకున్న రోహిణి బ్రతికివచ్చింది. మతి పోయి పిచ్చివాడైపోయాడనుకున్న శ్రీకాంత్ తిరిగి కోలుకుంటున్నాడు. ఆ తల్లితండ్రుల సంతోషానికి అంతులేదు. ఆ సంతోషం అందరికి పంచాలనేదే వారి కోరిక. అందుకే కొడుకు పెళ్ళిని వెంటనే జరిపించ డానికి ఏర్పాటు చేసారు.

ఎప్పుడూ సింపుల్‌గా ఉండే కార్తీక ఆరోజు పెళ్ళికూతురి వేషంలో దిష్టి తగిలేటట్టు ఉంది. అభిరామ్ చూపులన్నీ ఆమె మీదే ఉన్నాయి.

"కార్తీ! నువ్వింత అందంగా ఉంటావని ఇప్పుడే తెలిసింది!"

"మరి యిన్నాళ్ళు తెలిసిందేమిటో"

"ఇంతకంటే అందమైనదని మనస్సు"

ఎవరో అటు రావడంతో వారి సంభాషణ ఆగిపోయింది. అంతలో శ్రీకాంత్ చెయ్యి పట్టుకుని రోహిణి లోపలికి రావడం అంతా ఒకేసారి చూసారు. శ్రీకాంత్ నీటుగా డ్రస్ చేసుకుని ఉన్నాడు. నెలలు నిండిన రోహిణి పట్టుచీరలో తళతళలాడుతోంది.

ముందు రోహిణి అతన్ని తల్లితండ్రులకు పరిచయం చేసింది తరువాత కార్తీక, అభిరామ్ దగ్గరకు తీసుకువెళ్ళింది. శ్రీకాంత్ మామూలుగానే కనబడుతున్నాడు. కాని 'హలో' అనడం తప్ప మరో మాటలేదు. అభిరామ్ చేయి చాసి 'హలో' అనగా అతనికి చేయి అందించాడు. తరువాత రోహిణితోపాటు అతను కూడా వెళ్ళి కుర్చీలో ఆమె పక్కనే కూర్చున్నాడు. అన్నపూర్ణమ్మ, కామేశ్వరరావుగార్ల సంతోషానికి అంతులేదు అందరు మాత్రం చాలా ఆశ్చర్యంగా చూస్తున్నారు.

ఆ హోటల్ హాల్లో పెద్ద దికకట్టారు. అందులో రాజసింహాసనం లాంటి రెండు కుర్చీలువేసారు. అభిరామ్, కార్తీకలు ఆకుర్చీల్లో కూర్చుని ఉన్నారు. ఏవరేనా వచ్చినప్పుడు లేచి నిలబడుతున్నారు.

కార్తీక రోహిణిని దగ్గరకు రమ్మని పిలిచింది. రోహిణి శ్రీకాంత్ యి పట్టుకుని ఆ కొత్త దంపతుల దగ్గరకు వెళ్ళింది.

"రోహిణి ఈదండ శ్రీకాంత్ మెళ్ళో వెయ్యి" పక్కనే ఉన్న పూలబుట్టలోనుంచి ఒక పూలదండతీసి కార్తీక రోహిణికి అందించింది.

అభిరామ్ ఉలిక్కిపడి చూసారు. మిగిలిన వాళ్ళ చూపులన్నీ అటే ఉన్నాయి. హాల్లో ఒక్కసారి నిశ్శబ్దం.

"రోహిణి శ్రీకాంత్ మెడలో వెయ్యి" అలాగె నిలబడిన రోహిణికి మరోసారి చెప్పింది. కార్తీక.

రోహిణి శ్రీకాంత్ మెడలో దండ వేసింది. మరో దండ తీసిన కార్తీక రోహిణికి అందించి అతని చేతిలో పెట్టమంది.

రోహిణి ఆమె చెప్పినట్టే చేసింది.

శ్రీకాంత్ దండ అందుకుని రోహిణి మెడలో వేసాడు. హాలంతా చప్పట్లతో నిండిపోయింది. రోహిణి శరీరం గగుర్పొడిచింది. ఆమె మనస్సు సంతోషంతో తేలియాడింది. శ్రీకాంత్ అలా చేస్తాడని ఎవ్వరూ ఊహించలేకపోయింది. రోహిణి జీవితం చక్కబడిందనుకున్నారు అందరూ. అంత సంతోషంలోను రోహిణి లోలోపల చాలా భయపడింది. పిచ్చిలో ఉండి అతను తనను ప్రేమగా చూస్తున్నాడని తిరిగి మామూలు మనిషి అయితే ఏమవుతాడోనని ఆమె భయం. ఏదైన రోహిణి అందరిలో తన పరువు నిలబడిందని సంతోషించింది. అన్నపూర్ణమ్మగారు, కామేశ్వరరావుగారలతోపాటు అందరు కార్తీక చేసినపనిని అభినందించారు.

శ్రీకాంత్‌ని పార్టీకి తీసుకురావడానికి రోహిణి హాస్పిటల్ అధికారుల పరిమిషన్ తీసుకుంది. తిరిగి అతన్ని హాస్పటల్‌కి తీసుకువెళ్ళారు. శ్రీకాంత్ నవ్వుతూ వాన్ ఎక్కాడు రోహిణి చేయి ఊపగా అతను

కూడా తిరిగి చేయి ఊపాడు.

అక్కడే కూర్చున్న కార్తీక తల్లి మాత్రం అతన్ని పలకరించ డానికి భయపడింది. "సర్వయ్య కొడుకువని చెప్పింది ఆమె కనక ఆమె పలకరించగా, అది జ్ఞాపకం రావచ్చని భయపడింది. డాక్టర్లు కూడా అలా జరగడానికి అవకాశం ఉందన్నారు. అందు ఆమె అతనికి కన పడలేదు. పార్టీ పూర్తికాగానే అందరు సంతోషంగా ఇళ్ళకు వెళ్ళారు.

* * *

ఆరాత్రి రోహిణికి పురిటినొప్పులు ప్రారంభమయ్యాయి. వెంటనే హాస్పటల్‌కి తీసుకు వెళ్ళారు. నొప్పులు విపరీతంగా వస్తున్నాయి కాని పురుడు రాలేదు. అవసరమై ఆపరేషన్ చేయాలంది లేడి డాక్టరు. అన్నపూర్ణమ్మగారి ఆందోళనకి అంతులేదు. ఆమెను పట్టుకోడమే కష్టమై పోయింది. కార్తీక కొత్త పెళ్ళికూతురు. పైగా మొదటిరాత్రి అది. అన్నపూర్ణమ గారు వద్దంటున్నా ఆమె హాస్పటల్‌కి వచ్చింది. పైగా రోహిణి దగ్గర కార్తీ ఉంది.

"ఇన్నాళ్ళు ఆమె అందం చూసాను. మాటలు విన్నాను. ఇప్పుడు అసలు కార్తీకను చూస్తున్నాను" అనుకున్నాడు అభిరామ్.

ఆపరేషన్‌కి అంతా సిద్ధంచేసారు. కాని అంతలో నెప్పులు ఎక్కువై పండంటి పిల్లాడు పుట్టాడు. పిల్లాడి రోదనతో హాస్పటల్ మారుమోగింది. ఆఇంటి వాళ్ళంతా అక్కడకే చేరుకున్నారు. వారి సందడితో ఆ హాస్పటల్ కలకలలాడింది.

అభిరామ్, కార్తీక, రేవతి శ్రీకాంత్‌ను చూడ్డానికి హాస్పిటల్‌కి వెళ్ళారు.

"రోహిణి ఎలా వుంది?" శ్రీకాంత్ ప్రశ్నకు అందరు ఆశ్చర్య పోయారు.

"బాగానే ఉంది శ్రీకాంత్. చక్కటి కొడుకు పుట్టాడు. ముద్దుగా రబ్బరు బొమ్మలా వున్నాడు." కార్తీకే అతనికి దగ్గరగా వెళ్ళి సమాధానమిచ్చింది.

శ్రీకాంత్ ముఖం వికసించింది. చిరునవ్వుతో పెదాలు విప్పుకున్నాయి.

"చూడ్డానికి వస్తావా? శ్రీకాంత్!" కార్తీకే తిరిగి అడిగింది.

పక్కకు తిరిగి పడుకున్నాడు శ్రీకాంత్. కార్తీకకు సమాధానం చెప్పలేదు.

"బావా! వీల్ ఛైర్‌లో అలా తిప్పుతాను వస్తావా?"

"బావా! అని వినబడగానే ఛివ్‌న తలెత్తి చూశాడు శ్రీకాంత్. తిరిగి పక్కకుతిరిగి పడుకున్నాడు.

రోహిణి తప్ప మరెవ్వరు అతనికి జ్ఞాపకంలేరేమో ననిపించింది వారికి. డాక్టర్లకి కూడా ఆ అనుమానం వచ్చింది. అవసరమై శ్రీకాంత్‌కు రోహిణిని, బాబుని చూపించాలని నిర్ణయించారు.

తర్వాత ముగ్గురు యింటికి తిరిగి వచ్చేసారు.

* * *

కార్తీక వివాహమైన తరువాత శ్యామసుందరీదేవి మరింత నీరసంగా ఉంటోంది. పెళ్ళి అలసట మూలంగా అనుకున్నారు అంతా. కార్తీక అత్తిల్లు పుట్టిల్లు అనే భేదం లేకుండా తిరుగుతోంది. డాక్టర్ వచ్చి చూసి వెడుతున్నాడు. కాస్త విశ్రాంతి అవసరమన్నాడు అంతే.

ఒకరోజు ఆవిడకు గుండెలో నొప్పిలా వచ్చింది. వెంట హాస్పిటల్‌లోకి సుకువెళ్ళింది కార్తీక. హార్ట్ ఎటాక్ అన్నారు డాక్టర్లు. ఆరాత్రి గడవడమే కష్టమన్నారు. అభిరామ్ కార్తీక అలా కూర్చొనివున్నారు. కార్తీక శోకదేవతలా ఉంది.

అన్నపూర్ణమ్మగారు, కామేశ్వరరావుగారు హాస్పటల్‌కి వచ్చి చూసి వెళ్ళారు. రోహిణి యింకా హాస్పటల్‌నుంచి రానేలేదు. ఒకపక్క వాళ్ళింట్లో చాలా యిబ్బందిగా ఉంది. మరోపక్క శ్రీకాంత్ హాస్పటల్లో ఉన్నాడు. ఆ సమయంలో ఈవిడకు ఎటాక్ రావడం మరీ బాధగా అనిపించింది. ఎవరు ఎవరి దగ్గర ఉండాలో తెలియని పరిస్థితి ఏర్పడింది. రాజా, స్వాతి, ఉత్తర, బామ్మగారు హాస్పటల్‌కి వచ్చారు. అదే హాస్పటల్లో ఉన్నాడు చలపతి. రాజా, స్వాతి యింటికి వెళ్ళారు. ఉత్తర చలపతి దగ్గరకు వెళ్ళింది. వాళ్ళని కనిపెట్టుకుని కూర్చుంది బామ్మగారు. చీకటి రాత్రి బరువుగా గడుస్తోంది. తెల్లవారవస్తోంది. గడియారం అయిదు చూపింది.

"అమ్మయ్య - తెల్లవారుతోంది!" అనుకుంది కార్తీక.

అంతలో శ్యామసుందరీదేవికి బాధ ఎక్కువయింది. ఊపిరి అందడమే కష్టమైంది. ఆక్సిజన్ ఎక్కడమే లేదు. ఊపిరి పీల్చుకోలేక ఆవిడ ఉక్కిరి బిక్కిరవుతోంది. అభిరామ్ లోపలకి వెళ్ళి పరిస్థితి చూసాడు.

డాక్టర్లు వాళ్ళకు తెలిసిన శాస్త్రజ్ఞానమంతా ఉపయోగించి ప్రయత్నం చేస్తున్నారు. ప్రాణ వాయువును బంధించాలని, పోయే ప్రాణాన్ని ఆపాలని పెద్ద ప్రయత్నం చేస్తున్నారు, కాని ఆమె ప్రాణాలు అనంతవాయువుల్లో కలిసిపోయాయి. ఒక శరీరం పనికిరాని కళేబరంగా మారిపోయింది. ఆ వార్తవిన్న కార్తీకను ఎవ్వరూ పట్టుకోలేకపోయారు. చిన్నతనంనుంచి ఆమెకు తల్లే తెలుసు. అన్నదములు, అక్కచెల్లెళ్ళు లేరు. ఎందరు ఓదార్చిన ఆమె దుఃఖాన్ని పోగొట్టలేకపోయారు.

శ్యామసుందరీదేవి మృతదేహాన్ని యింటికి తీసుకువచ్చారు. కావలసినవారంతా వచ్చారు. ఆమెకు అత్తగారు తరఫున మరుదులు,

బావగార్లు లేరు కాని పినమామగారి కొడుకు అన్ని కార్యక్రమాలు పూర్తిచేసాడు. కార్తీక అలా ఏడుస్తూనే ఉంది. శ్యామసుందరీదేవి చని పోయి ౨ వ రోజు. బామ్మ గారు కార్తీకను కంటికి రెప్పలా కాపాడుతోంది. ఉత్తర, స్వాతి, వతి అందరు చూసి వెడుతున్నారు. అభిరామ్ మూడుచోట్లకు తిరుగుతున్నాడు. ఆరోజు రోహిణి చంటి పిల్లాడితో యింటికి వచ్చింది.

కార్తీక బామ్మ గారు వద్దంటున్నా వినకుండా రోహిణిని చూడ టానికి వెళ్ళింది.

"రోహిణీ!" అంటూ వెక్కి వెక్కి యేడ్చింది.

"అయ్యో! ఇంత మంచిపిల్లకా యింత కష్టం. పాపం ఎవ్వరూ లేరు." అనుకున్న రోహిణికి దుఃఖం ముంచుకొచ్చింది.

ఏడుస్తున్న కార్తీకను ఏదార్చాలని దగ్గరగా సుకున్న రోహిణి ఆమెను పట్టుకుని వెక్కి వెక్కి యేడ్చింది. కార్తీక ఆ రాత్రికి తిలెగి యింటికి వచ్చేసింది.

చలపతి బా.గా కోలుకున్నాడు. ఉత్తర అతన్ని యింటికి తిరిగి ∙సుకువచ్చింది. ఉత్తరతో కలిసి మెలిసి బాగా ఉంటున్నాడు.

* * *

"తమ్ముడూ" అనుకుంటూ రాజుతో "మరదలూ" అనుకుంటూ స్వాతితో బాగానే ఉండున్నాడు. ఉత్తర పనిచేసే స్కూల్లో ఆఫీసులో క్లర్కుగా యించింది ఉత్తర. రోజూ రిక్షాలో ఇద్దరు కలిసి వెడు తున్నారు. వాళ్ళిద్దరిని చూసినవాళ్ళకే ఆశ్చర్యంగా ఉంది. "అదంతా ఉత్తర మంచితనం" అంటున్నారు తెలిసిన వాళ్ళంతా. చేతిలో

ఉన్నారు. అందుకే స్కూల్లో అతని తంకూడా ఉత్తరే ౖసు కుంటోంది. అతనికి అవసరం పడినప్పుడు మా తమే డబ్బుయిస్తోంది. కోపం వచ్చినప్పుడు మా తమే డబ్బు యిస్తోంది. కోపం వచ్చినప్పుడు మాత్రం కాస్త తిట్టడం ఉంది. మునపటిలా ఉత్తర పడుండదని అతనికి తెలుసు. అందుకే కోపం వచ్చినా తగ్గించుకుంటున్నాడు చలపతి. లోపల కల్లు, సారాయి తాగాలనిఉన్నా భయపడి అటువైపు వెల్లడం లేదు. అన్నిటికి పట్టించుకుని సాగదీయకుండా ఉత్తర సర్దుకు పోతోంది. అతని స్వభావం ఆమెకు బాగా తెలుసు. అతనిలో మార్పు వచ్చి అతనలా మారినందుకే ఆమె చాలా సంతోషిస్తోంది.

* * *

్రకాంత్‌కు బాబును చూపించింది రోహిణి. చిరునవ్వుతో సమాధానమిచ్చాడు ్రకాంత్. కమంగా అతనిలో మామూలు పరిస్థితి వచ్చేసింది. డాక్టర్లు యింటికి ౖసుకువెళ్ళవచ్చని చెప్పారు.

"్రకాంత్ ఎక్కడకు వెళ్ళి ఉండాలి?" అందరిలో అనుమానం తలెత్తింది.

"కార్తీ! ్రకాంత్ ౖను రుగా ఉండాలనుకుంటున్నాము."

రోహిణి మాటలకి కార్తీక ఉలిక్కిపడింది. కార్తీకను పూ ్తి అర్థం చేసుకుంది రోహిణి. ఆమె అంత మంచివాళ్ళు మరెవ్వరు ఉండరనుకుంది. అందుకే ్రపతి విషయం కార్తీకతో చర్చిస్తోంది,

"అ మిటి రోహి ! అలా అంటావు? అంతయిల్లు మాయిల్లు ఉండగా -రుగా వెళ్ళడమేమిటి?"

"నీకు తె దు కార్తీ! ్రకాంత్ యిక్కడ ఉండడానికి, మీ యింట్లో ఉండడానికి కూడా యిష్టపడం-దు."

"అలా అనకు రోహిణీ! బాబుకు పేరైన పెట్టలేదు? పైగా నీకు ఉద్యోగంలేదు. అతనికి వైద్యం ప్రాక్టీసులేదు. ఎలా బతుకుతారు? మీరు కాస్త స్థిమితపడ్డాక అలాగె వెడుదురుగాని. అయినా మాయింట్లో అతనికీ వాటా ఉంది రోహిణీ! అతను పుట్టి పెరిగిన యిల్లది. పైగా నాకూ ఎవరూ లేరు. మీరిద్దరు వచ్చి యిక్కడ ఉండడమే బాగుంటుంది రోహిణీ!"

"మధ్యలో నాకభ్యంతరం దేనికి కార్తీ! శ్రీకాంత్ అంగీకరించాలి కదా!

"రోహిణీ! అతను అంగీకరించడం కాదు! నువ్వే ఒప్పించాలి తెలిసిందా!"

రోహిణి బాబును కార్తీకకిచ్చి హాస్పటల్‌కి బయలుదేరింది. శ్రీకాంత్ శ్యామసుందరీదేవి యింటికి వెళ్ళడానికి అంగీంరించలేదు. రోహిణితోపాటు వాళ్ళ యింటికి వెళ్ళడానికే ఒప్పుకున్నాడు.

ఆరోజు బాబుకి పేరుపెట్టే రోజు. అందరినీ పిలిచారు. రోహిణి, శ్రీకాంత్‌లు మునపటిలా సరదాగా ఉన్నారు. అందరిని నవ్వుతూ మునపటిలాగె పలకరిస్తున్నాడు. "బావా! నీ కాగితాలు యివిగో" అంటూ అతని చేతిలో పెట్టింది. ఇంట్లో సగంవాట, ఉన్న ఆస్తిలో, డబ్బులో కూడా సగం వాటా!"

"ఇవేమి నాకక్కరలేదు. ను సంపాదించుకుంటాను"

"అలా అనకు శ్రీకాంత్! ఇది చనిపోయిన మా అమ్మ కోరిక! కాదనకు. మీఅమ కూడా సంతోషిస్తుంది".

అందరూ కార్తీక విశాల హృదయాన్ని కొనియాడారు. శ్రీకాంత్ ఏమనుకున్నాడో "సరే" అంటూ అంగీకరించాడు అయింట్లోనే ప్రాక్టీసు పెడతానన్నాడు.

ఉత్తర, ఆమె భర్త, స్వాతి, రాజు, బామ్మ అందరు అక్కడకి

చేరుకున్నారు. అన్ని అవాంతరాలలో విడిపోయిన జంటలు తిరిగి కలుసుకున్నారు.

"అందరిని చూస్తుంటే ఆశ్చర్యంగాను, ఆనందంగాను కూడా ఉంది" అన్నాడు అభిరామ్.

"అవును! అంతా ఆ ప్రేమ మహిమ. అదే ప్రేమబంధం" స్వాతి మాటలకి అందరు పకపక నవ్వారు.

కార్తీక పక్క ఉన్న అభిరామ్‌మీదికి వాలి చిరునవ్వు విసిరింది. అభిరామ్ ఆనవ్వుతో కరిగిపోయాడు.

అది వెన్నెలరాత్రి. వాతావరణం ఎంతో ప్రశాంతంగా ఉంది. పక్కనే ఉన్న జాజి తీగనుండి సువాసనలు గుప్పుమంటున్నాయి. కార్తీక అభిరామ్‌లకు మొదటిరాత్రది. వివాహమై చాలా రోజులయినా వారిద్దరు ఎదలు విప్పి మాట్లాడుకున్నరోజు. మనసుమనసు గుసగుసలాడుకున్నరోజు.

"అభిరామ్ చూసావా నా ప్రేమవిజయం"

"కార్తీ! నిజమే నీ ప్రేమవిజయమే. కాని ఇది నా ప్రేమబంధం చూసావా!" అభిరామ్ తన బాహుబంధంలో ఆమెను బంధించాడు.

కార్తీక విశాలమైన అతని హృదయం మీద వాలిపోయింది ఇద్దరికీ మాటలే కరువయ్యాయి.

సమాప్తం

కార్తీక, క్రాంతుల వివాహం చిన్నతనంలో- పెద్దలు నిశ్చయించారు. మెడిసిన్ పూర్తి సిన క్రాంత్ పై చదువులకు వి. శాలకు వెళ్ళాడు. యుక్త వయస్సు వచ్చిన కార్తీక అభిరామ్‌లు ప్రేమించుకుంటారు. వి. శాల నుండి తిరిగివచ్చిన క్రాంత్‌తో కార్తీక వివాహం జరిగిందా? తల్లిమాట కాదనలేని కార్తీక ఎవరిని వివాహం చేసుకుంటుంది? క్రాంత్ కార్తీకకు మేనత్త కొడుకు నా? అడుగడుగునా ఉత్కంఠతను కలిగిం- ప్రేమ బంధం నవల చదవండి.

Cover Printed at Sri Balaji Art Printers, Chikkadpally, Hyd-20.

